*Issued on 19—7—1956*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

# OFFICIAL REPORT

## WEDNESDAY, 27TH JULY, 1955.

## VOLUME V — No. 3.

CONTENTS




PRINTED BY [illegible] & COMPANY, [illegible]
FOR THE [illegible], GOVERNMENT PRESS,
ANDHRA [illegible]
[illegible]

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Wednesday, 27th July, 1955.*

The House met in the Assembly Hall, Kurnool at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

### SHORT NOTICE STARRED QUESTIONS.

#### Distribution of Ammonium Sulphate.

261-A

* 1293-G.—*Q*: SRI PRAGADA KOTAIAH :— Will the Hon. the Chief Minister be pleased to state the policy laid down for the distribution of Ammonium Sulphate for the year 1955 ?

THE HON. SRI B. GOPALA REDDI :—During the current year, the distribution of Ammonium Sulphate to the ryots is being effected through the agencies of selected private firms called tender firms and Co-operative Societies. The entire distribution in the districts of Kurnool and Anantapur has been entrusted to Co-operative Societies, while in the border districts of Chittoor, Nellore and Srikakulam, 75% of the estimated requirements of the fertiliser are reserved for distribution through Co-operative Societies, the balance of 25% being made available for distribution through the tender firms. In all other areas both the agencies of tender firms and Co-operative Socities operate side by side.

SRI PRAGADA KOTAIAH :— అధ్యక్షా, ఈ రాష్ట్రములో ప్రభుత్వము నియమించిన tender firms ఎన్ని ? వారు ఏఏ ప్రదేశాలలో వున్నారు ? వారికి సంవత్సరానికి ammonium suplhate ఎన్నివేల టన్నులు వస్తున్నది ? దీనిలో టన్ను ఒకటింటికి ex-mill rate ఎంత? retail rate ఎంత ?

THE HON. SRI B. GOPALA REDDI

| | |
|---|---|
| I. Srikakulam Dt.<br>Visakhapatnam Dt.<br>East Godavari Dt. | (1) Lloyd's Commercial Corporation.<br>(2) Sri Associated Commercial Syndicate.<br>(3) Sri Sathi Potha Reddi & Co. |

| | | | |
|---|---|---|---|
| II. | West Godavari Dt.<br>Krishna Dt.<br>Guntur Dt. | (1)<br>(2) | Sri Rao & Reddi & Co.<br>The Indian Tobacco Corporation. |
| III. | Nellore Dt.<br>Chittoor Dt.<br>Cuddapah Dt. | (1)<br>(2)<br>(3) | Coromandal Corporation.<br>Viswanathan & Co.<br>Sreeramulu & Co. |
| IV. | Kurnool Dt.<br>Anantapur Dt. | | Co-operative Societies only. |

ఇందులో యితర supplementary questions అన్నింటికి జవాబు నావద్ద information లేదు.

SRI M. NAGI REDDI :—Ammonium sulphate ను agricultural demonstrators ద్వారా రైతులకు అందిస్తే సులభముగా అందుతుంది ? అలాంటి ప్రయత్నాలుచేయుటానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ? ఆహార పంటలధరలు వెనుకటివి యిప్పటివి రెండూ compare చేస్తే, యివి ఎక్కువగా వున్నవికాబట్టి, యివి తగ్గించే ఆలోచన ప్రభుత్వానికి వున్నదా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ప్రశ్నలో రెండవ భాగానికి జవాబు. ఇండియా గవర్నమెంటువారికి యీ విషయము వ్రాసివున్నాము వారు గూడా ఆలోచిస్తున్నారని తెలిసింది.

మొదటిభాగం, ఎట్లాఅమ్మితే బాగుంటుంది అని అడిగితే, యిప్పుడు వున్నటువంటి arrangement జనవరి 1 వ తేది మొదలు డిశంబరు ఆఖరువరకూ వుంటుంది. తరువాత 1956 వ సంవత్సరము విషయములో ఇప్పుడువున్న పద్ధతి ప్రకారము చేస్తే బాగుంటుందా లేదా, లేక co-operative societies ద్వారా యీపని నిర్వహిస్తే బాగుంటుందా, అనే విషయము ప్రభుత్వము తప్పకుండా ఆలోచిస్తుంది.

SRI L. LAKSHMANA DAS :— అధ్యక్షా, వ్యవసాయపు రోజులు అప్పుడే వచ్చాయి. ఇంతవరకు Ammonium Sulphate సరిగా supply కాలేదు. అందువల్ల అదనుకు supply చేయుడానికి ప్రభుత్వము తగినచర్యలు తీసుకుంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—నిన్ననే, Agriculture Demand వచ్చినప్పుడు నేనుచెప్పాను. ఎరువులు సింధ్రిఫ్యాక్టరీనుంచి special trains లో move అవుతున్నవి. బహుశ ఒకవారములోపల అన్ని జిల్లాలకు సక్రమంగా సప్లయి అవుతాయని ఆశిస్తున్నాను.

SRI V. VISWESWARA RAO :—పంటల విషయములో కేంద్రప్రభుత్వానికి వ్రాసియున్నామని, వారు ఆలోచిస్తున్నారని అంటున్నారు. ఇప్పుడు సామా

స్యంగా season కాబట్టి బహుశ యీ నెల ఆఖరుకో లేక వచ్చేనెల 15 వ తేదీకో వారివద్దవున్న అమోనియము ఉపయోగించడము పూర్తిఅయిపోతుంది. అటువంటప్పుడు రైతులు ఎక్కువగా వుపయోగించేటటువంటి యీరోజులలో ఫర్టిలైజర్సును ఆలోచించకుండా ఏదోఆలోచిస్తున్నామని అంటే, రైతులకు పనిఅంతా అయిపోయిన తరువాత, యీ ఆలోచన అంతా జరుగుతుంది అనుకుంటాను.

THE HON. SRI B. GOPALA REDDI :— ఇది Government of India వారు చేయవలసి వున్నది. వారు కొన్నికోట్ల రూపాయలు ఖర్చుపెట్టి Sindhri Fertiliser Factory ఒకటిపెట్టారు. అదివారికి గిట్టుబాటు అయ్యేటట్టుగా చూచుకోవాల్సిన విధాయకం గవర్నమెంటుమీద వుంటుంది. వారి నిర్ణయం బహుశ యీ సంవత్సరానికి మనకు అందకపోవచ్చును. బహుశ next year కు అంటే 1956 కు అయినా అందుతుందేమోనని ఆశిస్తున్నాను.

SRI PRAGADA KOTAIAH:— అధ్యక్షా, ఈ 8 Tender firmలో ఆరు మద్రాసులో వున్నవని అంటున్నారు. వాటి స్థానంలో ప్రభుత్వమే Chief Agent గా వుండి distribute చేయడానికి పూనుకుంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :— పంపిణీ విషయములో తప్పకుండా ఆలోచిస్తున్నామని చెప్పాను. ఇప్పటివరకూ వున్న ఏర్పాటుమాత్రం డిశంబరు ఆఖరు వరకూ వుండి తీరాలి. .

SRI A. KALESWARA RAO :— Fertiliser factory ఆంధ్ర దేశములో లేనందువల్ల Ammonium sulphate వగైరాలు బట్వాడా చేయడము ఆలస్యమవుతున్నది. కనుక ఆ విషయములో ప్రభుత్వము ఆలస్యము కాకుండా ఏమి చర్య తీసుకుంటున్నారు ?

Mr. SPEAKER :—We are now at distribution and not production.

SRI D. KONDAYYA CHOWDARY :—ఇప్పుడు Ammonium Sulphate దాదాపు 70 వేల టన్నులదాకా రైతులకు పంచుతున్నారు. అందుకుగాను మనము యీ tender firms కు యిచ్చే రేటుకు retail రేటుకు తేడా, దాదాపు 25 రూపాయలవరకూవున్నట్లు కనబడుతున్నది. అలాంటప్పుడు సుమారు 14 లక్షల రూపాయలదాకా యీ 8 tender firms కు చెందుతున్నది గదా ! ఇటువంటి సందర్భములో ప్రభుత్వమే వీటి distribution undertake చేస్తే యీ ఎనిమిది firnes సంపాదించుకునే 14 లక్షల రూపాయల లాభము మన ప్రభుత్వానికే వుండదా ?

THE HON. SRI B. GOPALA REDDI:—retial prices అంతా కూడా నిర్ణయించింది Government of India వారే, అది అంతా వారికే

లాభముకాదు. వాళ్లకు ఆయ్యే ఖర్చులు అన్నీకూడా ఒక margin లో పెట్టుకో వలసివుంటుంది. గనుక యివన్నీకూడా లెక్కలువేసుకునే Government of India వారు prices నిర్ణయించారు.

SRI P. RAJAGOPAL NAIDU :—Ammonium Sulphate ను జిల్లాల మధ్యపంచడములో ఏ basis నవలంబిస్తున్నారు ?

THE HON. SRI B. GOPALA REDDI :—గత 1, 2, 3 సంవత్సరాలు ఎంతెంతకొనుగోలు చేశారో, ఎట్లాపంపిణీచేశారో దానినిబట్టి నిర్ణయిస్తారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Margin of profit ఎంత వుంటుంది ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఒక్కొక్క జిల్లాకు ఒక్కొక రకంగా వుంటుంది. అన్నిజిల్లాలలోనూ uniform గా వుంటుందని చెప్పటానికి వీలులేదు. అక్కడక్కడవున్న demand ను బట్టి వుంటుంది. సరఫరాకుకూడా యిది సంబధించి వుంటుంది. కేంద్రప్రభుత్వమువారే అదంతాకూడా నిర్ణయించివున్నారు.

*Services of Dr. Modi.*

261-B.

* 1324-A. *Q.*—SRI S. NARAYANAPPA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state :

**(a) whether it is a fact that the Andhra Government intend to make use of the free services of Dr. M. C. Modi, the Eye-Surgeon ;**

**(b) if so, whether the Government have addressed Dr. M. C. Modi to spare his services ; and**

**(c) if not, the reasons therefor ?**

**THE HON. SRI K. VENKATA RAO :—**

**(a) The answer is in the affirmative.**

**(b) Dr. M. C. Modi has agreed to spare his services.**

**(c) Does not arise.**

SRI S. NARAYANAPPA :—DR. Modi గారు ఆమోదించినట్లుగా మంత్రిగారు సెలవిచ్చారు, ఆంధ్రరాష్ట్రములో వారియొక్క services ను సక్రమంగా utilise చేసుకోటానికి ఎన్ని కేంద్రాలు పెట్టుతారు ? అందుకోసము ప్రభుత్వము ఎంతడబ్బు వెచ్చించదలచిందో చెబుతారా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పటికి చిత్తూరు నుంచి, కడపనుంచి తూర్పుగోదావరినుంచి ప్రభుత్వానికి విజ్ఞప్తులువచ్చాయి. కొబట్టి యీ మూడుచోట్లలోనే ఏర్పాటు చేస్తున్నాము.

SRI T. RAMACHANDRA REDDI :—నంద్యాలప్రజలు డాక్టరు మోడీగారి సర్వీసెస్ కావాలని ప్రభుత్వానికి విజ్ఞప్తిపంపారు. దానికి ప్రభుత్వము యేమైనా ఏర్పాటు చేశారా ?

THE HON. SRI K. VENKATA RAO :—నాకు యింతవరకు నంద్యాలనుంచి కబురు రాలేదు.

SRI C. SUBBARAYUDU :—ఒక్కొక్క సెంటరు నడపడానికి అయ్యేఖర్చులో ఎంతభాగము ప్రభుత్వము భరించదలచుకున్నది ? డబ్బురూపేణా కాకుండా, యితర services రూపములో ఏవిధమైన సహాయము డాక్టరు మోడీ గారికి చేయదలచుకున్నారో తెలియజేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—DR. Modi గారికి కావలసిన సహాయము అంతాచేస్తునేవున్నాము. Nurses వగైరావారిని వారివద్ద పని చేయటానికి పంపుతున్నాము. డబ్బు విషయములో ఇంతే అని స్థిరంగా యింతవరకు ఏమీ నిర్ణయము చేయలేదు. వచ్చిన దరఖాస్తులనుబట్టి, వూళ్ళవారు యిచ్చేడబ్బునుబట్టి ప్రభుత్వము యిస్తుంది. ఫలానావారికి యింతేఅని alltoment లేదు.

SRI S. BRAHMAYYA :—ధరఖాస్తులురాని జిల్లాలలోకూడా వారి సర్వీసెస్ ఉపయోగపడేటట్లు ప్రభుత్వము చూస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—దాన్నిగురించి ఎప్పుడు కూడా ఆలోచించటానికి వీలుండదు.

SRI A. BAPINEEDU :—తూర్పుగోదావరి జిల్లాలో సెంటరు పెట్టినప్పుడు, పశ్చిమగోదావరిజిల్లాలోగూడా centre పెట్టటానికి ప్రభుత్వము ఆలోచిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—పశ్చిమ గోదావరిజిల్లా నుంచి, గోదావరి రైలు బ్రిడ్జిదాటి అవతలకువెళ్లితే, తూర్పు గోదావరిజిల్లాకు వెళ్లవచ్చు. రాజమండ్రిలోనే క్యాంపుపెట్టి పనిచేస్తారు.

SRI N. C. SESHADRI :—డాక్టరు మోడీగారు మైసూరు ప్రాంతంలో పర్యటించినప్పుడు, వారికి petrol charges మైసూరు ప్రభుత్వము యిస్తూవచ్చింది. అటువంటి ఏర్పాటుఅయినా చేయటానికి మన ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—డాక్టరు మోడీగారు నన్ను petrol charges అడగలేదు. వారు అడిగిన సహాయమంతా ప్రభుత్వము తప్పకుండా యిస్తున్నది.

SRI P. SREERAMULU :—డాక్టరు మోడీగారి సర్వీసెస్ కావాలంటే ధరఖాస్తులు పెట్టవలెనా, లేక మహజరుపంపవలెనా ? మహజరుఅంటె, దానిలో ఎంతమంది సంతకాలు వుండాలి ? దానికి procedure ఏమిటి ?

THE HON. SRI K. VENKATA RAO :—Sreeramulu గారు ఒక్కరు పంపితే చాలు. అయితే దానితోగూడా పదివేలరూపాయలకు ఒక్క cheque కూడ పంపించాలి. (Laughter)

SRI P. BASI REDDI :—కడపజిల్లాలో ఏనెలలో పెట్టదలుచుకున్నారు ?

THE HON. SRI K. VENKATA RAO :—మూడువంతులు డిశెంబరులో పెట్టదలచుకున్నాము.

SRI C. SUBBARAYUDU :—తాడిపత్రిలో క్యాంపునడిపినప్పుడు ఇతర ప్రభుత్వాలు చేస్తున్నటువంటి సహాయము మాదిరిగానే ఈ ప్రభుత్వముకూడా చేయాలని మేము రిప్రజెంటేషను పంపించాము. దానిపై ప్రభుత్వము ఏదైనా నిర్ణయం తీసుకుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—మీరు చేసిన రెప్రసెంటేషను అలావుండగావారు మామీద కొన్ని షరతులు విధిస్తున్నారు. వారికి సరిపోయేటటువంటి అనుకూలపద్ధతిపైన ఇది వెడుతోంది. ఇది నాన్ అఫిషియల్ బిసినెస్. అంతేకాని మోడీగారిని ఆ విధముగా చేయండి, ఈ విధముగా చేయండనే హక్కు మనకులేదు.

SRI L. LAKSHMANA DAS :—డాక్టరు మోడిగారి సర్వీసుకు ఎవరో కొందరు అప్లికేషన్లు పెట్టారన్నారు. వారి సర్వీసు చాలా అవసరము గనుక, రాష్ట్రము అంతట, అన్నిజిల్లాల్లోకూడా ప్రభుత్వము ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—అది ప్రభుత్వము చేతులలో లేదు.

SRI P. RAJAGOPAL NAIDU :—అది ప్రభుత్వము చేతులలో లేదు. ఒక నేత్రవైద్యుడు ఉన్నాడని, వారు ఫలానా, ఫలానా conditions మీద వచ్చి వైద్యముచేస్తారని ప్రభుత్వము ప్రకటన చేస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :— ఈ మధ్య పేపర్లు నిండా మోడీగారి న్యూసే. అందులో ముఖ్యముగా కర్నూలులో ఈమధ్య 22 రోజులో 30 రోజులో కృషి చేసి వెళ్లారు. ఇది అందరికీకూడా తెలుసును.

SRI VIJAYABHASHKARA REDDI:— డాక్టరు మోడీగారేగాక దేశంలో ప్రసిద్ధులైన వైద్యులు ఇతరులు వుండగా వారినికూడా పిలిచి మన దేశములో పేదవారికి నిత్యఅందుబాటులో వుండేట్లు ఇంకా ఏమైనా ప్రత్యేకంగా సెంటర్లు ప్రభుత్వము నడిపిస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :— డాక్టరుమోడీగారు ప్రసిద్ధమైన వైద్యులు. ఒక కానీకూడా పుచ్చుకోకుండా ప్రవీణతతో వైద్యము చేసే శక్తి దేవుడు ఆయనకు ఇచ్చాడు. ఆయన దానిని వినియోగిస్తున్నారు. ఇతర డాక్టర్లు ఎవరు అయినా అలాంటి సమర్థులైనటువంటివారు వచ్చి పూరికే పని చేస్తాము అంటే నమస్కారముచేసి తీసుకొంటాము.

SRI P. VENKATASUBBAYYA:— 10 వేల రూపాయలు ఇవ్వలేని ప్రదేశాలకు ఈ వైద్యసహాయము అందచేయరా ?

THE HON. SRI K. VENKATA RAO :— 10 వేల రూపాయలు యివ్వలేనివాళ్లు దగ్గరవున్న ప్రదేశాలకు వెళ్లితే సరిపోతుంది.

SRI S. VEMAYYA :— ఇప్పుడు ఆ డబ్బు ఇచ్చిన సెంటర్లలో స్పెషల్ విషయముకంటె చాలా head-quarters ఆస్పత్రులకువెళ్లి అక్కడవున్నటువంటి రోగులకు తరువాత అక్కడవున్న డాక్టర్లకు వీరిసహాయమును అందేట్లు చేస్తారా ?

THE HON. SRI VENKATA RAO :— ఆయన పాపం M. B. B. S., ప్యాసుకాలేదు. ప్యాసుఅయినవారందరికికూడా ఆయనమీద కొంచెము కోపము. అందుచేత వారువున్న చోట సాధారణంగా పని చేయరు.

SRI A. SATYANARAYANA MURATHI :— మన మంత్రిగారు 10 వేల రూపాయలు చెక్కపంపించాలని చెప్పారు. ఒకొక్క కాంపుకు ఖర్చుఎంత అవుతుంది? గవర్నమెంటు ఎంత ఇస్తారు ? ప్రజలు ఎంత ఇవ్వాలి ?

THE HON. SRI K. VENKATA RAO :— పాలకొల్లుకు 15 వేల రూపాయలు అవుతుంది. మిగిలినచోట్ల అంతాకూడా సాధారణముగా కాంపుకు 10 వేల రూపాయలు అవుతుంది. సాధారణంగా స్థానికులే ఆ 10 వేలు భరించాలి. ఇంతవరకు గవర్నమెంటుదగ్గరనుంచి కొంత ఖర్చుపుచ్చుకొన్నట్టిది కర్నూలు కాంపు మాత్రమే.

SRI RAJA SAGI SURYANARAYANA RAJU :— దగ్గరవున్న కాంపుకు వెళ్ళాలని మంత్రిగారు సెలవిచ్చారు. అక్కడవరకు వెళ్లలేని పేదవాళ్ల మాట ఏమిటి ?

THE HON. SRI K. VENKATA RAO :— అక్కడికి వచ్చినవారికి వైద్యం చేస్తున్నారు. కాబట్టి నాలుగు అడుగులువేస్తే సరిపోతుంది.

SRI M. NAGESWARA RAO :—అధ్యక్షా! డాక్టరుగారు ఉచితంగా మందులు ఇస్తారుఅంటూ, వారి సర్వీసుఅంతా కూడా ఉచితమే అంటూ, మధ్యన ప్రభుత్వానికా ఈ 10 వేల రూపాయలు ?

THE HON. SRI K. VEKATA RAO :— అక్కడకువచ్చి నటువంటి వారికి ఊరికే భోజన సదుపాయాలుచేస్తాము. వూరికే అపరేషన్లు చేస్తారు. అందుకు ఆయనకు ఖర్చులు వున్నాయి. గవర్నమెంటువారికి దీనితోపాటు ఒక బహుమానం కూడా నాగేశ్వరరావుగారు ఇప్పిస్తే, ఇంకో మాటు, ఇంకో కాంపు మీ వూళ్లో పెట్టిస్తాము.

MR. SPEAKER :—The two questions Nos. 261 C & 261 D may be answered together and supplementaries will follow for both the questions.

*Removal of Panchayat Board Presidents from Office.*

261-C.

* 1391-B. *Q.*—SRI PILLALAMARRI VENKATESWARLU :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(*a*) how many Panchayat Board Presidents were removed from office during the year 1954 since March up-to-date ; and

(*b*) the reasons for their removal from office ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(*a*) Thirty Presidents have been removed from office by the Inspector-General of Local Administration since March 1954 to-date.

(*b*) Ten of them were removed for misappropriation of panchayat funds and falsification of accounts and eight for retention of heavy cash balances on hand and drawing funds from Banks or Sub-Treasury without valid justification. Ten were removed for non-observance of rules under the Madras Village Panchayats Act, one for flouting the orders

of the supervising and competent authorities and one for abusing powers.

*Removal of Panchayat Board Presidents from office.*

261-D.

*28. *Q.*—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state the number of Panchayat Board Presidents who were removed from their office in the State for the year ending 1954 for their mal-administration ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

Attention is invited to the answer to the short notice question No. 1891-B given on 25th July 1955.

SRI PILLALAMARRI VENKATESWARULU :—10 మందిని non-observance of rules క్రింద తొలగించామని చెప్పారు. ఏరూల్సు అబ్జర్వు చేయలేదని ? వాటి స్వభావము ఏమిటి ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఒక్కొక్క ఊరికి కొన్ని "నాన్ అబ్జర్వెన్సు" అనివున్నది. కాబట్టి ప్రత్యేకంగా ఏవ్యక్తి విషయము కావాలో ప్రశ్నపంపిస్తే ఆ ప్రెసిడెంటును ఏరూలుక్రింద తీసివేశారో చెబుతాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ 10 మంది ప్రెసిడెంట్లు ఏఏ వూళ్లవారో తెలియజేసినట్లయితే అలాగే ప్రశ్న వేసేవాళ్ళము. వీరు చెప్పలేదు.

THE HON. SRI A. B. NAGESWARA RAO :—నాన్ అబ్జర్వెన్సు ఆఫ్ రూల్సు క్రింద......

1. శంకరరావుని, రత్తయ్యా, ఏటుకూరు, గుంటూరుజిల్లా.
2. నంబిశేషయ్యా, కల్లూరు, కర్నూలుజిల్లా.
3. K. V. శేషారెడ్డి, కొరుమంచి, కృష్ణాజిల్లా.
4. D. సుబ్బయ్యా, పెదముత్తేవి, కృష్ణాజిల్లా.
5. P. వెంకట్రాయుడు, నాగులుప్పలపాడు, గుంటురుజిల్లా.
6. S. A. RAO, కదిరి, అనంతపురంజిల్లా.
7. CH. రామచంద్ర రావు, చెఱుకువాడ, పశ్చిమగోదావరిజిల్లా.
8. P. బుల్లబ్బాయి, కొమరగిరి, తూర్పుగోదావరిజిల్లా.
9. D. ముత్తయ్యా, మృత్యుంజయపురం, గుంటూరుజిల్లా.
10. B. బుల్లయ్యా, తిరుమలాయపాలెం, తూర్పుగోదావరిజిల్లా.

MR. SPEAKER :—Is the Hon. Member Sri Pillalamarri Venkateswarlu satisfied with the list ? Have you any more supplementaries ?

SRI PILLALAMARRI VENKATESWARLU :—Yes, Sir, because it is an important question.

ఈ బల్లెబ్బాయిని ఏ rules ను observe చేయలేదని తొలగించారో చెబుతారా?

THE HON SRI A. B. NAGESWARA RAO :— ప్రత్యేకంగా ప్రశ్న వేస్తే చెబుతాను.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా ! ఈడబ్బు అపహరించి నందుకు, cash balance ఎక్కువగా వుంచుకొన్నందుకు తొలగించారని చెప్పారు. అలాగే ఇంకేమైనా పంచాయితీలు వున్నాయా ? కృష్ణాజిల్లా కంకిపాడు పంచాయతీ ప్రెసిడెంటు చాలా డబ్బు దుర్వినియోగపరిచారని రిపోర్ట్సు వచ్చాయి. వాటిపైన రిపోర్ట్సుకూడా పంపించారు. వాటిమీద ఏమైనా చర్య తీసుకోడానికి ప్రయత్నం చేస్తున్నారా ?

THE HON SRI A. B. NAGESWARA RAO :—ఇటువంటి రిపోర్టులు ప్రభుత్వానికివస్తే లోకలుబోర్డుల ఇన్‌స్పెక్టరు గారికి పంపించి తప్పకుండా చర్య తీసుకుంటాము.

SRI P. RAMACHARULU :—ఇంకా తొలగించవలసిన పంచాయితీ ప్రెసిడెంట్లు చాలామందిఉన్నారు. ఈ ప్రతిపక్ష విమర్శలకు భయపడి చర్యలు తీసుకోకుండా వూరుకుంటారా ? లేక న్యాయము విచారిస్తారా ?

THE HON. SRI A. B. NAGESAWRA RAO :—అయ్యా, ప్రతిపక్షులకు ప్రభుత్వము ఎప్పుడూ జడవటమనేదిలేదు. ఏదైనా ఉంటే అందరిమీద చర్య తీసుకోడానికి సిద్ధంగావున్నాము.

SRI M. NAGI REDDI :—నాన్ అబ్సర్వెన్సు అఫ్ రూల్సు క్రిందతీసివేసినట్లు, అదేవిధముగా heavy cash balance వున్నందుకు తీసివేసినట్లు మంత్రిగారు సెలవిచ్చారు. చదువురానివాళ్లు కొంతమంది, కొద్దిగా చదువుకున్నవాళ్లు అనేకమంది వున్నారు. రూల్సుగురించి వారికి అంతగా తెలియదు. అందువల్ల వాళ్లకు ఏదైనా ఒక హెచ్చరికచేసి ఇకముందు అలాంటిది జరుగకుండా చేయటానికి అధికారాలు ప్రయత్నిస్తారా ? ఇప్పుడు బంజరు సత్యాగ్రహము సందర్భంలో పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు పాల్గొన్నందుకు ఆయనకు శిక్షవిధించారు. తరువాత విడుదల చేశారు. అందువల్ల అలాంటివాళ్లమీద, నేరారోపణలు లేవుకాబట్టి వాళ్లను మళ్లీ పదవిలోకి ప్రవేశపెడుతారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఇటువంటివి ప్రత్యేకంగా అర్జీలు పెట్టుకుంటే ప్రభుత్వం విచారిస్తుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—లెక్కలు వ్రాయడంలో రోజుకు ఒకరూలు మారడమువల్ల ఇబ్బందిగా ఉంది. కొత్తవారు, సామాన్యజనం పంచాయితీ బోర్డు ప్రెసిడెంట్లుగా వున్నారు. వాళ్లకు ఎక్కువ ఇబ్బందులు వస్తున్నాయి కనుక వారికే లెక్కలపొరపాటువల్ల వాళ్లను తొలగించ నవసరము లేదని ప్రభుత్వము భావిస్తుందా? ఏదైనా పెద్ద ప్రమాదమువచ్చేసి డబ్బు దిగమ్రింగడము, లేకపోతే బుద్ధిపూర్వపు ధనాపహరణ, వంటి మేజరు నేరాలైవుంటే తప్ప సాధారణంగా వారి అమాయకత్వాన్ని గుర్తించేట్లు చేస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—వావిలాలవారు రోజూ ఒకరూలు మారుతోందని అన్నారు. రోజుకు ఒకరూలు మారలేదు. 1951లో పంచాయితీ Act ఒక్కసారే ఏర్పరచబడింది. అది ఇప్పటికికూడా అమల్లో నే ఉన్నది. తరువాత తప్పుడు account వ్రాసినందుకు, ఉండవలసిన డబ్బుకంటే ఎక్కువగా ఉంచుకొనినందుకు కొందరు పంచాయితీబోర్డు ప్రెసిడెంట్లు డబ్బు కట్టవలసింది కట్టక వారు పొందుతున్నట్లుగాకూడా రుజువు అయినందువల్ల వారు తీసివేయబడ్డారు. ఇటువంటివారి విషయంలో ఏమాత్రము ఆలోచించడానికి అవకాశము లేదు.

SRI S. NARAYANAPPA :—పంచాయితీ అధ్యక్షులను తగ్గించిన లిస్టులో మేజరు పంచాయితీల Presidents ఎంతమంది ఉన్నారు? మైనరు పంచాయితీల Presidents ఎంతమంది ఉన్నారు? వీరు వాడుకొన్న డబ్బును రాబట్టుకొనుటకు, ప్రాసిక్యూషన్ చర్యలుజరిపారా? లేక ఎట్టిప్రయత్నము ప్రభుత్వము చేస్తుంది?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—వేరేప్రశ్న వేస్తే ఎంతవాడుకున్నది వివరములతోకూడా చెబుతాను. అందులో minor Panchayats వుంటాయి major panchayats ఉంటాయి.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా! సహజముగా చట్టాలు అతిక్రమించే కొందరు ఈ పంచాయితీబోర్డులలోచేరి చాలా తికమకలు చేస్తున్నారు. వారిని తగ్గించడానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— తప్పకుండా పూనుకొంటుంది,

SRI A. KALESWARA RAO :—తప్పుచేసిన వాళ్ళను ఈ విధముగా శిక్షించడమువల్ల మొత్తముమీద పంచాయితి పరిపాలన అభివృద్ధిలోకి వచ్చినదని ప్రభుత్వమువారు నమ్ముతున్నారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—తప్పకుండా నమ్ముతున్నారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—డబ్బు mis-appropriate చేయడానికి అలవాటు పడినవారు పంచాయితీబోర్డు డబ్బును దుర్వినియోగము చేస్తున్నారు. అటువంటివారిని తగ్గించడానికి ప్రభుత్వము చర్యతీసుకుంటుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఎవరైనా సరే వినకుత లేకుండా ప్రభుత్వము చర్యతీసుకుంటుంది.

SRI M. NAGI REDDI :—Non-observance of rules క్రింద గుంటూరుజిల్లా నర్సాయపాలెం పంచాయితీబోర్డు Presidentను చెట్లు నాట లేదనియు, ఒకనెలలో మీటింగు పెట్టలేదని, రెండు చార్జీలతో తీసివేశారు. కనుక అలాంటివారిని పదవులలో ఉంచడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అటువంటి వారు appeal చేసుకుంటే ప్రభుత్వమువారు ఆలోచిస్తారు.

SRI T. GOPALAKRISHNA GUPTA :—నూతనముగా ఏర్పడిన యీ పంచాయతీబోర్డులలో అనేకమంది Presidents కు మోసము, ద్రోహము తెలియకపోయినా, Assistant Panchayat officer లు వీరికి మోసము ద్రోహము నేర్పి వీరిని చెడుపుకున్నారు. వారిమీద ప్రభుత్వమువారు ఏమైన చర్య తీసుకుంటుందా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అటువంటి అధికారుల విషయములో కొన్ని specific instances ప్రభుత్వము నోటీసులోకి వస్తే తప్పకుండా చర్యతీసుకుంటుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఒక case లో flouting the orders of the superiors అని చెప్పారు. ఆ కేసు ఎవరిమీద ? ఆ అర్డరు ఏమిటి ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—Flouting of orders అని మాత్రమే నేను చెప్పలేను. కాని ఆమనిషి T. భూపారెడ్డి, కుతుకులూరు పంచాయితీ, తూర్పు గోదావరి జిల్లా.

SRI K. V. S. PADMANABHA RAJU :—ప్రస్తుతము Inspector of Local Boards వారు supersede చేయాలని చెప్పినటువంటి కేసులు pending లో ఎన్ని ఉన్నవి ?

THE HON SRI A. B. NAGESWARA RAO :—నేను చెప్పలేను, వేరే ప్రశ్న వంపించండి.

SRI P. SUNDARAYYA :—ఈ పంచాయతీబోర్డు అధ్యక్షులు ప్రజల చేత ఎన్నుకోబడుచున్నారు. కాబట్టి వారు తప్పులుచేసినప్పుడు ప్రభుత్వంకంటే ప్రజలే ఏదైనా చేసేటట్లు అధికారమువిస్తే ఈ అవకతవకలు లేకుండా పోవును గదా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ప్రస్తుతము వున్న Act ప్రకారము అటువంటిమార్పు చేయడానికి వీల్లేదు.

## STARRED QUESTIONS.

*Standardizing the prices of Commercial Crops.*

262—

*332 Q—SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether the Government propose to standardize the prices of the commercial crops like tobacco, chillies, tamarind, groundnut and other oil seeds ; and

(b) if so, the steps taken so far ?

THE HON. Sri B. GOPALA REDDI :—

(a) No. The question of standardization of prices of commercial crops can be tackled effectively on All India basis only and is therefore beyond the competence of the State Government.

(b) This does not arise.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— కేంద్రప్రభుత్వము చేయవలసినప్పటికి రాష్ట్రప్రభుత్వము యీ విషయములో సూచనలు చేయుట ప్రయోజనకరం అవుతుంది గనుక రాష్ట్రప్రభుత్వము చర్యలుతీసుకొని కేంద్రప్రభుత్వమునకు సలహా యిస్తారా ?

THE HON SRI B. GOPALA REDDI:—Standardisation of prices అన్న విషయం చాలా పెద్ద విషయం. అది Government of

India వారు చేద్దామన్నా చాలా స్వల్పమైన విషయం కాదు. అందుచేత ఈ గవర్నమెంటువారు Government of India వాళ్ళకు ఏవిధమైన సిఫార్సు చేయలేదు.

SRI P. KODANDARAMAYYA :—Prices తగ్గిపోవడమువల్ల గత సంవత్సరము, పై సంవత్సరముకూడా మిరప, పొగాకు పండే ప్రదేశాలలో వాటికి చాలవరకు ధరలు తగ్గిపోయినవి. అందుచేత గవర్నమెంటు కొంత సదుపాయము చేయడానికి ఆలోచిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :— తప్పకుండా ఆలోచిస్తాము. మిరప, పొగాకు విరివిగా export licence లకుకూడా యివ్వవలసినదిగా Central Government ను కోరుతున్నాము.

SRI M. NAGI REDDI :—పారిశ్రామిక వస్తువులధరలకన్న comparative గా చూచినప్పుడు పారిశ్రామిక ముడిసరకుల ధరలు తక్కువగా ఉంటున్నవి. వాటిని equalise చేయడానికి ప్రభుత్వము పూనుకుంటుందా ?

THE HON SRI B. GOPALA REDDI:—ఈ ప్రభుత్వము ఆలోచించే విషయము కాదని మొదటనే విన్నవించాను.

SRI A. SATYANARAYANA MURTHI :—Prices stabilise చేయక పోయినట్లయిన general economy కి భంగమువస్తుంది. ఇది all India కు సంబంధించింది కనుక మన States అన్నీ India Government మీద presure తీసుకురావాలి. ఆ విధముగా మన State Government proposals పంపించడానికి సిద్ధముగా నున్నారా ?

THE HON SRI B. GOPALA REDDI :—ముందు State Governments ను సంప్రదించి కదా చెప్పవలసినది. అసలు ఆ ఉద్దేశ్యమే మాకు లేదు.

SRI M. NAGESWARA RAO :—అధ్యక్షా ! Central Government ధరల స్థిరీకరణ చేయవలసినది అని చెప్పారు. అయినా 1950 లో composite Madras State లో ఉన్నప్పుడు minimum prices fixation committe ని రాష్ట్రప్రభుత్వము పొగాకుకొరకు నియమించింది. అటువంటిది ఏదైనా ఉంటే దానిని ఏర్పరచడానికి ప్రయత్నము చేస్తుందా !

THE HON SRI B. GOPALA REDDI :—ఆలోచిస్తాము.

SRI P. RAJAGOPALA NAIDU :—ధరలు పడిపోతున్నవి. ఈ మధ్య కేంద్రప్రభుత్వము 5 లక్షల టన్నుల బెల్లపుపొడిని ఖరీదుచేసినట్లువిన్నాను. చిత్తూరుజిల్లాలో కొన్నివేల టన్నుల బెల్లపుపొడి ఉన్నది. దానిని analyse చేసి వారు, చక్కెర అవుతుందని అన్నారు. దానిని refineries వారు కొనడానికి ఏర్పాట్లు చేయాలని కేంద్రప్రభుత్వానికి రాష్ట్రప్రభుత్వం సలహాయిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—మొన్న Agriculture demand మీద చెప్పాను. దాని విషయములో ఒక కమిటీ వేసినారు. మన Board Member కూడా వారితో పర్యటనచేసి ఈవిషయం పరిశీలనచేయవలసినదిగా కోరినాము. చిత్తూరులో ఎక్కువ బెల్లపుత్పాది ఉన్నది. దానిని refineries వారు కొనడానికి సిద్ధముగాఉంటే ప్రభుత్వానికి ఆక్షేపణలేదు.

SRI C. P. THIMMA REDDI :—అధ్యక్షా, మామూలుగా విత్తనముల time లో ఎక్కువ ధర ఉంటుంది. అమ్మకం time లో తక్కువ ధర ఉంటుంది. విత్తనముల time లో prices తక్కువగా ఉండడానికి అవకాశము ఉంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ జిల్లాలలో marketing facilities ఎక్కువచేసుకొని వాటిద్వారా సదుపాయము చేసుకోవలసి ఉంటుంది.

SRI B. SANKARAIAH :— కేంద్ర ప్రభుత్వము చేసుకున్నప్పటికి ఎప్పటికప్పుడు ఏ వస్తువులధరలు ఏ రకంగా పెరుగుచున్నవి రాష్ట్రప్రభుత్వము పరిశీలించి కేంద్ర ప్రభుత్వానికి తెల్పినట్లైతే, దానికి తగిన చర్యలు తీసుకొనుటకు కేంద్ర ప్రభుత్వమునకు వీలుబడును గదా ?

THE HON. SRI B. GOPALA REDDI:—మొదటనే కమిటివేశారని చెప్పాను. దానితో మన Board Member కూడా పర్యటన చేసి ఎప్పుడెప్పుడు ఏమి జరుగుచున్నది Government of India కు తెల్పుతున్నారు.

SRI P. SREERAMULU :— రాష్ట్రప్రభుత్వము కేంద్ర ప్రభుత్వానికి పంటల ధరలు స్థిరీకరణను గురించి సిఫార్సు చేసే సందర్భములో యితర పంటలతో పాటు, చెఱుకు, పసుపు వగైరా వాటికి కూడా తగినంత సలహా కేంద్ర ప్రభుత్వానికి చేయవలసినదిగా కోరుతున్నాను. దానికి ప్రభుత్వము అంగీకరిస్తుందా?

THE HON. SRI. B. GOPALA REDDI :— మాకు ఆక్షేపణ లేదు. కమిటీవారు, మన బోర్డు మెంబరు కూడా ఈ విషయమై ఆలోచిస్తున్నారు. కనుక వారికి సిఫార్సు చేయవలసిన అవసరము లేదేమోనని అనుకుంటాము.

*Tungabhadra High-level Canal Project*

11-30 a. m.

263—

*** 465 Q—SRI P. BASI REDDI :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—**

**(a) whether the proposed Tungabhadra High-level Canal Project includes the Gandikota Project ; and**

[27th July 1955

(b) if so, its (Gandikota Project) proposed capacity and ayacut ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) The proposed Tungabhadra High-Level Canal Project does not include the entire Gandikota Project, but provides for the construction of a masonry weir with falling shutters and North and South Canals taking off from it at the Mylavaram site where the Gandikota dam was originally proposed to be located.

(b) As only a weir is proposed it will have no storage. The proposed North Canal will irrigate 50,000 acres in Jammalamadugu and Proddatur Taluks and the South Canal will irrigate 45,000 acres in Jammalamadugu and Kamalapuram Taluks in the Cuddapah District.

SRI P. BASI REDDI :— గండికోటవద్ద కట్టే నిర్మాణం సిద్దేశ్వరం ప్రాజెక్టును దృష్టిలో పెట్టుకునే కడతారా ? లేక దానికి సంబంధం లేకుండా కడతారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—సిద్దేశ్వరం ప్రాజెక్టును దృష్టిలో పెట్టుకోవాలంటే గండికోటవద్ద Reservoir నే కట్టవచ్చు. తాత్కాలికంగా, ఖర్చులుతగ్గించి తుంగభద్ర high level channel నీళ్లు వాడుకోడానికిమాత్రం ఆనకట్ట కడుతున్నారు. సిద్దేశ్వరం వచ్చేసరికి రిజర్వాయరే కట్టవచ్చును.

SRI C. SUBBARAYUDU :—1950–51 investigation లో గండికోటగుండా Pennar waters 50,000 ఎకరాలకు పారుదల అవుతుందని అంచనావేశారు. ఇపుడు ఆనకట్ట కడితే dam కట్టడానికి foundations సరిపోవు. Dam కు సరిపోయే foundations ఇపుడేవేస్తే సిద్దేశ్వరం ప్రాజెక్టువస్తే ఉపయోగిస్తుంది. Pennar water రావడానికి వీలు వుంటుంది. ఆవిధంగా చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— గండికోట reservoir కట్టడానికి ఒకస్థలం అని నిర్ణయించలేదు. రెండు మూడు స్థలాలు వున్నాయి. అందులో మైలవరం ఒక స్థలం. మైలవరందగ్గర ఆనకట్ట కట్టినంతమాత్రాన రిజర్వాయరు కట్టరని ఎక్కడాలేదు. సిద్ధేశ్వరం ప్రాజెక్టు వచ్చినపుడు ఆలోచించుకుని మరొకచోట రిజర్వాయరు కట్టుకోవచ్చును.

27th July 1955]

SRI B. RAMA REDDI :— గండికోట రిజర్వాయరు నిర్మాణంవల్ల బద్వేలుతాలూకాకు ఏమైనా సహాయాలు చేయిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— ఇప్పుడు స్కీములో లేదు. సిద్ధేశ్వరం ప్రాజెక్టువస్తే బద్వేలుద్వారా నెల్లూరు తీసుకుపోవాలని ఒకస్కీము వున్నది. ఆ plan feasible అవునా కాదా ఇంకా చెప్పలేము. సిద్ధేశ్వరం ప్రాజెక్టువస్తే గండికోట ప్రాజెక్టు నెల్లూరుకు కొండలద్వారా తీసుకుపోడానికి వీలువుంటుం దని అభిప్రాయాలు వున్నాయి. Examine చేసిచూడాలి.

SRI P. BASI REDDI :— గండికోటకు సంబంధం లేకుండా, high level channel క్రింద కడపలో పారే areas ఏవి ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— గండికోటకు సంబంధం లేకుండా, లాడి ప్రతి, పులివెందల తాలూకాలలో కొద్ది area కు పారవచ్చును.

SRI P. SUNDARAYYA :— తుంగభద్ర ఎగువ కాలువలో తుంగభద్ర నీరేకాకుండా పెన్నారునీటిని ఎన్నివేల ఎకరాలకు ఉపయోగపరుచు కొంటున్నారు ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—Mid-Pennar దగ్గర కలప దలుచుకున్నారు. పెన్నారునీరుకలిపి, అనంతపురం తాలూకాలో పెన్నారు నీటిద్వారా 40, 50 వేల ఎకరాలు సాగుచేయాలనే proposals వున్నాయి. పెన్నారునీరు సంవత్సరం పొడుగునా ఒకమాదిరిగా వస్తుందనడానికి లేదు. Surplus అయినపుడు, ఎక్కువ area సాగుచేసుకోవచ్చును.

SRI A. C. SUBBA REDDI :— మంత్రిగారు పెన్నారునీరు సంవత్సరం పొడుగునా ఒకటిగా రాదుఅన్నారు. అటువంటిసందర్భంలో ఇవన్నీ కడితే నెల్లూరుజిల్లా ఏమౌతుందో తెలవిస్తారా ?

THE HON SRI N. SANJEEVA REDDI :— నెల్లూరు జిల్లాకు ఏ మాత్రంప్రమాదంలేదు. పెన్నారు పుట్టుకదగ్గర ఇవన్నీకడతారు. చిత్రావతి మొదలు కొని చాలానదులున్నాయి. ఈ నదులద్వారా వచ్చేనీరు అంతా నెల్లూరుకు reserve కాబడి వుంటుంది.

SRI C. SUBBARAYUDU :— ఇప్పుడు ఆనకట్ట కట్టదలుచుకొన్న స్థలంలోనే 50 అడుగుల స్థలం dam site కు ఏర్పాటుచేశాము. కనుక అక్కడనే dam కు కావలసిన foundations వేయడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON SRI N. SANJEEVA REDDI :— ఇదివరకే dam siteకు ఆరేడుకోట్ల estimates వేశారని గౌరవసభ్యుడు చెప్పారు. ఎవరైనా ఆనకట్టకు వేసే

foundations damకు కావలసినంత deep గా వేస్తారా? అట్లాగయితే dam నే కట్టవచ్చును. Foundation కే ఎక్కువఖర్చు అయ్యేది. ఇప్పటికే 20 కోట్లు అయ్యే తుంగభద్ర high level channel కు ఇంకా 7, 8 కోట్లు ఎక్కువ అవుతుంది.

SRI C. SUBBARAYUDU :—సిద్దేశ్వరం ప్రాజెక్టువస్తే గండికోట ప్రాజెక్టు కట్టడానికి అవకాశం వుండదు. రిజర్వాయరును feed చేయడానికి west canal నుంచి వీలులేదు కనుక అనకట్టదగ్గర foundations వీలుగాకడితే బాగా వుంటుంది. ఈ విషయం ప్రభుత్వం పరిశీలిస్తుందా?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇపుడే రిజర్వాయరుకు తగిన foundations వేయడం అసంభవం. తరువాత submersion వున్నాసరే రిజర్వాయరు గండికోట దగ్గర కట్టుకోవచ్చును. ఎపుడో వచ్చే సిద్దేశ్వరం ప్రాజెక్టుకు ఇప్పుడు foundations వేయాలంటే Government of India వారు డబ్బు ఇస్తారని నేను అనుకోను.

### *Abolition of Revenue Board.*

264—

***47 Q—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to state whether there are proposals with the Government to abolish the Revenue Board during the current year?**

**THE HON SRI K. CHANDRAMOULI :—No.**

Sri S. VEMAYYA :— రివెన్యూ బోర్డును ఎత్తివేయాలని చాలా కాలంగా ఆందోళన వున్నదికాబట్టి దానిని తొలగించడానికి ఏఏప్రతిబంధకాలు అడ్డగిస్తున్నాయి?

THE HON Sri K. CHANDRAMOULI :— ప్రస్తుతం రివెన్యూబోర్డు అవసరమనే భావంతో ప్రభుత్వం వున్నది. ఏమైనా చిక్కులువుంటే తరువాత ఆలోచిస్తాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— రివెన్యూబోర్డు Board standing orders ద్వారా నిర్వహణ జరుగుతోంది. వాటి కాపీలు ప్రజలకు దొరకవుసరికదా పరీక్షలకు వెళ్ళేవాళ్ళకుకూడా దొరకడం లేదు. వాటిని దొరికేట్లా చేయడమో, రివెన్యూబోర్డును ఎత్తివేయడమో చేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :— దీనికోరకు రివెన్యూ బోర్డును ఎత్తివేయాలనడం argument కాదు. B. S. O. ను అచ్చు వేసి సరిగ్గా అందేట్లా చూస్తాము.

SRI A. KALESWARA RAO :—గవర్నమెంటుకు కలెక్టరుకు మధ్య రివెన్యూబోర్డు వుండడంవల్ల చాలా ఆలస్యం అవుతోందని ఇదివరకే ఆందోళన వున్నదని ప్రభుత్వానికి తెలుసా? ఇదివరలో మద్రాసు గవర్నమెంటు రివెన్యూ బోర్డును ఎత్తివేయాలని తీర్మానంచేసినసంగతి తెలుసా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—కొన్ని వ్యవహారాలను ప్రభుత్వానికి రాకుండానే రివెన్యూబోర్డు పరిష్కారంచేస్తుంది. ఇటువంటి వ్యవహారాల్లో ఆలస్యం అవడానికి అవకాశంలేదు. కొన్ని విషయాలు చక్కగా ఆలోచించడానికి అగత్యం వుంటుంది. కనుక ఆలస్యమైనా మంచిదే. ఇదివరలో మద్రాసు గవర్నమెంటువారు రివెన్యూబోర్డును ఎత్తివేయాలని ఆలోచన చేసినప్పటికీ, అట్లానే వుంచారు కాని ఎత్తివేయలేదు.

MR. SPEAKER :—Questions Nos. 265, 266 and 267 relate to the question of water supply for various towns. The Hon. Minister for Planning and Industries may give answers for all the questions and supplementaries will follow.

THE HON. SRI K. VENKATA RAO :—I have no objection, Sir.

*Water-supply and Drainage Scheme for Vijayawada and Guntur Municipalities, etc.*

265—

*323 *Q.*—SRI VAVILALA GOPALAKRISHNAYYA:—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether it is a fact that the Government have proposed the Water-supply and Drainage Scheme for the six Municipalities, viz., Vijayawada, Guntur, Kurnool, Kakinada, Visakhapatnam and Nellore; and

(b) if so, what the details are and what is the progress made so far ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) The provision of water-supply or drainage scheme is taken up on the applications of the local bodies concerned. On such applications, Water-supply and Drainage Schemes have either been sanctioned, executed or are under execution,

or are under consideration, in respect of a number of Municipalities including those mentioned in clause (a).

(b) Water-supply schemes or improvements thereto are under execution at Vijayawada, Guntur, Kurnool, Kakinada and Visakhapatnam municipalities, while the scheme for improvement of water supply at Nellore is under investigation. A Drainage scheme for Vijayawada municipality has been sanctioned and its execution will be commenced shortly. The Drainage schemes for Visakhapatnam, Nellore, Guntur, Kurnool have been proposed for execution during the second five-year plan. The investigation of the schemes has been ordered.

*Protected water supply to the Municipalities.*

266—

*427 *Q.*—Sri P. RANGA REDDI :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the number of the municipalities which are provided with protected water-supply; and those which are not provided with protected water supply;

(b) the municipalities, the waterworks of which are under progress;

(c) the municipalities which have submitted protected water supply schemes; and

(d) the action taken to meet the requests of these municipalities stated in (c)?

The Hon. Sri K. VENKATA RAO :—

(a) Eighteen Municipalities have been provided with a scheme of protected water supply, 17 Municipalities have not yet been provided with a protected system of water supply.

(b) water supply schemes are under execution in the Nandyal, Chittoor, Guntakal, Hindupur, Narasaraopet, (Emergency Schemes) Kakinada, Vijayawada, Guntur and Visakhapatnam (New gosthani Scheme) municipalities. The schemes at Kakinada, Visakhapatnam and Vijayawada are

improvements to the existing schemes, while the rest are new schemes.

(c) and (d) The question of sanctioning protected water supply schemes for the Peddapuram, Srikakulam, Salur, Tenali, Gudivada, Adoni, Anakapalli, Ongole, Bapatla, Tadpatri, Anantapur and Amalapuram municipalities is under consideration.

*Water scarcity at Vijayawada.*

267—

*1016 *Q*.—SRI A. KALESWARA RAO :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether the Government have received any representations from the public recently about the water scarcity at Vijayawada ;

(b) whether any water-supply scheme was sanctioned to Vijayawada ;

(c) if so, what are the details and cost of the scheme; and

(d) how much amount is intended to be spent on the scheme in 1955–56 ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) and (b) The questions are answered in the affirmative.

(c) The detailed plans and estimates for the first stage of the comprehensive Water-supply Improvement Scheme to Vijayawada, estimated to cost Rs. 5·14 lakhs to install, has been sanctioned. The first stage of the scheme consists of sinking a tube well at one of the exploratory borings and pumping through a new main laid upto the existing distribution system; and

(d) It has been programmed to spend Rs. 2·0 lakhs in 1955–56.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— అధ్యక్షా ! drainage కు Central Government పైన loans సహాయము చేస్తున్న దానిలో గుంటూరుకు ఏమాత్రము వస్తుంది ?

THE HON SRI K. VENKATA RAO :—Drainage కి గవర్నమెంటుకూడ అప్పులిస్తారు. Central Government నుండి తెచ్చుకొనే మేమిప్పుడు ప్రయత్నించుతుంది.

SRI P. SURYANARAYANA :-అధ్యక్షా, మంత్రిగారు శ్రీకాకుళం జిల్లానుగురించి ఆలోచనలో వున్నట్లు సెలవిచ్చారు. ఇదివరకే శ్రీకాకుళం జిల్లా water supply క్రింద నూతులు త్రవ్వి water పరిశోధనలు చాలకాలముక్రింద టనే జరిగాయి. వాటిని యీ పంచవర్ష ప్రణాళికలోనైనా చేరిపిస్తారా ?

THE HON SRI K. VENKATA RAO:—ఎప్పుడో జరిగిన నాటి investigation ఇప్పుడు లెక్కకురాదు. Old contracts rate ప్రకారము ఒప్పుకుంటే తప్ప మా అభ్యంతరము లేదు. కాని ఇప్పుడు డబ్బు ఎక్కువ పౌతుంది. అందుచేత ఆలోచించక తప్పదు.

SRI A. KALESWARA RAO :—విజయవాడ water-supply అభివృద్ధి scheme కు ప్రభుత్వం వారు ఏమైన గ్రాంటుయిస్తారా ? లేక అంతా మునిసిపాలిటీ భరించవలసినదేనా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పటి పద్ధతి grant యివ్వకపోవడమే.

SRI P. RANGA REDDI :—ఇప్పుడు నిర్మాణములో వున్నటువంటి water works ఎన్నింటిని యీ మంత్రిగారు మద్రాసు రాష్ట్రములో వున్నప్పుడు sanction చేసినారు ? ఇప్పటికేమైన పూర్తియినవా ? అట్లు జరుగకపోయిన యీ ఆలశ్యాన్ని అరికట్టడానికి చర్యలుతీసుకుంటుందా ప్రభుత్వము ?

THE HON. SRI K. VENKATA RAO:—నేను మునుపు మద్రాసులో మంత్రిత్వము చేయడానికి ఇప్పుడు మళ్లీ మంత్రిత్వము చేయడానికి కొంతకాలము జరిగినది. నేను శాసనసభ ఎన్నికలలో ఓడిపోవడము రంగారెడ్డిగారు గెలువడము తటస్థించినది. మధ్యకాలములోని విషయాలు నాకు అట్టే తెలియవు.

SRI A. SATYANARAYANA MURTHI :—కొన్ని మునిసిపాలిటీలు ప్రభుత్వముయొక్క contribution అక్కరలేకుండానే స్వంతంగా పెట్టి నడుపుకుంటున్నాయి. మా మునిసిపాలిటీలో ఆవిధంగా స్వంతంగా నడుపుకొంటున్నాము అటువంటి వాటికి ప్రభుత్వము అప్పుయివ్వడానికి సిద్ధముగా వుందా అని అడుగుతున్నాను ?

THE HON. Sri K. VENKATA RAO :—"మా" అంటె, ఆ మునిసిపాలిటీతో ఏదో చెప్పితే నేను జవాబు చెప్పతాను.

SRI A. SATYANARAYANA MURTHI :—మా పాలకొల్లు మునిసిపాలిటీ,

THE HON. SRI K. VENKATA RAO :—పాలకొల్లు మునిసిపాలిటీ ఆలాచేస్తే అభ్యంతరములేదు కాని దానిలోనుండి "మా" మాత్రము తీసివేయండి.

SRI P. SINGARAIAH :—ఇప్పుడు యీ Budget లో శ్రీకాకుళం మునిసిపాలిటీ water-works క్రింద కొంత కేటాయించారు. కాబట్టి ఇప్పటి నుంచి ఆరంభించడానికి తెలియజేస్తాము శ్రీ కాకుళము మునిసిపాలిటీ కట్టుకుంటే పని ప్రారంభించడానికి ప్రభుత్వము ఆలోచిస్తారా ?

THE HON. SRI K. VENKATA RAO :—కట్టుకుంటే మాత్రము అభ్యంతరము ఎప్పుడూ వుండదు.

SRI P. RAJAGOPAL NAIDU :—ప్రస్తుతము water - supply scheme అమలుపరుస్తున్నారు. ఎంతమందికి సరిపోతుందండి ఇది ? యీ water ఎంతమంది ప్రజలకు సరిపోతుందని అడుగుతున్నాను.

THE HON SRI K. VENKATA RAO :—చిత్తూరండి వారివూరు. ప్రత్యేకమైన నోటీసుగా ఉత్తరము వ్రాస్తే జవాబు వ్రాస్తాను.

SRI A. KALESWARA RAO :—విజయవాడ మురుగు కాలువల scheme కు ప్రభుత్వము ఎంతఖర్చు పెట్టదలచుకున్నారు ? అందులో యీ సంవత్సరము ఎంత ఖర్చు పెట్టుతారు ?

THE HON. SRI K. VENKATA RAO :—ప్రభుత్వము యిచ్చేది అప్పండి. మీరు అడిగేదంత ఉత్తరములో వ్రాస్తే తెల్పుతాను. ప్రస్తుతము Chairman గారు లేరు.

SRI S. BRAHMAYYA :—యీ ప్రశ్న అడగడములో కూడ గుంటూరు, విజయవాడ, కాకినాడ, విశాఖపట్టణమువరకువెళ్ళి మధ్యలో ఏలూరును వదలివేశారు. ఏదో టెక్నికల్ objection వుందని ఏ కారణముచేతనో ఏలూరు Drainage కి యింతవరకు అనుమతి యివ్వలేదు. Rental collection విషయములో legislation చేసిగాని వెంటనే orders issue చేస్తారా?

THE HON. SRI K. VENKATA RAO :—"వెంటనే" తీసివేస్తే తప్పకుండా act చేస్తాము.

SRI G. NAGESWARA RAO:—కాకినాడ మునిసిపాలిటీకి ప్రభుత్వము వారు ఏమైన సహాయము చేస్తున్నారా ? చేస్తే ఎంత ?

THE HON. SRI K. VENKATA RAO :—కాకినాడకూడ list లో వుంది.

SRI L. LAKSHMANA DOSS :—అధ్యక్షా! శ్రీకాకుళం విషయము ఆలోచిస్తామంటున్నారు. శ్రీకాకుళం కేంద్రములో ఇంకొక మునిసిపాలిటీ లేదు. దానినిగురించి special interest తీసికొని ప్రభుత్వము వెంటనే పని ఆరంభిస్తుందా? అని అడుగుతున్నాను.

THE HON SRI K. VENKATA RAO :—ఇచ్ఛాపురం మొదలు పెట్టి హిందూపురందాకా Government ఒకే దృష్టితో చూస్తుంది.

SRI S. NARAYANAPPA :—ఇప్పుడు హరిమునిసిపాలిటీలలో అమలు జరుపుతున్న water schemes పనిచేస్తున్నాయా? వాటిలో Drainage schemes అమలు పర్చడానికి ఇప్పటినుంచి ప్రయత్నపడేదానికి ప్రభుత్వమేమైన ఆలోచించి తగుచర్యలు తీసుకుంటుందా?

THE HON SRI K. VENKATA RAO:—అవసరమైనచోట drainage scheme పెట్టడము చాలాకష్టంగావుందని మొన్ననే health debate లో చెప్పాను. ఈ కొంతరోజులలో పరిస్థితిమారలేదు.

*Divisional and Assistant Engineers (Electrical) in the State.*

268—

* 106 *Q*.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(*a*) (1) the number of Divisional Engineers and (2) the number of Assistant Engineers (Electrical) in the State now; and

(*b*) the number of Harijans out of clauses (1) and (2) now?

THE HON. SRI G. LATCHANNA :—

(*a*) (1) Divisional Engineers (Electrical) ... 26

(2) Assistant Engineers (Electrical) ... 92

(*b*) Nil.

SRI S. VEMAYYA :—ఈ రెండు తరగతుల ఉద్యోగాలలో direct గా ఉద్యోగాలు యిస్తూవుంటారా? లేక క్రింది గ్రేడ్ నుంచి promotions మీద యీ ఉద్యోగాలు వస్తూవుంటాయా?

THE HON SRI G. LATCHANNA :—Divisional Engineers promotions మీద, Assistant Engineers direct recruitment మీద.

*Whole-sale Co-operative Stores in the State.*

269—

* 486 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state—

(a) the number of whole-sale co-operative stores in the State ;

(b) the number of them whose accounts were audited up-to-date ; and

(c) if not, the reasons therefor ?

THE HON. D. SANJIVAYYA :—

(a) NINE.

(b) and (c) The final audit of all the nine co-operative wholesale stores the co-operative year ended 30—6—1954 was completed. The concurrent audit for the current co-operative year (1954–55) is in progress. The final audit for 1954-55 will commence only after the close of the co-operative year, i.e., 30—6—1955.

SRI S. VEMAYYA :—ఈ co-operative stores అన్నికూడాచాల నష్టాలలో వున్నట్లు వింటువున్నాము. దానిని అరికట్టడానికి ప్రభుత్వము ఏమిచర్యలు తీసుకుంటుంది.

THE HON. SRI D. SANJIVAYYA:—నష్టాలువున్నాయి. అందుకనే యీ co-operative whole-sale stores ను marketing societies గా ఏర్పాటు చేయాలని ఆలోచిస్తున్నాము.

SRI G. YELLAMANDA REDDY :—Audit Reports వచ్చిన తర్వాత House కు యివ్వడానికి ప్రభుత్వమేమైన ప్రయత్నము చేస్తుందా ?

THE HON SRI D. SANJIVAYYA :— కావాలంటే యిస్తాము. దానిలో ఏమంత అభ్యంతరము లేదు.

SRI S. BRAHMAYYA :—Wholesale co-operative stores రాష్ట్రములో ఎక్కడ ఎన్ని పనిచేస్తున్నాయి ? ఎన్ని మూసివేయబడినాయో తెలియ జేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—తొమ్మిది పని చేస్తున్నాయని నేను జవాబు చెప్పాను. వారు వినలేదు.

4

*Expert quotas of onions and chillies.*

270

*743 Q.—SRI P. GOPALAKRISHNA REDDI :—Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether the Government have received recently any representations from the Commercial bodies regarding the inadequacy of export quotas of onions and chillies to foreign countries; and

(b) if so, the action taken by the Government so far?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) No.

(b) Does not arise.

SRI P. RANGA REDDI:—అయ్యా, మనరాష్ట్రానికి నిర్ణయించిన కోటా చాల తక్కువగావుంది. ముఖ్యంగా chillies విషయములో ఇదివరకు ప్రభుత్వము కేంద్రప్రభుత్వానికి తెలుపడము జరిగిందా ? ఈ కోటాలు నిర్ణయించేటప్పుడు ఏ పద్ధతిపై కేంద్రప్రభుత్వము చేస్తుంది. మనము పండించేటటువంటి పంట ఎకరాకు డామాషాపైన కాకుండ ఏపద్ధతిపైన యీ నిర్ణయము జరుగుతుంది.

THE HON SRI B. GOPALA REDDI :—కేవలము ఉత్పత్తినే కాకుండా internal consumption ఎంతవుందో కూడ చూచుకోవలసియున్నది. ప్రభుత్వము అప్పుడప్పుడు ఇంకా ఎక్కువ Export licence లు యివ్వాల్సిందని కూడ కోరుతూవచ్చింది. ఈ సంవత్సరము కొంచెము అధికముగా యిస్తారని అనుకుంటాను.

*Rifle Training Centres.*

271—

*549 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the number of centres in which the Rifle Training is given now in the State; and

(b) whether any qualification has been fixed for the selection of the candidates in the matter?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) There are 13 centres in the Andhra State. They are at :-Kurnool, Nandyal, Anantapur, Chittoor, Cuddapah, Guntur, Nellore, Vijayawada, Eluru, Rajahmundry, Visakhapatnam and Vizianagaram.

(b) The answer is in the negative.

SRI S. VEMAYYA :—ఇప్పుడు ఈ training ఇచ్చేవానిలో కొంత రాజకీయాల సంబంధాలున్నవాళ్ళకు training ఇచ్చుటకు నిరాకరిస్తూఉన్నట్లు తెలుస్తూయున్నది. ఇది నిజమేనా ?

THE HON SRI N. SANJEEVA REDDI :— దేశ క్షేమానికి ఉపయోగపడతార నేవాళ్ళనందరినీ తీసుకుంటారు.

*Institute for Training Archakas and Harikadha Bhagavatars at Tirupati.*

272—

*173 *Q.*—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) the number of candidates admitted into the Special Institute for Training Archakas and Harikadha Bhaghavatars at Tirupati for years .(1) 1950-51, (2) 1951-52 (3) 1952-53 and (4) 1953-54; and

(b) the number of Harijans out of clauses (1) to (4), respectively?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) There is no special Institute for training Archakas and Harikadha Bhaghavatars at Tirupati.

(b) Does not arise.

*Qualifications for Archakas.*

273—

*431 *Q.*—Sri S. VEMAYYA :—Will the Hon. the Minister for Revenue be pleased to steate –

(a) whether there are proposals with the Government to fix the qualifications to the Archakas in the State working in the Temples; and

(b) whether any representation has been received by the Government in this year in the matter ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) Yes.

(b) Yes.

SRI S. VEMAYYA;—ఏ అర్హతలున్న వారిని దీనిలో తీసుకుంటూఉన్నారు. ఇప్పుడు అవలంబించేవిధాన మేదో తెలపిస్తారా ?

THE HON SRI K. CHANDRAMOULI:-ఇప్పుడున్నటువంటి విధానం మఠాధిపతులుగాని, ఇంకా ఎవరైనా పండితులుగాని ఫలానావారికి అర్చనలు అవన్నీ తెలుసునని చెప్పి certify చేసినతరువాత Commissioner గారు దానితో సంతృప్తిపడినట్లయితే వారిని ఉంచుటకు అవకాశం ఉంటుంది.

SRI A. C. SUBBA REDDI :— మంత్రిగారు (b)కి yes అన్నారు. Yes అంటే ఎక్కడఉన్నదని అర్థమండీ.

(No Answer)

SRI KALLUR SUBBA RAO :—ఈఅర్చకులకు ఆగమశాస్త్రి పాండిత్యం అవసరం కనుక ఆ పాండిత్యంలో పరీక్షఅయినవారిని మీరు అక్కడ ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇప్పుడటువంటి ఏర్పాటుచేయడానికే ఒక సంఘాన్ని ఏర్పాటుచేశాం. వారిదగ్గరనుంచి report రాగానే దానికితగిన training అది ఇవ్వడానికి ఏర్పాటుచేస్తాం.

SRI P. SREERAMULU :—చాలామంది నాస్తికులుకూడా ఉన్నట్లు తెలుస్తోంది. అట్టివారిని తీసివేసి కేవలం దైవంయందు విశ్వాసం ఉన్నవారినిమాత్రమే నియమిస్తారా ?

THE HON SRI K. CHANDRAMOULI :— అట్టివారే ఉండాలని అందరమూ అనుకుంటాము.

MR. SPEAKER :—Questions Nos. 274 & 275 relate to Manganese and the Hon. Minister for Planning and Industries may give the answers for the two questions together and supplementaries will follow.

27th July 1955]

*Starting of a Manganese Factory in the State.*

274.—

*533 *Q*:—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether there are proposals with the Government to start Manganese Factory in the State; and

(b) if so, where?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) No, Sir.

(b) Does not arise ?

*Ferrous Manganese Factory.*

275—

*852 *Q*.—SRI S. VEMAYYA .—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether there are proposals with the Government to start a Ferrous Manganese Factory in the State now; and

(b) if so, the place wherein it will be located?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Yes, there is such a proposal made by a private entrepreneur. The Government of India propose to issue a licence in settlement of the details of the scheme.

(b) The factory will be located at Garividi in the Srikakulam District.

SRI S. VEMAYYA :— ఈ licence కోసం పెట్టినటువంటి వారెవరో తెలుసుకోవచ్చునా ?

THE HON SRI K. VENKATA RAO :—వారి ఊరు Tumbsar, మధ్యప్రదేశ్. వారి పేరు దుర్గాప్రసాద్ గారని జ్ఞాపకం.

SRI S. VEMAYYA :—మన రాష్ట్రంలో ఏ మూలనుంచీ ఇటువంటి licence కోసం దరఖాస్తు రా లేదా ? ఈ ఒక్క దరఖాస్తే వచ్చిందా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పటికి రాలేదు. ఇక ముందుకూడా వచ్చేపరిస్థితి ఆంధ్రదేశంలో ఉన్నట్లు కనిపించదు.

*Strike at Visakhapatnam Port.*

276—

* 584 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) the reasons for the strike at Visakhapatnam Port in April 1955 ; and

(b) how it was settled ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) The reason for the strike is the retrenchment of 59 Maistries and 885 Mazdoors by the Stevedors Companies.

(b) The dispute was settled when the managements agreed to re-instate the retrenched workers and to concede some of their demands.

SRI S. VEMAYYA :—ఈసమ్మె ఎన్నిరోజులు జరిగింది.

TEH HON. SRI G. LATCHANNA :—ఈసమ్మె April 4,5,6,7 తేదిలలో నాలుగురోజులు జరిగింది. 8 వ తేది అంతంఐనది.

*Grants to Andhra University.*

277—

* 931 Q.—SRI M. RAJESWARA RAO :—Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the total amount of grant given to the Andhra University by the Government during the years 1953–54 and 1954–55 ; and

(b) the purpose for which it was given ?

THE HON. SRI B. GOPALA REDDI :—

| | | Rs. |
|---|---|---|
| (a) 1953-54 ... (After 1—10—1953) | ... | 1,95,200 |
| (b) 1954–55 ... | ... | 8,36,200 |

27th July 1955]

| Purpose of the grant. | 1953 54. Rs. | 1954-55. Rs. |
|---|---|---|
| RECURRING— | | |
| 1. Grant-in-aid of the General balances of the University ... | 1,95,200 | 4,89,400 |
| 2. Compensation for the grant of Educational concessions to the children and dependants of Soldiers ... | ... | 800 |
| 3. Grants for opening of post graduate course in Geophysics ... | ... | 6,500 |
| NON-RECURRING— | | |
| 4. Construction of additional Boys' hostel ... | ... | 1,00,000 |
| 5. Construction of Girls' Hostel ... | ... | 87,500 |
| 6. Post graduate course in Geophysics ... | ... | 52,000 |
| 7. Bringing the Laboratories' up-to-date ... | ... | 1,00,000 |
| Total .. | 1,95,200 | 8,36,200 |

*Transfer of the Kovur taluk to the jurisdiction of Kavali Sub-Court.*

278—

* 1055 *Q.*—SRI B. SANKARAIAH :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(*a*) whether the Government have received any representations about the inconveniences and difficulties felt by transferring the Kovur taluk to the jurisdiction of Kavali Sub-Court, from the jurisdiction of Nellore Sub-Court ; and

(*b*) if so, the action taken thereon ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) yes.

(b) Kovur taluk is retained for the present in the jurisdiction of District Court, Nellore. The matter is further engaging the attention of the Government.

కొవ్వూరు తాలూకా ఇప్పుడు నెల్లూరు Court jurisdiction లో ఉంచబడింది. తరువాత మిగిలిన విషయాలు ఆలోచిస్తాం.

*Creation of Primary Health Centres.*

279—

* 671 Q.—SRI P. GOPALAKRISHNA REDDI :—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state whether any steps have been taken by the Government to implement the scheme for the creation of Primary Health Centres and if not, the reason therefor ?

THE HON. SRI K. VENKATA RAO :

(a) The answer is in the affirmative.

*Cases on the file of the District Magistrate (Judicial), West Godavari.*

280—

* 911 Q.—SRI M. RAJESWARA RAO :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the total number of cases on the file of the District Magistrate (Judicial), West Godavari, during the calendar year 1954 ; and

(b) the number of cases disposed of by him during the year ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) 352.

(b) 325.

SRI S. K. V. KRISHNAVATARAM :—ఇప్పుడు జిల్లా head-quarters లో District Magistrate ఉండడంవల్ల అక్కడవేరే I Class

Magistrate లేకపోవడంవల్ల, District Magistrate కు ఎక్కువ tour కల్పించడంవల్ల అక్కడ చాలా ఇబ్బంది కలుగుతోంది. Bail విషయంలోనూ యింకా యితర విషయములలోనూ దాన్నిగురించి ఏదైనా ప్రత్యామ్నాయ ఏర్పాట్లు ప్రభుత్వం చేస్తుందా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఆ విషయం ప్రభుత్వోద్యోగులద్వారా ప్రభుత్వదృష్టికి వచ్చినప్పుడు పరిశీలించి ఆలోచిస్తాం.

*Estate Duty on Farm Lands.*

281—

* 342 *Q.*—SRI P. VENKATASUBBAYYA:—Will the Hon. the Minister for Revenue be pleased to state whether there is a proposal with the Government to levy 'Estate Duty on Farm Lands' adopting the Estate Duty Act, 1953 (Central Act XXXIV of 1953. ?

THE HON. SRI. K. CHANDRAMOULI :—

The attention of the Member is invited to the resolution passed by the Assembly on 7—7—1955 adopting the Central Estate Duty Act, 1955 to Agricultural lands in this State under Article 252 (1) of the Constitution.

MR. SPEAKER :—The hon. Member Sri K. V. S. Padmanabha Raju says that he has one question and that the Hon. Minister is prepared to answer it. I have no objection if the Hon. Minister is prepared to answer it.

*Q. No. 281-A

***Estates Land Act Amendment Bill.***

SRI K. V. S. PADMANABHA RAJU :—Will the Hon. Minister for Land Revenue be pleased to state, when the Government propose to bring about Inam Abolition Bill amending Section 3 (2) (d) of the Estate Land Act of 1908 giving retrospective effect from 1947 as per the promise made during the Karivena Inam Ryot's Satyagraha by the Andhra Provincial Congress Committee of which the Hon. Minister was the General Secretary ?

THE HON. SRI K. CHANDRAMOULI :—The Government propose to introduce the Bill to amend Section 3 (2) (d) of the Estate Land Act in the Assembly very shortly.

SRI K. V.S. PADMANABHA RAJU:—Shortly అంటే ఎంతలో తీసుకువస్తారో definite గా చెప్పగలరా ;

THE HON. SRI K. CHANDRAMOULI :—సాధ్యమైనంతవరకూ వచ్చే session లో తీసుకువద్దామని ఉన్నది.

SRI K. V. S. PADMANABHA RAJU :—ఈ బిల్లు retrospective effect తో తీసుకువస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—1947 నుంచీ retrospective effect తోనే తీసుకురావాలని ప్రభుత్వోద్దేశం.

SRI VAVILALA GOPALAKISHNAYYA :—అయ్యా ! ఈ సంవత్సరంలో ఇదివరకుచేసిన ordinance act ఉన్నది. దానియొక్క ప్రయోజనం పొందకుండా ఉన్నటువంటి వాళ్లకు వెంటనే రక్షణ ఇచ్చుటకు చూస్తారా అది వచ్చేలోగా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—రక్షణకు ఇదివరకే కొన్ని ఏర్పాట్లున్నాయి. క్రొత్తగా చేయబోయేది ఉండదు. Amendment త్వరలో వస్తోంది కాబట్టి కొంచెం ఓపికతో ఉండమని గోపాలకృష్ణయ్యగారిని కోరుతున్నాను.

SRI A. KALESWARA RAO :—గవర్నమెంటువారు తెచ్చే బిల్లులో ఖండ్రికలుకూడా estate గానే పరిగణిస్తారా అండి.

THE HON. SRI K. CHANDRAMOULI :— అదే ఉద్దేశ్యం అండి.

12-noon.

## II. HALF-HOUR DEBATE RE: REMOVAL OF PANCHAYAT BOARD PRESIDENTS FROM OFFICE.

MR. SPEAKER :—The hon. Member Sri Vavilala Gopalakrishnayya has sent in a request for a half-hour debate regarding Starred Question 261-C, viz. removal of Panchayat Board Presidents from office. I think we have spent sufficient time over this during the question hour. I do not feel there is any need for a half-hour debate.

[*Note* :—An asterisk * at the Commencement of a speech indicates revision by the Member.]

## III. BUDGET FOR THE YEAR 1955-56. VOTING OF DEMANDS FOR GRANTS—(contd).

### (I) DEMAND No. XXI—INDUSTRIES.

THE HON. SRI K. VENKATA RAO :—Mr. Speaker, Sir, I beg to move :

"That Government be granted a sum not exceeding Rs. 52,48,200 under Demand No. XXI—Industries."

అధ్యక్షా! ఈ Industries Demand కు సంబంధించినటువంటి కొన్ని విషయాలుగల కాగితమును గౌరవనీయులైనటువంటి సభ్యులందరికి పంచిపెట్టబడినాయి. మన రాష్ట్రము పారిశ్రామికముగా చాలా వెనుకబడియున్నదని నేను వేరుగా తమకు మనవిచేయనక్కరలేదు. మన దేశము ప్రపంచములో ఎక్కువ జనాభా కలిగినటువంటిది. అందుచేత మనయొక్క సమస్య పూర్తిగా జనాభాకును మన జీవనానికిని సంబంధించినటువంటిది. మనదేశములో నిరుద్యోగము ఎక్కువగా ఉన్నదని అందరికి తెలిసినవిషయమే. పని ఉన్నటువంటి వాళ్లకుకూడ అన్నిరోజులకు లేకపోవడగం జరుగుచున్నది. ఈ నిరుద్యోగసమస్య ఐచ్ఛికమైనదికాదు. ఒకమనిషి పనిచేయను అని ఇంటిదగ్గర పనిచేయకుండా కూర్చొనేటటువంటిదికాదు. ఈ నిరుద్యోగము మనదేశంలో నేడువచ్చినదికాదు. ఈ దేశములో ఉన్న ఆర్థిక, సాంఘిక పరిస్థితియొక్క పరిణామమువల్ల దేశములో ఎక్కువ నిరుద్యోగ సమస్య ఏర్పడింది. పనిదొరికితే చాలునుఅని పనిచేయడానికి ఇష్టపడుతున్నారు. ఈ పరిస్థితులలో పని కల్పింపలేకపోవడం అనేది ప్రధానమైన సమస్యక్రింద ఏర్పడుతున్నది. అయితే ఈ నిరుద్యోగం దైవప్రసాదం అనేటటువంటిదికాదు. మనదేశంలో ఇప్పుడు ఉన్న ఆర్థికసాంఘిక వ్యవస్థలలో తీసుకువచ్చిన మార్పులయొక్క ఫలితాలే దీనికి సరియైన సమాధానము నివ్వగలవు. మనదేశంలో తగినటువంటి పెట్టుబడి, పెట్టుబడితో కావలసిన ఇతర ఉత్పత్తి పరికరాలు లేకపోవడమే, ఇటువంటి పరిస్థితి ఏర్పడడానికి ప్రధానకారణమని మనము గుర్తించవలసియున్నది. ఇప్పుడు దేశములో పెట్టుబడి తక్కువగాఉంది. ఎక్కువగా పనికల్పించే వ్యవహారాన్ని అమలులోకి తీసుకొనివస్తే ఈ పరిస్థితి మారడానికి వీలుంటుందని అందరు అంగీకరిస్తారు. జనాభా పెరుగుతున్నది గాని అంత త్వరగా వ్యవసాయ యోగ్యమైనభూమి ఎదగకపోవడంవల్ల భారతదేశంలో ఈసమస్య పూర్తిగా ఏర్పడుతున్నది. అంతేకాకుండా గ్రామాలలో ఇదివరకు ఉన్న

Sri Kala Venkata Rao] [27th July 1955

టువంటి వృత్తులు నశించడంవల్ల, వ్యవసాయంతప్ప వేరేఆధారంలేక చాలామందికి చాలా కష్టంగా ఉన్నది. ఈ పరిస్థితులలో మనం ఏమిచేయాలిఅనే సమస్యఉన్నది. దేశంలో పెద్ద పెద్ద పరిశ్రమలు పెట్టుకోవలసిన అవశ్యకతఉన్నదని అందరికి తెలుసు. ఈ పెద్ద పరిశ్రమల ఏర్పాటు ఈమధ్యన ఎక్కువగానే జరుగుతున్నది. 1947 సంవత్సరం తరువాత మన దేశంలో Industrial production, (పారిశ్రామిక ఉత్పత్తి) నూటికి నలభైగోప్వన పెరిగింది. 1943-వ సంవత్సరములో ఈ పరిశ్రమలలో వినియోగింపబడిన వారిసంఖ్య కొంచెము హెచ్చుఅయినప్పటికీ, చెప్పుకోతగినంత హెచ్చుగాలేదు. అందువల్ల పెద్దపరిశ్రమలను మనం పెట్టుకోవలసిన ఆవశ్యకత ఉన్నప్పటికిని పెద్దపరిశ్రమలయొక్క స్థాపనవల్ల దేశములో ఉన్న నిరుద్యోగసమస్యను తొలగించే పరిస్థితి ఏర్పడుతుందనే విషయం మనకు గోచరమవుతున్నది. అందువల్ల మనము పెద్దపరిశ్రమలను స్థాపించుకొంటూ ఉద్యోగములను కలుగజేయడానికోసం వేరేమార్గమును అవలంబించవలసి నటువంటి పరిస్థితి ఏర్పడింది. అందువల్లనే రెండవ పంచవర్ష ప్రణాళికలో నిరుద్యోగసమస్యపైన ప్రత్యేకమైనదృష్టి పెట్టుకోవడమే కాకుండా నిరుద్యోగసమస్యను పరిష్కరించడానికి చిన్న చిన్న ప్రరిశమలు, కుటీర పరిశ్రమలు, గృహపరిశ్రమలు వగైరాలు అన్నికూడ దేశములో స్థాపించే పద్ధతి మనము అమలుకు తీసుకువస్తున్నాము. ఇప్పుడు నేను తమరిని ఇన్ని లక్షల రూపాయలకు grant ఇవ్వవలసిందని కోరడంలో, నేను చెప్పే సిద్ధాంతంక్రింద, ఇంకా ఇక్కడ ఈ కార్యక్రమం తీసుకోలేదని, తమకు మనవి చేస్తున్నాను. ఇపుడు నేను ఇచ్చిన note లో అవన్నీ వివరంగా చెప్పబడినాయి. నేను మళ్లీ వాటిని చెప్పడం అనవసరము. ఒకవేళ ఎవరైనా సభ్యులు cut motions క్రింద వాటిని విమర్శచేస్తే, దానికి సమాధానం చెప్పలేను. ఇప్పుడు mining గురించి, అనగా భూగర్భంలోనుంచి మనము తీసుకొంటున్న పదార్థాలవిషయమై రెండుసంగతులుమాత్రమే చెప్పదలచుకున్నాను. ఎక్కువకాలము విమర్శనల కోసం, ప్రస్తుతం నా introductory speech ను తగ్గించుకొంటున్నాను. మన రాష్ట్రములో ప్రభుత్వానికి ఏవిధమైన హక్కులేనటువంటి ఖనిజములు కలిగినటువంటి భూములు, కొంత హక్కు కలిగిన భూములు, పూర్తిహక్కు కలిగి భూములు ఉన్నాయి. వీటిని ప్రభుత్వము ఏరకంగా lease కు ఇవ్వవలెననే దాన్నిగురించి 1940-వ సంవత్సరంలో జారీచేసిన Mining Lease Order ఒకటి ఉన్నది. దానిప్రకారం ఇప్పుడు leaseకు ఇస్తున్నాము. ఈ కాలుకోసమై పెట్టుకొన్న దరఖాస్తులనుంచి వచ్చే రుసుములు తీసుకోబడే ఖనిజములమీద వచ్చే royalty ప్రభుత్వానికి చెందుతుంది. మిగతా విషయా

లలో, దాని కష్టనష్టాలంతా కూడ ఎవరైతే ఈ ఖనిజములు తీసుకుంటున్నారో వాటి మీద ఆధారపడి ఉంటుంది. మన రాష్ట్రములో ప్రధానముగా, కొన్ని ముఖ్యమైనటువంటి ఖనిజములున్నాయి. Granite, Manganese, Iron ore, రాక్షస బొగ్గు Mica, రాగి, బంగారము ఇవి కొన్నిచోట్ల ఆంధ్రదేశములో దొరుకుతూనే ఉన్నవి. ఇవన్నీ మనకు ఎక్కడఉన్నాయి, ఎలా వీటిని ఉపయోగించుకోవడం అనేది ఆలోచించవలసియున్నది. ఎక్కడో, ఒక పొలములోనో మరొక చోటనో పైన ఒక పదార్థం దొరికితే, అక్కడ చాలా mining కు సరిపొయ్యేటంత దొరుకుతుందని అనుకోడానికి లేదు. అందువల్ల భూగర్భశాస్త్రజ్ఞులు Geological survey of India వారు ఇదంతా map చేసి ఎక్కడెక్కడ ఏ పదార్థాలున్నాయో తెలుసుకొని మనకు చెప్పుతూ ఉంటారు. ఈ సంగతి గవర్నమెంటుకు తెలియగానే ఫలానాపదార్థము ఫలానచోట ఉన్నదని గెజెట్‌లో ప్రచురిస్తారు. వాటికి దరఖాస్తు పెట్టుకొంటె licences ఇస్తారు. ఈ రకంగా మనము 1944-45 సంవత్సరములో గోదావరి Valleyలో రాక్షసబొగ్గు, కురుపం area, పార్వతీపురం తాలూకాలో beryl, శ్రీకాకుళంజిల్లాలో, రాగి ఇవన్నీ కూడ పరిశీలించవలసినదని వారిని కోరాము. వారు వీటన్నింటికి first priority ఇచ్చారు. ఇంకా మనకు అవసరాలు కొన్ని ఉండడంవల్ల, ప్రతి పరిశ్రమకును రాక్షసబొగ్గు ప్రత్యేకంగా అవసరం గనుక గోదావరి valley లో అసలు రాక్షసబొగ్గు ఉన్నదా లేదా అని తెలుసుకోడానికిగాను అక్కడ bore holes వేయడానికిగాను ఈ ప్రభుత్వమువారే డబ్బు ఖర్చుపెట్టి చేయిస్తున్నారు. ఇంతేకాకుండా ఆంధ్ర యూనివర్సిటీవారియొక్క సహాయంతోటి ఇతరప్రదేశాలలో కూడ భూగర్భములో ఉన్నటువంటి ఖనిజములు ద్వారా తెలుసుకొనేదానికి ప్రయత్నం చేస్తున్నాము. రెండవ పంచవర్ష ప్రణాళికలో కొన్ని కొత్త investigations చేయవలసియుంటుంది. ముఖ్యముగా dams కట్టవలసినచోట్ల, వంశధార, గోదావరి, కృష్ణా మొదలగు కొన్నిచోట్లపరిశోధన జరిగింది. మిగిలినచోట్లకూడ ఇలాంటి పరిశోధనలు చేయవలసిన అవసరమున్నది. Monazite అనేటటువంటి ఇసుకలో Atom bomb కు పనికివచ్చే పదార్థాలు మనకోస్తాలో దొరుకుతాయని చెప్పారు. వాటినిగురించి విచారణ జరుగుతూ ఉన్నది. గోదావరి valley లో రాక్షసబొగ్గుకు గురించి 94వేలు రూపాయలు ఈ ప్రభుత్వము ఖర్చుపెడుతూయున్నది. తూర్పు గోదావరిజిల్లాలో తాడిపాక area లో భూగర్భంలో ఒక రకమైన బలవత్తరమైనటువంటి వాయువు ఉన్నదనేసంగతిని విచారించడముకోసం 9 వేలు రూపాయలు ఈ ప్రభుత్వము ఖర్చు పెడుతూ ఉన్నది.

మీకిచ్చినటువంటి note లో లేని సంగతులు చెప్పాను. తరువాత మీరు చర్చ ప్రారంభించి విమర్శలు చేస్తే వాటికి సమాధానాలు చెప్పుతాను.

MR. SPEAKER :—The motion before the house is :

"That Government be granted a sum not exceeding Rs. 52,48,200 under Demand No. XXI—Industries."

286—

(451) SRI P. SUNDARAYYA :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 52,48,200
for Industries by ... Rs. 100

(కుటీర పరిశ్రమలకు సమగ్రపథకాన్ని తయారుచేయనందుకు ప్రస్తుత కుటీర పరిశ్రమలోని వారికి తగిన జీవనభృతి లభ్యమయేట్లు చేయలేక పోయినందులకు.)

287—

(452) SRI P. SUNDARAYYA :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 52,48,200
for Industries by ... Rs. 100

(ఎరువుల ఫ్యాక్టరీ విజయవాడలోను, ఫెర్రో మాంగనీసు ఫ్యాక్టరీ శ్రీకాకుళం జిల్లాలోను ఏర్పాటుచేయుటకు.)

289—

(94) SRI M. NAGI REDDI :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 52,48,200
for Industries by ... Rs. 100

(పరిశ్రమలలో పనిచేస్తున్నకూలీలకు కనీసవేతనాలు నిర్ణయించుటకు.)

290—

(138) SRI V. VISWESWARA RAO :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 52,48,200
for Industries by ... Rs. 100

(ఫర్టిలైజర్ ఫ్యాక్టరీని విజయవాడలో నిర్మించుటకు తగు చర్యలు తీసుకోక పోవటంను గురించి చర్చించుటకు.)

294—

(194) SRI N. VENKAIAH :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 52,48,200
for Industries by ... Rs. 100

(To discuss regarding (i) allocation of dhoties and sarees to handloom Industry and (ii) Dalda).

27th July 1955]

295—

(248) SRI PILLALAMARRI VENKATESWARLU :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 52,48,200 for Industries by ... Rs. 100

(Failure of the Government to suggest plans for rapid industrialisation of the State.)

296—

(280) SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 52,48,200 for Industries by ... Rs. 100

3. ఆంధ్రదేశములో కనీసం జిల్లాకొకటైనా పరిశ్రమకేంద్రం ప్రభుత్వం నిర్వహించేటట్లు చూడవలెనని.

298—

(328) SRI PUTSALA SATYANARAYANA :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 52,48,200 for Industries by ... Rs. 100

1. వివిధ కుటీర పరిశ్రమల్లోగల చిన్న పరిశ్రమలలోను, ఆధునికంగానువచ్చిన పరికరాలను బాహుళ్యంగా పరిశ్రమదార్లలో వ్యాపకము కనీసం ప్రచారం జరపనందుకు.

299—

(355) SRI S. VEMAYYA :—Sir, I beg to move :
To reduce the allotment of Rs. 52,48,?00 for Industries by ... Rs. 100

2. కార్మికులకు యజమానులకువచ్చు తగాదాలు విచారణలు ఆలస్యమగుచున్నందుకు నెలకు రు. 200 తీసికొనే ప్రచారకుడు చేయుపని యేమిటో తెల్పనందుకు. ఖాది వర్కర్లు 7 గురు ఏమిచేయుచున్నది తెల్పనందుకు.

Mr. SPEAKER :—The main Demand and the cut motions are now before the House for discussion.

SRI B. RATHNASABHAPATHI SETTY :—అధ్యక్షా, పారిశ్రామికశాఖ మంత్రిగారు యీరోజున మనఎదుట ఇండస్ట్రీసుకు సంబంధించినంతవరకూ ఒక policy పెట్టారు. ఇదివరకు కేంద్రప్రభుత్వము అనుసరిస్తున్న పాలసీ కనుగుణంగా యీప్రభుత్వము ఒక పాలసీని సృష్టించుకొన్నట్లు వున్నది. ఆ పాలసీ ప్రకారము వారు అనుకరించబోయే పద్ధతి మూడురకాలుగా విభజించబడ్డది. మొదటిది Public sector, రెండవది Private Sector, మూడవది Public-cum-private sector. పబ్లిక్ సెక్టార్‌లో యిచ్చిన అంశములన్నీకూడా కేవలం ప్రభుత్వమే పరిశ్రమలు స్థాపించి, ప్రభుత్వమే నడిపి, ప్రభుత్వముయొక్క యాజమాన్యాన వారు industries ను స్థాపించబోతున్నారు. ఇటువంటి పరిశ్రమలు మన ఆంధ్రదేశములో రెండో, మూడో వున్నట్లు కన్పిస్తున్నది. అంతకంటె ఎక్కువ లేవు. ఇక రాబోయే పంచవర్ష ప్రణాళికలోకూడా 2, 3 పరిశ్రమలకంటె ఎక్కువ ప్రభుత్వముతరఫున స్థాపించునట్లులేదు. కనుక యీ నాలుగు అయిదు పరిశ్రమల వల్లనూ ఎంత చేయగలము అని అడుగుతున్నాను. రెండుమూడు పరిశ్రమలవల్ల ఎంతవరకు అభివృద్ధి కలిగించబోతారు ? దీనికి State ఎందుకు ఎక్కువగా పరిశ్రమలు స్థాపించడము లేదు అని అడిగితే, డబ్బు ఎక్కువగాలేదు, ఆర్థికపైన స్తోమతులేదని సమాధానము చెబుతున్నారు. కనుక Public sector ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధవహించి Industries స్థాపించలేదుకనుక ప్రభుత్వము ప్రైవేటుసెక్టారు పైననే ఎక్కువశ్రద్ధ తీసుకున్నారని తెలుస్తున్నది. ఈ ప్రైవేటు సెక్టార్‌లోకూడా యిప్పుడు మన ఆంధ్రదేశములో ఏకొద్ది పరిశ్రమలోమాత్రం కన్పిస్తున్నవి. వాటిల్లో కూడా చాలామంది వ్యక్తులు ఎక్కువగా పెట్టుబడిపెట్టి పరిశ్రమలు స్థాపించటానికి ముందుకు రావడములేదు. దీనివల్ల వారికి వుత్సాహామువున్నట్లు కన్పించదు. దీనికి కారణము ఏమిటో మనము విచారించవలసియున్నది. గతంలో ప్రైవేటు Industrialists మేనేజిమెంటులోవుండి సంపాదించిన అనుభవమునుబట్టి యింకను experts యిచ్చిన రిపోర్టులనుబట్టిచూస్తే, ప్రైవేటు వ్యక్తులకు డబ్బువున్నప్పటికినీ వారు ముందుకువచ్చి డబ్బు invest చేయడానికి జంకుతున్నట్లు కనబడుతున్నది. ఈ విషయము నిరూపించుటకు ఒక చిన్న ఉదాహరణ చెబుతాను. ఇక్కడనే కర్నూలులో మన ఎదుట Birla కంపెనీయున్నది. ఇది లిమిటెడ్ కంపెనిగా మొట్టమొదట start చేయబడ్డది. కంపెనీలో float చేశారు. ఒక్కొక్క share పదిరూపాయల చొప్పున float చేశారు. Share పది రూపాయలే గదా అనే వుద్దేశ్యముతో, కంపెనీ బాగా లాభములు సంపాదించుతుంది అనేఉద్దేశ్యముతో చాలామంది ప్రజలు వారి వారికి వున్న డబ్బు చాలా భాగము యీ shares కొని invest చేశారు. డబ్బుపోసు అయినతరు

27th July 1955] [SRI B. Ratnasabapathy Setty

వాత యీ కంపెనీపని ప్రారంభించింది. కాని కొద్ది సంవత్సరముల వరకూ లాభములు సంపాదించింది. కాని మేనేజిమెంటులో వున్నవారు, యీ కంపెనీవారి స్వంతము చేసుకోవాలనే యుద్దేశ్యముతో లాభాలు సరిగా చూపించక, నష్టములు వస్తున్నట్లు లెక్కలు తయారుచేసి, నష్టముమీద యీ కంపెనీ run చేస్తున్నవని share holders కు తెలియజేస్తూవచ్చారు. లాభాలు ఏ విధంగాను, ఎన్నిసంవత్సరములైనను కనబడనందున, share holders నిరుత్సాహము చెంది వారి వారి shares అమ్ముకోవడానికి ప్రారంభించారు. ఇటువంటి ప్రైవేటుసెక్టారుగా వున్నకంపెనీ, లిమిటెడ్ కంపెనీ అయినప్పటికిని, మేనేజిమెంటులో వున్నవారు తెలివిగలవారు అయితే, కంపెనీని మూడు నిమిషాలలో దివాలా యెత్తించవచ్చు. రానురాను share holders లోను ప్రజలలోనూ, యీకంపెనీ దివాలా ఎత్తబోతున్నదనిన్ని, యికవారు invest చేసినసొమ్ముకూడ రాదనే వుద్దేశముతోను, వారికివున్న shareలను వచ్చిన ఖరీదుకు అమ్ముకోసాగినారు. పదిరూపాయలవున్న share value తగ్గిపోయి 8 రూపాయలకు అమ్మివేశారు. తరువాత 6 రూపాయలకు అమ్మివేశారు. ఆ తరువాత 4 రూపాయలు. ఈ విధంగా జరుగుతూవచ్చి, చివరకు share ఒకటికి రెండు రూపాయలకుకూడా కొనేవారు లేక share holders పెద్ద ఆందోళన చెందితే, కంపెనీలో పనిచేస్తూ management లో వున్నవారు, చివరకు share ఒకటింటికి రు. 1-14-0 లకు అమ్మితే మేము కొంటాము అని ప్రకటించారు. కాబట్టి ఒక్కొక్క షేరు 10 రూపాయలకు కొనిపించి, యిప్పుడు రు. 1-14-0 ల చొప్పున కొనటానికి కంపెనీవాళ్లు సిద్ధపడుతున్నారంటే, యిందులో ఎంతగూడుపుఠాణీ వున్నదో గ్రహించగోరుతున్నాను. డబ్బులేదు కంపెనీకి అని చెబుతున్న యీ కంపెనీకి, యీషేర్లుకొనడానికి డబ్బు ఎక్కడినుంచి తెచ్చికొనబోతారోకూడా ఆలోచించాల్సివున్నది. దీన్నిబట్టిచూస్తే ప్రజలడబ్బు ఏవిధంగా మోసముచేయ చూసుకొన్నారోకూడ తెలుసుకోవచ్చు. నిజానికి కంపెనీకి ఎంతలాభము వచ్చిందిన్ని నిజస్థితి యీ share holders కు తెలియనివ్వక, తప్పుడులెక్కలు చూపిస్తూవచ్చారు. కాబట్టి దీన్నిబట్టి మేనేజిమెంటులోనివారి కుతంత్రాలు యీ విధంగా వుంటున్న కారణముచేత, ప్రజలకు యిటువంటి ప్రైవేటుకంపెనీలమీద నమ్మకముపోయింది. అందువల్ల ప్రైవేటువ్యక్తులు తమ తమ డబ్బును యికమీదట invest చేయటానికి ముందుకు రాకుండాపోతున్నారు. గనుక యీనాడు వున్నటువంటి పరిస్థితులలో ప్రభుత్వము వారు ప్రైవేటుకంపెనీలు స్థాపింపచేస్తే, ప్రజలు వారియొక్కడబ్బు invest చేయుటానికి ముందుకువస్తారంటే, ఏవిధంగా వస్తారో నాకు అర్థము కావడములేదు.

అంతేకాకుండా రాయలసీమ Economic Board ఒకటి వుంటూవచ్చింది. ఇప్పుడు దాన్ని abolish చేశారో, పనిచేస్తున్నదోకూడా తెలియదు. వారుచేసిన సిఫార్సులు చాలావున్నవి. రాయలసీమలో కొంత ప్రత్యేకంగా వెనుకబడిన

Sri B. Ratnasabapathy Setty] [27th July 1955

ప్రాంతాలలో Industries పెట్టమంటే వ్యక్తులు చాలామంది బెదురుతున్నారు. వారికి లాభాలువచ్చే వ్యాపారానికే పోతారుగాని, యిటువంటి concerns లో, నమ్మి డబ్బు invest చేయరు. కొంతవరకు కృషిచేసి, ఆలస్య మైనప్పటికి పరిశ్రమలు పెట్టి, లాభాలు సంపాదించవచ్చును, అనే ఆశవారికి బొత్తిగాలేదు. వారు ముందుకు రావడములేదు. మైసూరు రాష్ట్రములో చేసినట్లుగా మొట్టమొదట మైసూరు రాష్ట్రములో ప్రభుత్వమే responsibility వహించి Industries ను, start చేయటానికి ప్రయత్నంచేసింది. అదేవిధంగా రాయలసీమలో పరిశ్రమలు అభివృద్ధి కావాలంటె ప్రభుత్వము ముందుకురావాలని సలహాలుయిచ్చారు. ఆ సలహాలు చూస్తే ప్రైవేటుసంస్థలు బైటకురావటానికి అవకాశములు తక్కువగావున్నది. ఇటువంటి పరిస్థితులలో దేశము పారిశ్రామికంగా అభివృద్ధి కావాలంటే ప్రైవేటు సెక్టారుపైననే ఆధారపడి, పబ్లిక్ సెక్టారును పూర్తిగా neglect చేసి పారిశ్రామికంగా అభివృద్ధిచేయడానికి ప్రభుత్వమువారు ఆశిస్తున్నారా అని అడుగుతున్నాను. కాబట్టి కేవలము ఊహాగానంచేస్తే వీరు substantial గాను concrete గాను చేయటానికి అవకాశమువుండదని ప్రభుత్వము గుర్తించాలి. తరువాత Public-cum-private sector విషయము వున్నది. ఇక్కడ ప్రభుత్వము డబ్బువున్న ప్రైవేటు వ్యక్తులు కొంతమందికలిసి 50 to 50 basis మీద private investment మీద పరిశ్రమలు start చేయాలని ప్రభుత్వమువారు చూస్తున్నట్లు తెలిసింది. దీనిక్రిందకూడా ప్రైవేటు సెక్టారులో ఏవిధమైన సందేహాలువున్నవో, వ్యక్తులు ముందుకు రావటానికి ఎందుకు జంకుతున్నారో, అందుకే యీ sector కూడా ముందుకురాలేదని నా ఉద్దేశ్యము. ఎందుకంటే యిప్పుడు ప్రభుత్వము అనుసరిస్తున్న పాలసీనిబట్టిచూస్తే, యీ Industries లో ఏమైనా లాభాలు వస్తే, అప్పుడు మరల private-management కు అప్పజెప్పి నిర్వహింపచేయాలనిచెప్పి యిదివరకే Government of India వారు హామీయిచ్చారు. అందువల్ల Private management లో చిన్న పెద్ద పెద్ద ధనవంతులు మేనేజమెంటు ముందు తీసుకొని, తరువాత మేనేజిమెంటు అంతా గవర్నమెంటునుంచి పూర్తిగా తమ చేతులలోకి వచ్చినతరువాత నష్టాలు చూపించడము ప్రారంభిస్తారు. అదే వుద్దేశ్యముతోనే యిటువంటి కంపెనీలలో ప్రైవేటు వ్యక్తులు మేనేజిమెంటు చేయటానికి ముందుకు వస్తారేకాని, డబ్బు మాత్రము invest చేయటానికి జంకుతారు. కాబట్టి అటువంటి Public-cum private sector కూడా అభివృద్ధి చెందదని నా అభిప్రాయము.

మొదటి పంచవర్ష ప్రణాళికలో కొన్ని కోట్లరూపాయలు మీరు ఇండస్ట్రియలైజేషనుకు కేటాయించారు. కేటాయించిన డబ్బుఅంతాకూడా ఖర్చుకాలేదు.

డబ్బు ఎందుకు మిగిలినది, ఎందువల్ల దానిని వినియోగించుకోలేకపోయాము, అని మీరు తెలిసికొనివుంటారు అనుకొంటాను. Technical Personnel తక్కువ అయినందువల్ల, వాటిని ఇతరదేశాలనుంచి దిగుమతి చేసుకోలేకపోయినందువల్ల ఆ డబ్బు మిగిలిపోయింది. ఇతర పరిశ్రమలను మీరు స్థాపించలేకపోయారు. ఇప్పుడు మీరు ద్వితీయపంచవర్ష ప్రణాళికలో ఎక్కువ డబ్బును వెచ్చించేందుకు ప్రస్తావించారు. మొదటి పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయ అభివృద్ధికై ఎక్కువ ప్రయత్నముచేశారు. ఇప్పుడు ఈ సంవత్సరము పరిశ్రమలను అభివృద్ధికై ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టాలని ఒకపాలసీ పెట్టుకున్నారు. కాని టెక్నికలుపరసనల్‌ను మీరుఅభివృద్ధి చేయనిదే ఏ విధంగా ఈ డబ్బును వెచ్చించాలనుకున్నా ఖర్చు కావడము లేదు. ఇప్పుడు మన ఆంధ్రరాష్ట్రము మొత్తముమీద తీసుకుంటే కాకినాడ, వుయ్యూరు తప్ప మిగతాచోట్ల టెక్నికలు కాలేజీలుగాని, స్కూల్సుగాని, ట్రైనింగు ఇచ్చే సెంటరులు గాని ఎక్కడా కన్పించడములేదు. రాయలసీమ బోర్డువారు చేసినటువంటి సలహాలను మీరుచూస్తే కడపలో, కుప్పంలో, నంద్యాలలో, ఈవిధమైన సెంటర్సులో కూడా, బళ్లారిలో ఇదివరకువున్నట్లు, ఇప్పుడు కాకినాడ వుయ్యూరులలో మీరు ఏర్పరచిన స్కూల్సువలె, ఎక్కువస్కూల్సు పెట్టాలని వాళ్లు సిఫార్సుచేశారు. కమిటీలు వేయడము, కమిటీలతరఫున రిపోర్టులు తెప్పించడము వాళ్లుఇచ్చిన సలహాలను పాటించకుండాపోవడము ఒక పరిపాటిఅయింది. లేకపోతే ఇదివరకే కడపలో ఒక స్కూలు, కుప్పంలో ఒకస్కూలు, నంద్యాలలో ఒకటి, వాళ్లుచేసినటువంటి సిఫార్సులను మీరు అంగీకరించివుంటే పెట్టివుండవలసింది. కాని మీరు సూచించినటువంటి రిపోర్టులో అటువంటి స్కూల్సు ఎక్కడా పెట్టినట్లు నాకు కన్పించడములేదు. రాయలసీమ ఎకనామిక్ డెవలప్‌మెంటు బోర్డును 1949లో ఏర్పాటుచేశారు. 6 సం॥లు అయింది. కాని వారుచేసినపని ఏమీ కన్పించడము లేదు.

THE HON. SRI K. VENKATA RAO:—మేము ఈ సంవత్సరమే అధికారంలోకి వచ్చాము.

SRI B. RATHNASABHAPATHY SETTY:—పోయిన ప్రభుత్వము చేసిన కార్యకలాపాలకుకూడా బాధ్యత తీసుకుంటారు అనే ఉద్దేశ్యముతో నేను చెబుతున్నాను.

THE HON SRI K. VENKATA RAO :—అది చాలా బాగుంది.

SRI B. RATHANASABHAPATHY SETTY :—కాని ఆ గవర్నమెంటు చేయలేదని ఈ గవర్నమెంటు చేసినదేమీ కనిపించడము లేదు.

THE HON SRI K. VENKATA RAO :— ఈ 6 నెలల్లో చేసే ఉద్దేశ్యము లేదు.

SRI B. RATANASABHAPATHY SETTY :—ఈ 6 నెలల్లో చేసే సూచనలు కూడా కన్పించడములేదు. అంటే మీరు వుద్దేశించినట్లు ఎక్కువడబ్బును సద్వినియోగము చేసి పరిశ్రమలు ఎక్కువగా చేయాలనే ఉద్దేశ్యములేదా? అయితే మొట్ట మొదటగా టెక్నికలు పరసనెల్‌ను ఎక్కువ చేయవలసిన అవసరముఉంటుంది. గత సంవత్సరం మీరు కేటాయించినదానిలో short fall వచ్చింది. దానికి కారణము టెక్నికలు పరసనెల్ లేరనిచెప్పారు. కనుక మొట్టమొదట ఇండస్ట్రీస్టార్టు చేసే ముందు టెక్నికలు పరసనెల్సును ఎక్కువ ఎక్కువచేయాలని హెచ్చరిస్తున్నాను. ఇంతవరకు ఇండస్ట్రియలైజేషనుకు సంబంధించినంతవరకు ఎంత పబ్లిక్ సెక్టరులోగాని ప్రయివేటు సెక్టరులోగాని అభివృద్ధిలేదు. ఇండస్ట్రియలైజుచేసినా పైన మన అగ్రికల్చ ఆధారపడి వున్నటువంటి జనాభాకుపూర్తిగా మీరు ఉద్యోగాలుచూపించలేరని మీకు తెలుసు. కనుక దీనికి సదుపాయము మీరు కాంగ్రెసు పార్టీనాయకులుగాను, ఎకనామిక్ experts గాను ఇచ్చేటటువంటి సలహాలనుబట్టి కూడా ఈ నిరుద్యోగసమస్యను పరిష్కారముచేయాలంటే అగ్రి కల్చరుపైన ఎక్కువగా concentrate చేసే పాపులేషనును డైవర్టుచేసి వాళ్లకు ఎంప్లాయిమెంటు చూపించాలనే వుద్దేశ్యముతో నే కాటేజి ఇండస్ట్రీసుకు మీరు వొప్పుకొన్నారు. ఈ కాటేజి ఇండస్ట్రీపట్ల మీరు ఎంత శ్రద్ధచూపిస్తున్నారు, వాటిపైన మీరు ఎంతమాత్రము ధనాన్ని వెచ్చించి మీరు వృత్తి చూపిస్తున్నారు అనేదే ప్రశ్న ఇప్పుడు. మీ రిపోర్టులో రు. 91,100 లు మాత్రము కాటేజి ఇండస్ట్రీ చూపించినట్లు కన్పిస్తున్నది. కుటీర పరిశ్రమలకు హెచ్చు కేటాయించాలి. కుటీర పరిశ్రమలలో వుత్పత్తి అయ్యేటటువంటి వస్తువులు చాలా ఖరీదు అయినటువంటి వస్తువులు మిల్లులో తయారవుతున్నటువంటి వస్తువులతో ఇవి పోటీకి నిలబడలేకుండా వున్నాయి. గనుక ఎక్కువ ఖరీదు పెట్టికొనడానికీ ప్రజలు ఉత్సాహంగాలేరు. కొత్తగా ఉత్పత్తి అయ్యేటటువంటి వస్తువులు అన్ని మిగిలిపోతున్నాయన్నారు. అక్కడనే మీరు ఎక్కువశ్రద్ధ తీసుకోవాలని నేను తెలియజేస్తున్నాను. ఇప్పుడు గ్రామీణ ప్రజలు అనుసరిస్తున్నటువంటి పద్ధతులు పురాతనమైనవి. పురాతనమైనటువంటి పద్ధతులను అనుసరిస్తే మిల్లులో ఉత్పత్తి అవుతున్న వస్తువుల పోటీలో నెగ్గలేరు కనుక ఆధునిక పద్ధతులతో నే కాటేజిఇండస్ట్రీలను నడపాలి. నడపడానికి అవకాశాలున్నాయి. ఇతర దేశము లలోకూడా అనుభవముఉంది. వారు తయారుచేశారు. జపానులో handloom

27th July 1955] [Sri B. Ratnasabapathy Setty

పరిశ్రమ విద్యుచ్ఛక్తితో, చిన్న చిన్న ఆయిల్ ఇంజనులతో నడుపబడుతున్నట్లుగా మనకు తెలుసు. వీటిని అనుసరించి మన handloom cloth కూడా విద్యుచ్ఛక్తితో తయారుచేయడానికి మీరు ఏమీ ప్రయత్నముచేసినట్లు లేదు. వాటికి రీసెర్చిస్టేషనులు పెట్టి పవర్ లూమ్సు తయారుచేయాలి. మనదేశ పరిస్థితులకు అనుగుణంగా ఇటువంటి మిషనులు కావాలి. అవి తయారుచేయడానికి మీరు రీసెర్చిస్టేషనులు పెట్టినట్లులేదు. కనుక ఈవిధముగా చేసి ఉత్పత్తిఖర్చులు తగ్గించడానికి ఉత్పత్తిచేసేటటువంటి వస్తువులకు మార్కెటులో మిల్లువస్తువులతో పోటీకినిలిచే అవకాశాలు కలుగజేయడానికి మీరు ఏమీ ప్రయత్నము చేయలేదని చెబుతున్నాను. రీసెర్చి స్టేషనులు స్థాపనచేసి కొత్త implements ను invent చేసే వానికి ప్రోత్సాహంఇవ్వాలి. ఇటువంటివి చేయగలిగిన మేధావులను ఆహ్వానించి వాళ్ళకు తగినటువంటి ప్రోత్సాహము ఇవ్వాలని నేను తెలియజేస్తున్నాను. ఈ పద్ధతులను అనుసరించనంతవరకు కాటేజి ఇండస్ట్రీలను అభివృద్ధి చేయడానికి గాని లేక దేశంలో ఉత్పత్తి అయినటువంటి వస్తువులకు గిరాకీ కలిగించడమునకుగాని అవకాశంవుండదు. మీకు నిరుద్యోగసమస్యను నిర్మూలనచేయాలి, పరిష్కారము చేయాలిఅనే ఉద్దేశ్యము కనుక వున్నట్లయితే మీ ప్రణాళికలు సక్రమంగా వినియోగించాలనే వుద్దేశ్యము ఉన్నట్లయితే మీరు మొట్టమొదటగా చేయాల్సింది టెక్నికలు పర్సన్సును ఎక్కువ చేయడము. తరువాత కొత్త కొత్త పరికరాలు కనిపెట్టడానికి పూనుకోవాలి. విద్యుచ్ఛక్తితో, డీసెల్ ఇంజనులతో తయారయ్యేటటువంటి పరికరాలను కనిపెట్టవలసిన అగత్యము ఉన్నది. అది తెలుసుకోవలసిందని తెలియజేస్తున్నాను.

SRI B. G. M. A. NARASINGA RAO :—అధ్యక్షా, పరిశ్రమలశాఖా డిమాండును నేను బలపరుస్తున్నాను. ఆంధ్రరాష్ట్రము పూర్తిగా వ్యవసాయిక రాష్ట్రము. అయితే పూర్తిగా వ్యవసాయముమీద ఆధారపడ్డము ఏరాష్ట్ర సౌభాగ్యానికికూడా ఏవిధముగా తోడ్పడదు. రాష్ట్రము సౌభాగ్యవంతము కావాలంటే రాష్ట్రము పూర్తిగా పారిశ్రామికము కావాలి. మొదటి పంచవర్ష ప్రణాళిక కాలములో ఇరిగేషను స్కీములకు ఎక్కువ ప్రాధాన్యము ఇచ్చారు. దేశంలో దుర్భిక్షము అనేమాటలేకుండా తొలగించడానికి ఇరిగేషన్ ప్రాజెక్టులకు ఎక్కువసొమ్ము ఖర్చుపెట్టడమువల్ల పరిశ్రమలకు ఆట్టే కేటాయించలేకపోయారు. నిరుద్యోగము రూపుమాపుటకు పరిశ్రమలను ఎక్కువగా ప్రారంభించుటకు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కేటాయించారు. అయితే ఈ సంవత్సరము బడ్జటులోకూడా మన రాష్ట్రము చేయదగ్గపనులు అన్నికూడా చేయగలమని సంతోషపడుతున్నాను. ఈ స్వల్ప

కాలములో ఆంధ్ర పేపరుమిల్లును అభివృద్ధిపరచి, గూడూరు సిరమిక్స్‌ను అభివృద్ధి పరచుటకుకూడా నిర్ణయించారంటే చాలా సంతోషించదగ్గ విషయము. అయితే ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కాలానికి మనము పూర్తిగా తయారు కావాలంటే ఇప్పట్నుంచీకూడా మనము అన్నివిధాల కృషిచేసిఅన్నిసాధనాలు సిద్ధపరచుకుంటేనే తప్ప ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలమునాటికి మనము అనుకున్న కార్యక్రమాలు నెరవేర్చలేము అని చెప్పినా భయము. అందుచేత ఇప్పట్నుంచికూడా ద్వితీయప్రణాళిక కాలములో ఏ పరిశ్రమలు అయితే స్థాపించదలచామో వాటికి లైసెన్సులు ఇప్పట్నుంచే మంజూరుచేసి వాటకి కావలసిన టెక్నికలు పర్సన్సును, మిగత అన్నికూడా ఇప్పుడే సమగ్రంగా జాగ్రత్తపెట్టినట్లయితే మన ద్వితీయపంచవర్ష ప్రణాళిక ఏ ఆటంకములేకుండా సమగ్రంగా మనము నిర్వహించగలమని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో వుత్పత్తికూడా కొంత ప్రారంభించగలమని నా విశ్వాసము.

1-30 p. m.

దేశములో చూచినట్లయితే సంపదఉన్నది. మనకు చాలా కోస్తా ప్రాంతము ఉండడమువల్ల ఉప్పుపరిశ్రమను విశేషముగా ప్రారంభించడానికి అవకాశములు ఉన్నవి. ఇదివరకు దేశములో ఉప్పుకొరత చాలాఉండేది. ప్రథమపంచవర్ష ప్రణాళికలో మనము ఉప్పుకొరతను తీర్చుకోగలిగితిమి. అయితే మనకు పరిశ్రమలకు ఎక్కువ అవకాశములు ఉన్నవి కాబట్టి ఈ పరిశ్రమను మరింత అభివృద్ధిచేసినట్లయిన Chemical Industires స్థాపనకు చాలా అవకాశము ఏర్పడును. ఉప్పు, caustic soda, soda acid తయారుచేయుడానికి చాలా ముఖ్యమైన raw commodity. అందుచేత ఉప్పుపరిశ్రమను మనము ఇతోధికముగా అభివృద్ధిచేసేపక్షంలో అది రసాయనిక పరిశ్రమలకు ఎక్కువగా తోడ్పడుతుంది. ఈ రసాయనిక పరిశ్రమలన్నీ, వానిలో ముఖ్యముగా caustic soda పరిశ్రమ, దేశములో ఏవస్తు నిర్మాణమునకు అయినా సరే ప్రాతిపదిక అవుతుంది. సబ్బుపరిశ్రమలో అయితేనేమి, వస్త్రపరిశ్రమలో నైతేనేమి, rayon పరిశ్రమలోనైతేనేమి, పెట్రోలు శుద్ధిచేయడములో నేమి మరి ఏ యితర పరిశ్రమలో చూచినమా ప్రతివిషయములోకూడా caustic soda వాడబడుచున్నది. caustic soda నుంచి soda ash అంటే చాకలిసోడా తయారవుచున్నది. దానిలోనుంచి D. D. T. gemmaxene; liquid chlorine ఇంకా అనేక వస్తువులు తయారవుచున్నవి. ఇవన్నీకూడా మనము ఇప్పుడు పరాయిదేశాలనుంచి కొనుక్కొని కొన్నికోట్లరూపాయలు వారికి యిస్తున్నాము. ఏనాడైతే మనరైతుల తాలూకు సొమ్ము మనరాష్ట్రములోనే ఖర్చుపెట్టగలుగుతామో, మన వస్తువులు మనము తయారుచేసుకోగలుగుతామో అప్పుడే మనము స్వయం సమృద్ధి పొందుతాము. అప్పుడే దేశము భాగ్యవంతము అవుతుంది. అందుచేత ఈ ముఖ్యమైన పరిశ్రమలన్నింటికి కూడా ప్రణాళికలు తయారుచేసి మనకు కావలసిన ప్రతివస్తువుకూడా మనము

తయారుచేసుకోవాలి. యీ వస్తువులన్ని అందుబాటులో ఉన్నవి కనుక నేను చెప్పు చుంటిని. అందుబాటు లేని వస్తువులనుగురించి మనము ప్రస్తావించవసము లేదు. ఉదాహరణకు పంచదారకు మనరాష్ట్రములో విశేష ప్రాధాన్యము కలదు. మనము ఉత్తర ప్రదేశమునుకూడా స్వల్పకాలములో మించిపోయే స్థితిఉన్నది. అయి నప్పటికి మనము యీ మిల్లులు పెట్టడానికి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కేటా యించినను, ఇప్పటివరకూ licence మంజూరు కాలేదంటే లైసెన్సు మంజూరు అయినతరువాత జరిగేకాలయాపన తరువాత factory నిర్మాణము ఇంకా చాలా సం॥లు పట్టును.

THE HON. SRI K. VENKATA RAO :—పంచదార మిల్లులకు దర ఖాస్తులు పెట్టినవారలలో ఎవరికి లైసెన్సు మంజూరు కాలేదో సెలవిస్తారా?

SRI B. G. M. A. NARASINGA RAO :— నాకు తెలిసిన భోగట్టా ప్రకారము ఇప్పటికి ఎవరికి మంజూరు కాలేదని అనుకుంటున్నాను.

THE HON. SRI K. VENKATA RAO :— ఎవరూకూడా దరఖాస్తు చేయలేదు. ఎవరూకూడా ఒకరూపాయి share capital వసూలుచేయలేదని తెలుసుకోవటం మంచిది.

SRI B. G. M. A. NARASINGA RAO :— అనుపల్లి సత్యనారా యణగారు చోడవరం రైతులు ఇంకా చాలామంది దరఖాస్తులు పెట్టామని వాళ్లు అంతా చెబుతున్నారుకదండీ.

MR. DEPUTY SPEAKER:— యీమధ్య దరఖాస్తులు 3 లక్షలు వసూలుచేసి పెట్టుకొనమని చెప్పారు. కాబట్టి 3 లక్షలరూపాయలు వసూలుచేసి దరఖాస్తు పెట్టుకొనమని చెప్పండి.

SRI V. GOPALAKRISHNAYYA :— ఈపేర్లు చెప్పినట్లయితే వాళ్ళతరఫున ఏజెంటుగా canvas చేసినట్లు అవుతుందేమో అవిధముగా ruling ఉన్నదికూడా, అందువల్ల ఈపేర్లు చెప్పలేదేమో అనుకుంటున్నాను.

THE HON. SRI K. VENKATA RAO :— నేను పేర్లు చెప్పమన లేదు. ఊళ్లు చెప్పమన్నాను. అందువల్ల వీరికు ఆబాధ అక్కరలేదు.

SRI B. G. M. A. NARASINGA RAO :— అధ్యక్షా, ముఖ్య ముగా నిరుద్యోగ సమస్య నివారణను గురించి, పరిశ్రమలను గురించి ప్రస్తా విస్తున్నాము. ఈ నిరుద్యోగముల సమస్య చూచినట్లయితే ముఖ్యముగా నగర ములలో ఎక్కువగా ఉన్నది. దానిలో చదువుకున్న వారిలో ఈనిరుద్యోగ సమస్య ఎక్కువగా నున్నది. ఈచదువుకున్నవారిలో కాకుండా నిపుణత

[Sri B.G.M.A. Narasinga Rao [27th July 1955

గణించిన కార్మికులలో welder లో mechanics లో fitters లో turners లలోకూడా మంచిప్రవీణత ఉన్నది. అదీకాకుండా మన Poly technics Indus-trial chools వీటిలో కొన్ని వేలాదిమందిని తయారుచేస్తున్నారు. కాని తయారై వచ్చిన ప్రతివారికి మనము తగినపనులు చూపించలేక పోతున్నాము. అందుచేత తయారైన engineers చాలా నిరుత్సాహపడుచున్నారు. మన పిల్లలు అందరూ School Final, B. A. లు B. Sc లు pass అవుచున్నారు. కాని ఉద్యోగములు దొరకుట లేదు. అందుచేత యీ నిరుద్యోగ బాధను మనము నివారించాలన్నా మనదేశమును పారిశ్రామికంగా ఎక్కువపురోగమింప జేయవలెను. కనుక ఈ విషయమై ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో తగినకృషిచేస్తారని నాకు నమ్మకముఉన్నది. మన పరిశ్రమలమంత్రి చాలా సమర్థులు. కనుక యీవిషయములో మంత్రిగారు శ్రద్ధవహించి కార్యదీక్షతో పూనుకొన్నట్లయితే తప్పక ఆంధ్రదేశము తక్కిన రాష్ట్రములు అన్నిటిలోకంటె ప్రథమస్థానము నాక్రమించగలదని నమ్మకము నాకు ఉన్నది. కనుక ద్వితీయ పంచ వర్ష ప్రణాళికలకు ఇప్పటినుంచి పథకములు తయారుచేయవలెనని కోరుచున్నాను.

రెండవది పరిశ్రమలలో కార్మికులనుకూడా భాగస్వాములుగా చేస్తేనేగాని దేశములో పరిశ్రమలు పురోగమించలేవు. ఆ మనస్తత్వము ఎప్పుడైతే కార్మికులలో కలిగినదో "యీ పరిశ్రమలు నావి, నేను ఈ పరిశ్రమలద్వారా దేశానికి సేవచేస్తున్నాను" అనే ఉత్తేజము బయలుదేరుతుంది. అప్పుడే ఉత్పత్తి ఎక్కువ అవుతుంది. అట్టి పరిస్థితులలో మనకు కావలసిన capital కూడా workers దగ్గర నుంచి వస్తుందని నా ఉద్దేశ్యము. ఆవిధముగా అయినట్లయితే ఉత్పత్తి చాలా పెరుగుతుందని నమ్మకము బాగా ఉన్నది. అందుచేత యీపరిశ్రమలో కార్మికులను భాగస్వాములుగా తీసుకొనవలెనని కోరుతూ నేను విరమిస్తున్నాను.

SRI M. MUNUSWAMI :—అధ్యక్షా! ఈ పరిశ్రమశాఖను గురించిన డిమాండును నేను బలపరుస్తున్నాను. ఈ పరిశ్రమల విషయములో మన ప్రభుత్వము చాలా ఉదారముగా ప్రవర్తిస్తున్నందుకు నేను చాలా సంతోషపడుచున్నాను. అయితే కొన్ని సూచనలు ప్రభుత్వమునకుచేసి నేను విరమించెదను. నెల్లూరుజిల్లాలో ప్రభుత్వము చేయవలసినపనులు కొన్నిఉన్నవి కాబట్టి వాటిని గురించి నేను చెప్ప దలచుకొంటిని. సూళూరుపేట తాలూకాలో సూళూరుపేటకు 7 మైళ్ళ దూరములో అడకానిలిప్ప అను ప్రదేశములో జిప్సన్ దొరకుచున్నది. దానితో అక్కడ ఒక సిమెంటుఫ్యాక్టరీ ప్రారంభించినట్లయిన దానివల్ల రాష్ట్రానికి ఆదాయమువచ్చుటే కాకుండా నిరుద్యోగులకు పని దొరకును. ప్రస్తుతము అక్కడఉన్న జిప్సన్ ను తీసుకొనిపోయి కొంతమంది (మద్రాసు రాష్ట్రమునకు చెందినది. ఎన్నూరులో సిమెంటు Factoy ను స్థాపించినట్లు తెలుస్తున్నది. దానివల్ల మనకు నష్టముకలుగు చున్నది. నాయుడుపేటకుదగ్గరలో 56 మైళ్ళలో (బహుశా చిత్తూరుజిల్లాకు సంబం

ధించింది.) Iron ore దొరుకుచున్నది. అక్కడనుంచి Iron ore ను ఎగుమతి చేయుచున్నారు. ఇప్పుడు దాని కనుగుణముగా నాయుడుపేటలోనే Industryని స్థాపించినట్లయిన Iron ore ను వేరుచేసి మనము చాలా లాభమును పొందగలుగు తాము. దానిలో ఇప్పటికే వేలమంది కూలీలు పనిచేస్తున్నారు. Industry ని స్థాపించినఎడల ఇంకా ఎక్కువమందికి పని దొరికేఅవకాశము ఉంటుంది.

1 p. m.

తడ ప్రాంతాలు చాలా అధ్వాన్నమైన పరిస్థితులలో వున్నాయి. వీటిని National extension scheme క్రింద తొందరగాచేస్తే బాగుంటుంది. ఆ ప్రాంతాలను మంత్రిగారు ఒకసారి దర్శించాలని నా కోరిక. శ్రీహరికోటలో చేమ ఎక్కువగా దొరుకుతుంది. Cottage industries క్రింద అక్కడ ఒక చిన్న Industry స్థాపిస్తే బాగుంటుంది. దానివల్ల ప్రభుత్వానికి ఆదాయంవచ్చే మార్గాలున్నాయి. ప్రభుత్వం వారు దానిని ముఖ్యంగా గమనించి తీసుకుంటారని ఆశిస్తున్నాను. మేము అనేకమంది గోపాలరెడ్డిగారిని శ్రీహరికోట సందర్శించాలని కోరాము. ఆయన ఒప్పుకున్నారు. Industry మంత్రిగారుకూడావచ్చి నిజమైన పరిస్థితులుచూస్తే తెలియగలదు. మంత్రులు పట్టణాలకు పోతున్నారు కాని పల్లెటూళ్లకు పోవడంలేదు. వారువచ్చిచూస్తే తెలుస్తుంది. తడ ప్రాంతాలను Agency ప్రాంతాలుగా చేర్చాలంటే వారు సుముఖంగా కనిపించలేదు. అక్కడ వున్నవారు Agency ప్రాంతంవారికంటె అధ్వాన్నంగావున్నారు. వారువచ్చి చూస్తే నిజంవారికి బోధపడుతుంది. అప్పుడు వారు సుంతృప్తిగా పోవడానికి వీలువుంటుంది. వారు ఆ ప్రాంతాన్ని సందర్శించాలని కోరుతూ విరమిస్తున్నాను.

SRI M. SATYANARAYANA RAJU :—అధ్యక్షా, మహాశయా, Industries Demand మీద సోదరులు చాలామంది చెప్పారు. పెద్దఎత్తుమీద నడిచే industries, Cottage industries అని రెండు రకాలున్నాయి. ఇప్పుడు వున్న Industries తో unemployment problem solve కాదు. ఇప్పుడువున్న private factories లో అన్నికలిసి 95 వేలమందికి, గవర్నమెంటుతో తీసుకున్న factories లో 5 వేలమందికి, మొత్తం లక్షమందికి employment దొరికింది. ఎంత భారీఎత్తున industries అభివృద్ధిచేసినా, cottage industries వృద్ధిచేసినా గాని unemployment problem solve కాదు. Co-operative movement ను ప్రబలంగా వ్యాప్తిచేసి, వివిధవృత్తులు వారికి అభివృద్ధికావడానికి వీలుగా ఒక drastic movement talukwar villagewar - తీసుకువస్తే చాలావరకు unemployment problem solve అవుతుందనినా అభిప్రాయం. బడ్జెటునుచూసే 25% వ్యవసాయానికి, 25%

Sri M. Satyanarayana Raju] [27th July 1955

Power project కు ఖర్చుఅవుతోంది. గవర్నమెంటువారుకూడా పరిపాలనా విధానం చక్కగా నడవాలంటే ఏదో విధంగా పన్ను వేయవలసివస్తుంది. పన్ను వేయాలంటే ముఖ్యంగా కనిపించేవాడు రైతు. రైతుమీద పన్నులువేస్తే ఆందోళనగా వుంటుంది. పన్ను వేయకపోతే గవర్నమెంటు నడవదు. ఇకముందైనా ఆ నిష్పత్తిని తగ్గించాలి. Cottage industries కు చాలాతక్కువగా ఖర్చుపెడుతున్నారు.

ఇది చాలా తక్కువ. అందుచేత taxation విషయంలో గవర్నమెంటు ప్రతిసారి ఈ విమర్శను ఎదుర్కోవలసివస్తోంది. ఆ విధంగా కాకుండా గవర్నమెంటువారు Industries మీద ఎక్కువ శ్రద్ధతీసుకోవలసివుంటుంది. భారీ ఎత్తున నడిచే Industries విషయంలో private sector, public sector and mixed sector అని మూడు విధాలుగావున్నాయని సోదరులు చెప్పారు. అవడి కాంగ్రెసులో 'With the devolopement of private sector' అని అన్నారు. Private sector developement లో చాలా చిక్కులున్నాయి. Public limited companies యొక్క accounts చూస్తే కేవలం gambling మాదిరిగా వుంటున్నాయి. They can enhance the share value or decrease the share value according to their will and pleasure. Jugglery చేసి share value increase కాని decrease కాని చేసే అవకాశంవుంటుంది. ఈ విషయంలో గవర్నమెంటు ఏమీచేయలేకుండావున్నది. అందుచేత ఈ ఆటలు అడ్డానికి సాగుతోంది. ఒకప్పుడు రు. 10 ల share value రు. 2 లకు తగ్గించవచ్చును. దానిని తిరిగి రు. 18 లు చేయవచ్చును. ఇదంతా capitalists చేతుల్లోవుంటుంది. దానికి తార్కాణం ఏమిటంటే బిర్లావారు రు. 2 లకు shares తగ్గించివేసారు. ఇదివరకు ఆంధ్రులచేతులలో నడిచే The Vishakhapatnam Refinery Ltd., ఇప్పుడు కారణవశాత్తు ఉత్తరాదివారి చేతుల్లో నడుస్తోంది. Loss లో run అవుతున్నప్పటికి share value రు. 16,180 వరకు increase చేయవలసివచ్చింది. ఏ మాదిరిగా increase చేయగలిగారు? Factory shares అన్నీ కొని manage చేయవచ్చుననే ఉద్దేశంతో, factory monopolise చేయవచ్చుననే ఉద్దేశంతో, అట్లాచేసారు. గవర్నమెంటు అప్పుడు ఏమి చేయలేదు. ఇప్పుడు బిర్లావారు రు. 10 ల share రు. 2 ల వరకు తగ్గించివేసినా గవర్నమెంటు ఏమీచేయలేదు. Private sector ఇప్పుడు gambling మాదిరిగా వుంటోంది. దీనిని ఒకక్రమ పద్ధతిలోనికి తీసుకురావడానికి గవర్నమెంటు ఏమీ చేయలేదు. కనుక Devolopment of private sector అనడంలో అర్థంలేదు. Public and the Government చేయవచ్చును కాని అది కూడా సాధ్యమూకాదు.

దీనికి ఎన్నో ప్రతిబంధకాలు వున్నాయి. కొన్ని factories గవర్నమెంటు manage చేశారు. Khadi Industries Board వంటివి manage చేశారు. కొంచెం నష్టం వచ్చింది. ఈ మధ్య నెహ్రూగారు యూగోస్లావియాలో industrial socialism వున్నదని ఆశయం పెట్టుకొని పనిచేయాలన్నారు. అదేవిధంగా చేయాలంటే, ఇప్పుడు వున్న resources బట్టి ప్రాంతీయంగావున్న మనుష్యులకు గవర్నమెంటు ప్రోత్సాహం ఇచ్చి, industries ను క్రమేపీ వృద్ధిచేస్తే, కార్మికులే చివరకు management లోనికి వచ్చేట్లాచేస్తే ఉభయతారకంగా వుంటుంది. గవర్నమెంటుకు బరువు లేదు. కార్మికులు చాలామంది employ అవుతారు. Unemployment problem solve అవుతుంది. ఉత్సాహంగా పనిచేయడానికి అవకాశం వుంటుంది. ఇప్పుడు industries ఏర్పాటుచేయడంలో గౌరవనీయులైన మంత్రులు ఏమి చెబుతున్నారంటే, ముందు మీరు డబ్బు తీసుకువస్తే తరువాత సహాయం ఇస్తాము అంటున్నారు. కొన్ని చిక్కులు వున్నాయి. ప్రాంతీయ అభిమానాలు, జాతి అభిమానాలు మనకుపోలేదు. అవన్నీ అట్లాగేవున్నాయి, ఉత్తరాదినుంచి ఒకరు మనదేశంలో factory పెట్టడానికివచ్చారు అనుకోండి. On the basis that he ls an Indian మనం అంగీకరిస్తాము. వా అనుభవంబట్టి వారు ఏమిచేస్తారంటే, semi-technical posts లో కూడా వారి ప్రాంతీయులనే తీసుకొనివచ్చి, ఆంధ్రునికి రు.100,150లు ఇస్తే, అక్కడనుంచి వచ్చిన వారికి రు. 250,300 లు ఇస్తారు. తుమ్మపాల factory తగవుల విషయంలో గవర్నమెంటు కూడా interfere కావలసివస్తోంది. ఈ ప్రాంతీయ అభిమానాలు లావు అవుతాయి. Capital ఆంధ్రలో స్వతహాగాలేదు. Collectivety కూడా లేదు. వ్యక్తిగతంగా అభివృద్ధి అవాలనే సంకల్పంతప్ప సాంఘికంగా వృద్ధికావాలనిలేదు. గవర్నమెంటువారు వ్యక్తిగతంగావున్న intelligence mobilist చేయవలసి వుంటుంది. Co-operative పద్ధతిమీద కొన్ని factories నడపవలసివుంటుంది. వారికివున్న ఆస్తినిబట్టి ఒక credit society ఏర్పాటు చేయించి share capital కట్టించుకొని Provincial co-oparative bank చేత loans ఇప్పించి industry develop చేయించాలి కాని మాకు capital లేదు. మీరువచ్చి factories కు ఇతర ప్రాంతాల వారిని ఆహ్వానిస్తే చాలా చిక్కులు వస్తాయి. కార్మికులకుకూడా చిక్కులు ఎక్కువఅవుతాయి.

* Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా, భారీ పరిశ్రమలవల్ల దేశములో క్రమక్రమంగా పెరిగి వెర్రితలలు వేస్తున్న నిరుద్యోగ సమస్యను పరిష్కరించడము సాధ్యముకాదన్న విషయాన్ని అక్కడ కేంద్ర ప్రభుత్వము ఇక్కడ రాష్ట్ర ప్రభుత్వము స్పష్టంగా గుర్తించినందుకు నేను అభినందిస్తున్నాను. కాని భారీపరిశ్రమలు నెలకొల్పే సందర్భములో నెలకొల్పబడే పరిశ్రమలవల్ల ఏ ఒక్క చిన్న పరిశ్రమకు కూడా నష్టముకలుగని విధముగా మాత్రము ప్రభుత్వము చూడవలసివుంటుంది.

Sri Pragada Kotaiah] [27th July 1955

ఈ విషయములో ప్రభుత్వము ఇంకా ఒక స్పష్టమైనవిధానాన్ని నిర్ణయించుకొన్నట్లు తోచదు. ఎందుకంటే ఉదాహరణకు చేనేత పరిశ్రమను ప్రోత్సహించాలని చాలా స్పష్టముగా అక్కడ ఇండియాప్రభుత్వము చెప్పుతుంది. అందుకోసము మిల్లుబట్టలమీద సెస్సు విధించి ఆ సెస్సుసహాయముతో రాష్ట్రాలలోవున్న చేనేత అభివృద్ధికి పూనుకొన్నది. కాని యీ చేనేత పరిశ్రమ రక్షణకై 1952వ సంవత్సరములో చేనేతకు చీరెలు ధోవతులు కేటాయించాలనే ఆందోళన ఆకాశాన్ని అంటుకొనే సరికి మరొకమార్గములేక నిత్యానంద కనుంగో యాజమాన్యాన ఒక కమిటీ ఏర్పాటుచేశారు. ఆకమిటీచేసిన సూచనలు చాలప్రమాదకరమైనవి. యీ చేతిమగ్గాల అన్నిటిని 10-15 సంవత్సరాలకాలములో మిల్లు మగ్గాలుగా మార్చాలి అనేది సూచించింది. కాని యీవిషయమై మన ఆంధ్రప్రభుత్వము ఏమిచెప్పిందన్న సంగతికూడ మంత్రిగారు స్పష్టముగా చెప్పలేదు. కాకపోతే చేనేత పారిశ్రామికులు, చేనేత పనివారల సహకారసంఘాలనుండి మరియు యితర అనధికార సంఘాలనుండి వచ్చిన అభిప్రాయాలు ఇండియా ప్రభుత్వానికి లేదా అఖిలభారత చేనేతబోర్డుకు పంపుతామని చెప్పారు. ఐతే మన ప్రభుత్వమేమి చెప్పింది. బహుశా ప్రశ్నలకాలములో మన పరిశ్రమలమంత్రిగారు చెప్పిన సమాధానాన్నిబట్టి యీ చేతిమగ్గాలను power మగ్గాలుగా మార్చాలన వాదాన్ని మన ఆంధ్ర ప్రభుత్వము సమ్మతించపోవడము లేదని చేనేతపారిశ్రామికులతో ఏకీభవిస్తున్నదని నేను అనుకుంటున్నాను. కాని యీ చేనేత మగ్గాలకు మిల్లులకువున్న పోటీలో ప్రధాన సమస్యను మన మంత్రిగారు చాల చక్కగా వివరించారు. నేతమిల్లు ప్రక్కనే spinning section వుంటుంది. కాబట్టి కదురుమీద నూలు సరాసరి మగ్గములోనికి వెళ్లుతుంది. అందువల్ల వారికి గిట్టుబాటుధరకే నూలు అందడమువల్ల వారు సరసముగా బట్ట తయారుచేయగలుగుతున్నారు. చేతి మగ్గాలకు నూలు కావాలంటే మిల్లులలో కదుర్ల మీద వడికి నూలు చిలుపలుగా తయారై, తర్వాత బేళ్లుగా కట్టబడి రైలుమీద బండ్లమీద వర్తకులద్వారా చివరకు చేనేతపారిశ్రామికులకు చేరాలి. ఈ అదనపు ఖర్చు దాదాపు 100-కి 25 రూపాయలు వుంటుందని అందరు అంగీకరిస్తున్నారు. ఈనూలుధరలో వున్న వ్యత్యాసాన్ని తగ్గించడానికి సహకార నూలు మిల్లులు నెలకొల్పడమువల్ల కొంత ప్రయోజనము వుంటుందన్న వాదన చాలకాలముగా చెప్పబడుతున్నది. అందుకోసమే ఆంధ్రదేశములో ప్రాథమిక చేనేత సహకార సంఘాలు దాదాపు 40 లక్షలరూపాయలు పెట్టుబడిపెట్టి గుంతకల్లులో ఒక సహకార నూలుమిల్లుకూడ పెట్టారు. కాని చేనేతపారిశ్రామికుడు తప్పక భరించవలసిన unavoidable expenditure వుంది. ఎందుకంటె మిల్లు ఎక్కడ ఏ విధముగా పెట్టినా, కేంద్రీకృతమైన పద్ధతిలో పెట్టాలి. కదుర్లమీది నూలు మిల్లులలో [illegible] చేమగ్గములమీదికి సరాసరి రావడానికి వసతిలేదు, రీలింగుకావాలి, బండిగ్

కావాలి. రేలింగు కావాలి. ఇన్సూరెన్సు కావాలి. Transport వుండాలి. కొంత middlemen's profit వుండాలి. అది co-operative నూలు మిల్లు అయినా నూలు విషయములో ప్రభుత్వము మరొక నూతనవిధానాన్ని అవలంభించాలి. గ్రామాలలో అభివృద్ధికరమైన పనిసాధనాలను ప్రవేశపెట్టడానికి ఎంతవరకు అవకాశముందో ప్రభుత్వము చాల శ్రద్ధగా ఆలోచించాలి. అందుకు ఉపయోగపడగల నాలుగుకదుర్లతోటి పనిచేసే "అంబరు" చరకా వున్నది. దానిని మన రాష్ట్రములో ప్రవేశపెట్టడానికి ముందుగా ఆంధ్రప్రభుత్వము అంగీకరించినందుకు నేను వారిని అభినందిస్తున్నాను. కాని దానిని త్వరలో తీసుకొచ్చి గ్రామాలలో ప్రవేశపెట్టుకుంటే చేనేతవారికి సరసముగా నూలు అందడమే కాకుండా కొంత వరకు మనదేశములోవున్న నిరుద్యోగము తగ్గించడానికి అవకాశము వుంటుంది. కాని అసలుచేనేతకుప్రధానమైన రక్షణనుగూర్చి, అంటే చీరెలు, ధోవతులు కేటాయించుటనుగూర్చిమాత్రము ఆంధ్రప్రభుత్వము ఇప్పటికంటె చాల పట్టుదలతో పని చేయాలనివిజ్ఞప్తిచేస్తున్నాను. ఎందుకంటేకనుంగోకమిటిప్రతిపాదనలోఅమలునందున్న reservation చాలునని వుందికాని చేనేతపారిశ్రామికులు కోరినట్లు మరియు మన ఉమ్మడి మద్రాసురాష్ట్రశాసనసభ కోరినట్లు మరియు ఆంధ్రప్రభుత్వము కోరినట్లు చీరెలు దోవతులు కేటాయించే విషయములోమాత్రము కనుంగో కమిటీ ఏమీ సిఫారసుచేయలేదు. సిఫారసు చేయకపోగా చేమగ్గాలను తొలగించాలన్నారు. వారు దానికి చూపించిన వింతవాదము ఏమంటే 1960 నాటికి దేశములో జనాభా 40 కోట్లువరకు పెరుగవచ్చును. తలఒకటికి 18 గజాలగుడ్డ కావలసివచ్చును. దీనివల్ల దేశము మొత్తానికి ఏడువందల ఇరవైకోట్లు గజాలగుడ్డ కావాలి. ప్రస్తుతము మిల్లులలో 5 వందలకోట్ల గజాలగుడ్డ తయారుపౌతుంది. చేమగ్గాలమీద పవర్‌మగ్గాల మీద 160 కోట్ల గజాలబట్ట తయారుపౌతుంది. ఇంక 60 కోట్ల గజాలగుడ్డ అవసంగా కావాలి. అందుకోసం చేమగ్గాలను power మగ్గాలుగా మార్చాలన్నారు. కాని వారు వారిరిపోర్టులో 20 లక్షల మగ్గాలున్నాయని అంగీకరించారు. ఇందులో చాలామగ్గాలు, దాదాపు 8 లక్షలమగ్గాలు, పూర్తిగా పనిచేయడములేదు. పనిచేస్తున్న 12 లక్షల మగ్గాలు సంవత్సరానికి 2 వందలదినాలు మాత్రమే. కాబట్టి వున్న 20 లక్షల మగ్గాలుకూడా పూర్తిగా పనిచేయడములేదని చెప్పాలి. మూడువందలరోజులు పనిచేస్తే ఒకమగ్గము రెండువేలగజాలబట్ట తయారుచేయగలదు. కనుక 20 లక్షల చేమగ్గాలపై సాలుకు నాలుగువందలకోట్ల బట్ట తయారవుతుంది. అందువల్ల అదనముగా కావలసిన 60 కోట్ల గజాలబట్ట ఒకకాని ఖర్చులేకుండా దేశములోవున్న సాధనసంపత్తితోటి, తయారుచేయడానికి అవకాశమువుంది. అందువల్ల చేమగ్గాలను పవరుమగ్గాలుగా మార్చాలన్న కనుంగోకమిటీ ప్రతిపాదనలోవున్న ప్రమాదాన్ని ప్రభుత్వము గుర్తించి యీప్రమాదము రాకుండా చేస్తుందని చేనేతకు చీరెలు

Sri Pragada Kotaiah] [27th July 1955

ధోవతులు కేటాయించే విషయములో ఎక్కువశ్రద్ధ వహిస్తారని ఆశిస్తున్నాను. పోతే మనప్రభుత్వము చేయగల మరికొన్ని పద్ధతులున్నాయి. ప్రభుత్వము పోలీసుశాఖకు గాని జైళ్ళలోగాని hospitals లోగాని యితరఅవసరాలకు పూర్తిగా చేనేతగుడ్డ గాని ఖద్దరుగాని వాడునట్లు చేయాలి. ఖద్దరు చాలినంత లేదుకాబట్టి చేనేతగుడ్డ వాడకము చేయవలసినదిగా కోరుతున్నాను. కొద్దికొద్దిగా hospitals లోను జైళ్ళలోను ప్రవేశపెట్టడానికి ప్రయత్నము చేస్తున్నారు Forest guards వాడే విషయములో తుదినిర్ణయము జరిగినట్లులేదు. పోలీసు uniform కు సంబంధించినంతవరకు చేనేతగుడ్డ ఉపయోగపడదు అనే అభిప్రాయములో ప్రభుత్వం వున్నది. ఇది బహుశా సరియైన అభిప్రాయముకాదని నేను భావిస్తున్నాను.

1.00 p. m.

ఎందుకంటే వెనుకటి పరాయిప్రభుత్వం వారు Manchester లో తయారైన Drill లేకపోతే Twill ఇక్కడ పోలీసులకు dress గా ఉపయోగించి వారి మిల్లులు బాగుచేసుకోవడంకోసం వారు పూనుకొన్నారు. ఈవేళ చేమగ్గాలద్వారా Drill కాని Twill కాని నేయడం సాధ్యంకాదని అనుకోటంగాని, ఆబట్ట మన పోలీసులకు ఉపయోగించదని Inspector-General of Police చెప్పినంత మాత్రంచేతం మనప్రభుత్వం దాన్ని అంగీకరించి చేనేతపరిశ్రమకు సహాయంచేయకుండాఉండడంమాత్రం న్యాయంకాదని మనవిచేస్తున్నాను. ఎందుకంటే యుద్ధకాలంలో Military దుస్తులకు కావలసినబట్టను ఆంధ్రరాష్ట్ర చేనేత సహకార సంఘంవారు వారిప్రాథమికసహకారసంఘాలద్వారా తయారుచేయించిపంపించినప్పుడు, యుద్ధకాలంలో గుడ్డకొరతఉన్న రోజులలో చేనేతబట్ట పనికివచ్చినప్పుడు, యుద్ధానంతరం ఈవేళ చేనేతబట్ట పోలీసులకుగాని ఇతరఅవసరాలకుగాని పూర్తిగాఉపయోగించక పోవడంమాత్రం న్యాయంకాదని మరీమరీ నొక్కి నేను మనవిచేస్తున్నాను. చేనేత సహకారసంఘాల పెట్టుబడికి సంబంధించినంతవరకూ ప్రత్యేకంగా మన పరిశ్రమల మంత్రిగారికి చెప్పవలసినపని ఉండదు. ఈనాడు ఇండియాప్రభుత్వంవారు ఇచ్చేటటువంటి cess fund వల్లకూడా రాష్ట్రంలోయున్న 650 ప్రాథమిక చేనేత సహకార సంఘాలలో 245 పనిచేయకుండా ఉంటున్నవి. ఈ పెట్టుబడి సమస్యను శాశ్వతంగా పరిష్కరించేదానికోసం cess నిధితో ఒక financial corporation చేనేత సహకారసంఘాలకు సహాయంచేయడానికి నెలకొల్పడం అవసరం. ఆ విషయాన్ని మన పరిశ్రమల మంత్రిగారు చాలాసానుభూతితో పరిశీలనచేస్తూయున్నందుకు నేను అభినందిస్తూ సత్వరమే అది నిర్మాణమయ్యేదానికోసం వారు పూనుకోవాలని నేను కోరుతున్నాను. చాలా కష్టకాలంలో ఆంధ్రరాష్ట్ర చేనేత సహకార సంఘానికి, ప్రాథమిక చేనేత సహకారసంఘాలనుండి బట్ట కొనేదానికోసం, 20

లక్షల రూపాయలు అప్పు ఇచ్చారు. ఆ రోజున దానిమీద వడ్డీ ఉండకూడదనీ ఈ ప్రాథమిక చేనేత సహకారసంఘాలనుండి బట్టకొని వ్యాపారం చేయడంవల్ల వచ్చే నష్టాన్ని ప్రభుత్వం భరించాలని చెబితే అప్పుతీర్చుకొనే రోజున ఆలోచిస్తామని అప్పటి ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారూ, సహకారమంత్రి సంజీవయ్యగారూ, పరిశ్రమలమంత్రి పట్టాభి రామారావుగారూ చెప్పారు. కాని ఈ వేళ తీరా cess fund నుండి ఒక loan వస్తే దానిని ఆ loan క్రింద జమకట్టుకుని వడ్డీ చెల్లించవలసినదని అడుగుతున్నారు. అదిగాక వచ్చిననష్టాన్ని ఇచ్చేవిషయంకూడా ఇంతవరకూ ఆలోచనలో లేదు. ఈ విషయంలో ఆంధ్రరాష్ట్ర చేనేత సహకారసంఘం వారు ప్రభుత్వానికి చేసినవిజ్ఞప్తిని సానుభూతితో పరిశీలనచేసి వారికి నష్టం కలగకుండా వడ్డీ మినహాయించి ఆ ప్రత్యేకపరిస్థితులలో చేసినటువంటి వ్యాపారంలో వచ్చినష్టానన్ని ప్రభుత్వం భరించేటట్లుగా చూడవలసినదిగా నేను విజ్ఞప్తి చేస్తున్నాను. అన్నిటికంటె ప్రధానమైనది మన పరిశ్రమల శాఖ వేరుగానూ, సహకారశాఖ వేరుగానూ ఉండడంవల్ల చాలా చిక్కు సమస్యలు వస్తూఉన్నాయి. ఏ ఒక్క సమస్య పరిశీలించి నిర్ణయం చేయాలన్నప్పటికీ అక్కడ ఒకప్రక్క సహకార మంత్రిగారూ ఒకరుగా ఉండడం, పరిశ్రమలమంత్రి ఒకరు ఉండడం తటస్థించింది. అందువల్ల పరిశ్రమలనూ సహకారశాఖనూ జోడించి ఒకే మంత్రికి ఈ రెండుశాఖలూ ఇవ్వడంవల్ల చిన్నచిన్న సమస్యలుగాని, పెద్ద పెద్ద సమస్యలుగాని చాలా సత్వరంగా పరిష్కారం కావడానికి అవకాశాలుంటాయి. దురదృష్టవశాత్తు ఈ సందర్భంలో ఇక్కడ ముఖ్యమంత్రిగారు లేకపోయారు. ఐనప్పటికీకూడా వారీ సమస్యను తప్పని సరిగా పరిశీలనచేసి పరిశ్రమలతోపాటు, ప్లానింగుతోపాటు సహకార శాఖనుకూడా ఇప్పుడు మన పరిశ్రమల మంత్రిగారికి ఒప్పచెప్పడంవల్ల మన చేనేత పరిశ్రమ కాని ఇతర చేతివృత్తుల సమస్యగాని త్వరగా పరిష్కారం కావడానికి అవకాశం ఉంటుందని మనవిచేస్తున్నాను. ఈ చేతివృత్తుల సందర్భంలోకూడా ఏదో చిన్నచిన్న గ్రాంటులు ఇచ్చామంటే ప్రయోజనం లేదు. వారికికూడా స్పష్టమైన ప్రణాళిక ద్వారా సహకారసంఘాలుపెట్టి వడ్రంగులకుగాని కుమ్మరులకుగాని, కమ్మరులకుగాని అలాగే oil pressing గాని, Hand Pounding of rice కుగాని సహాయం చేయాలి. రాష్ట్రంమొత్తంమీద అక్కడ ఒక సంఘం ఇక్కడొక సంఘం పెట్టి మేము దంపుడుబియ్యం ప్రోత్సాహపరుస్తున్నాం, మేము వడ్రంగులను ప్రోత్సాహపరుస్తున్నాం, మేము కుమ్మరులను ప్రోత్సాహపరుస్తున్నాం కమ్మర్లను ప్రోత్సహిస్తున్నాం అంటే ప్రయోజనం లేదు. చాలాస్పష్టమైన కార్యక్రమాలతో ఈనాడు చేనేత పరిశ్రమను ముందుకు తీసుకువచ్చి నడిపించేదానికోసం ప్రభుత్వం ఎంత పట్టుదలగా వ్యవహారం చేస్తున్నదో, అంతటి పట్టుదలతో గ్రామంలోయున్న ఈ

artisans అందరికీకూడా ప్రోత్సాహపరచాలి. ఆనాడే గ్రామాలలోయున్న చేతివృత్తులు బాగుపడి తినేదానికి తిండి కట్టుకొనేదానికి బట్ట తలదాచుకోడానికి కొంప ఇంత చదువూ సంధ్యా ఏర్పడడానికి అవకాశం ఉంటుంది. కాబట్టి ఈ విషయంలో ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటుందని ఆశిస్తూయున్నాను.

* SRI R. JAGANNADHAM :—అధ్యక్షా! మన దేశంవ్యవసాయదేశం అనప్పటికీ, మనదేశంలోయున్న జనసంఖ్యలో అధికభాగం వ్యవసాయవృత్తి వల్ల జీవనంగడపనందువల్ల, మనదేశంలో పరిశ్రమలు త్వరలో నిర్మించడం ముఖ్యావసరం. అధికభాగం వ్యవసాయంతో జీవించుటవల్ల వ్యవసాయమీదవచ్చే ఆదాయం తగ్గిపోవుచున్నది. వ్యవసాయాభివృద్ధికూడా తగ్గుచున్నది. వ్యవసాయవృత్తి సంవత్సరంలో అంతకాలం ఉండదు. సంవత్సరంలో కొద్దికాలమేఅంటే సంగోరు కాలం ఉండడంచేత, మిగతా సంగోడకాలం లోనూ బీదరైతులకూ బీద ప్రజలకూ పనిపాటలులేక కూలినాలిలేక ఉండడం తటస్థిస్తోంది. ఈ వ్యవసాయ వృత్తిలో జీవించే అధిక జనసంఖ్యకు పనిలేనిరోజులలో పని కల్పించి ఏదైనా ఆదాయం కల్పించుటకు ముఖ్యమైన సమస్య పరిశ్రమలు. అందులో ముఖ్యంగా విశాఖపట్టణంజిల్లాలో మెట్టసరి ప్రాంతంలో శృంగవరపుకోట తాలూకా, చోడవరంతాలూకా నరిసీపట్నంతాలూకా వ్యవసాయంమీద ఆధారపడియున్నది, అందుచేత అక్కడున్న బీదప్రజలకు ఇతరవృత్తులులేక తిండికీ గుడ్డకూ కొరతఅయి అనేకవిధాల బాధపడుతున్నారు. ప్రభుత్వంవారు దాన్నిగురించి శ్రద్ధవహించి వారందరికీ బట్ట, తిండి కల్పించుటకు ఆప్రదేశంలో పరిశ్రమలు స్థాపించి తోడ్పడవలసిందని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. తదుపరి ఆ ప్రదేశంలో చెరుకుసస్యం విపరీతంగా పండుతుంది. కాని అక్కడ సమీపంలో తుంపాల area లో ఒక్క factory ఉన్నది కాని చోడవరం పరిసరప్రాంతంలో factory లేనందువల్ల ఆ agency ప్రాంతంలోఉన్న చెరుకు అక్కడకు తీసుకురానివ్వకుండా Orders వచ్చినవని ఈ మధ్య రైతులు చాలా ఆందోళనచేసినారు. అందుచేత గతసంవత్సరంలో ఈ చెరుకు వేసుకుంటూమని తుంపాల factory వారువచ్చి పరిసరగ్రామాలలో ఉన్న రైతులకు కొంత డబ్బిచ్చికొన్ని centres పెట్టి చెరుకు వేయించినతరువాత వారు సకాలంలో తీసుకోవడం లేనందువల్ల నేటివరకూకూడా ఆ చెరుకు అడక్కలేక వర్షాధిక్యంచేత చాలా నష్టపోయారు. కాబట్టి ప్రభుత్వం శ్రద్ధవహించి చోడవరం area చెరుకుపంటకు ప్రాముఖ్యమైన ప్రదేశం కాబట్టి ఆ area లో ఒక Sugar factory నిర్మించి ఆ ప్రజలకు సౌకర్యంకల్పించి పోషించవలసినదని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

* SRI SHEIK MOULA SAHIB:—"అధ్యక్షా! ఈ Demand మీద ఉపన్యసించుటకు నాకు అవకాశం ఇచ్చినందుకు వందనములు అర్పిస్తున్నాను. ఈ Demand ను నేను బలపరుస్తున్నాను. ఈ మంత్రిగారు ఉమ్మడి రాష్ట్రములో కూడ మంత్రిగా ఉండినారు కాబట్టి వారికి అప్పుడు జరుగుతున్న విషయాలు తెలిసియే ఉంటుంది. అప్పుడు ఈ దక్షిణ భారతానికి పరిశ్రమలకుగాను వచ్చే డబ్బు అంతేయు, మన ఆంధ్ర దేశము ఉన్నది అనేది దృష్టిలో పెట్టుకోకుండా, అరవదేశానికే చేకూరేటట్లు చేశారు. ఆవిధంగా అరవదేశంలో ఎన్నో పరిశ్రమలు ఏర్పడి దానివల్ల దారిద్ర్యం నిర్మూలనమై ప్రతివానికి పని చేకూరిందనే విషయం దృష్టిలో పెట్టుకోవలెనని మనవిచేస్తున్నాను. మన ఆంధ్రరాష్ట్రానికి పరిశ్రమలకుగాను మనవాటా వస్తున్నదో లేదో తెలియడంలేదు. అది సక్రమంగా వచ్చేటట్లు చేయవలెనని మనవి చేస్తున్నాను. స్వాతంత్ర్యము వచ్చినది లగాయతు మనదేశములో ప్రతిరాష్ట్రము కాంగ్రెసు ప్రభుత్వాన్ని బలపరుస్తూఉంటే, మన ఆంధ్రరాష్ట్రములో ప్రతిపక్ష పార్టీలు అనేకము బయలుదేరినదానివల్ల ఇటీవల ఈ కాంగ్రెసు ప్రభుత్వము పడిపోయినందున, మన ఇండియా ప్రభుత్వము ఎందువల్ల ఈ విధంగా జరిగిందని ఆలోచించి, ఇక్కడ నిరుద్యోగం ఎక్కువగా ఉన్నదని గుర్తించినారు."

(At this stage Mr. Deputy Speaker occupied the chair)

MR. DEPUTY SPEAKER :—పరిశ్రమలను గురించి మాట్లాడండి.

SRI SHEIK MOULA SAHEB :—మనదేశంలో నూటికి 75 మంది బీదప్రజానీకం ఉన్నారు. దారిద్రమే దీనికి కారణమని, వారు గుర్తించి ఇప్పటికైనా, యీ రాష్ట్రాన్ని అభివృద్ధిపరచండని మన రాష్ట్రానికి కొన్ని కోట్ల రూపాయలు అదనంగా అప్పు ఇవ్వడానికి వారు ఉద్దేశపడినారు. ఆడబ్బుతో ఈ పేద ప్రజానీకానికి ఏదైనా పనిచేకూర్చి అభివృద్ధికి తీసుకువచ్చుటకు వారు ఈవిధంగా అప్పు ఇస్తున్నారని నేను భావిస్తున్నాను. ముఖ్యంగా ఈనాడు పనిలేకుండా, ఏఅభివృద్ధి లేకుండా బీదతాలూకాలలో వుంటే నిరుద్యోగులు ఆకలియాత్రలు జరుపుతూ కృశించిపోతున్నారు గనుక, బీదకూలీవారు ఉన్నచోటనే, కావలసినటువంటి ఖనిజములు ఉన్నవి గనుక, వాటిని బయటికితీసి వాటిపరిశ్రమలను నెలకొల్పమని వారు ఉద్దేశించినట్లు నేను భావిస్తున్నాను. మా నెల్లూరుజిల్లాలో వెనుకబడినటువంటి మెట్టతాలూకాలలో aluminium copper మొదలైన గనులు ఉన్నవి—దాదాపు 20 సంవత్సరముల క్రిందట వాటి పరిశోధనలు జరిపి, పరదేశస్థులు ఈదేశాన్ని పాలించేటప్పుడు వారు ఈ ఖనిజములను ఇక్కడనుంచి export చేస్తూవచ్చారు. అటువంటి పరిశ్రమలు ఇక్కడ చాలా ముఖ్యమైనటువంటివి. కాబట్టి పరదేశమునుంచి

Sri Sheik Moula Saheb] [27th July 1955

వచ్చేటటువంటి ప్రతివస్తువుకు ఇక్కడ duplicate మాదిరిగా వస్తువులు తయారయ్యేటప్పుడు, వాటిని ఇక్కడ ఎక్కువ ప్రోత్సహించవలసి యుంటుంది. ఈ విషయాన్ని గురించి నేను మంత్రిగారికి విన్నవించుకొంటే, మాదగ్గర డబ్బులేదు, మేము అటువంటి పరిశ్రమలను ప్రోత్సహించడానికి చాలినంతమంది నిపుణులు లేరు, అని చెప్పుతున్నారు. ఈ విధానంచూస్తే నిజంగా యూనుతాటాకుల తొర్రగుడిసెలో ఉండే వాడు ఇంకా అణగిపొయేటట్లున్నా, మేడలుకట్టుకొన్నవాడు ఇంకా పైమేడలు కట్టేవాడుగా అయేటట్లుగాను కన్పిస్తున్నది. ఈ విధంగా అటువంటి బీదప్రజానీకంకూలి ప్రజలు ఉండుచోట ఖనిజములు ఉన్నవి అని పరిశోధనలు జరిపినచోట పరిశ్రమలు నెలకొల్పలేదు. ఆవిధంగా చేయకుండా ఇతరదేశాలకు ఎగుమతిచేస్తే, ఈఖనిజములు దుష్టులచేతిలో పడును. ఇవి చాలా ప్రధానమైనటువంటివి అని వారే చెప్పుచున్నారు. కాని మనదేశంలో ప్రభుత్వము వాటిని చేయజాలమన్నారు. సరిగదా, కనీసం వాటికి contribution ఇవ్వకపోయినా ప్రజలు స్వాంతటవారే స్వయముగా చేసుకోడానికైనా వారికి స్వేచ్ఛ ఇవ్వవలసిఉంటుంది. కాబట్టి ప్రభుత్వము ఈ బీదప్రజలను ప్రజలు చాలా అభివృద్ధిపరచవలెనని, పదేపదే ఉపన్యాసాల్పలిడంలో ప్రయోజనంలేదు. ఆమాటలను ప్రజలు పాటించరని మంత్రిగారు గమనింతురని నేనుమనవిచేస్తూ, ఇంతటితో విరమిస్తున్నాను.

*SRI S. NARAYANAPPA.—ఉపాధ్యక్షా! ఈ పరిశ్రమలకు సంబంధించిన Demand ను నేను బలపరుస్తూ ముఖ్యమైనటువంటి కొన్నిసూచనలు మాత్రము ప్రభుత్వదృష్టికి తెచ్చుచున్నాను. ఈ పరిశ్రమలశాఖను నిర్వహిస్తున్న మంత్రిగారు సమర్థులు, మేధావులు, వారు సక్రమంగా రాష్ట్రం మొత్తంపైన అన్నిజిల్లాలు తిరిగి Planning Committees యొక్క సభ్యులను కలుసుకొని జిల్లాకలెక్టరులను కలుసుకొని, అందుకు సంబంధించినటువంటి అధికార్లందరియొక్క సలహాలు తీసుకొనివచ్చి రాష్ట్ర Planning Commitee లో సమగ్రంగా యీ చర్చలు జరిపించి రాష్ట్రంమొత్తంమీద భారీపరిశ్రమలను, మధ్యరకపు పరిశ్రమలను, కుటీరపరిశ్రమలను నెలకొల్పాలనే దృఢసంకల్పముతో వారు ప్రయత్నిస్తున్నందుకు సమస్యము వారిని నేను ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. ప్రధానమైనటువంటి నిరుద్యోగ నివారించుటకుగాను కొన్నిసూచనలు చేయదలచాను. మనదేశంలో వ్యవసాయం తరువాత చాలా ముఖ్యమైనటువంటిది చేనేతపరిశ్రమ. ఈ పరిశ్రమలో పనిచేసేటటువంటి బీద చేనేత పారిశ్రామికులకు తగినంత ఆర్థికసహాయము కేంద్రప్రభుత్వము నుండి పొందుటకు తగినన్ని సిఫార్సులనుచేస్తూ ఈవృత్తిని పెంపొందించడానికి తగు

ప్రయత్నము చేస్తున్నందుకు రాష్ట్రప్రభుత్వాన్ని అభినందిస్తూ చేయవలసినటువంటి సహాయంమాత్రం పూర్తిగా చేయవలెనని కోరుతున్నాను. ముఖ్యంగా ఇప్పుడు రాష్ట్ర మొత్తంమీద చేనేత పరిశ్రమలో మూడులక్షల మగ్గములు ఉన్నవి. ఒకలక్షమగ్గములు మాత్రమే ప్రాథమిక చేనేత సొసైటీలలో పనిచేస్తున్నాయి. రెండులక్షలు మగ్గాలు బయట పనిచేస్తున్నాయి. ఒక లక్ష మగ్గములు మాత్రమే ఉన్నటువంటి ఈ ప్రాథమిక చేనేత సొసైటీలలో కూడా దాదాపు, 30, 40 సొసైటీలు మాత్రము బాగా పనిచేస్తున్నాయనేది ప్రభుత్వదృష్టికి వచ్చింది. ఆపరిస్థితిని మంత్రిగారు ప్రశ్నోత్తర సమయంలో సెలవిచ్చారు. మిగతా సొసైటీలు పనిచేయడంలేదు. ఆర్థికసహాయంలేక నిలచిపోయినవి. మెంబర్లు తీసుకొనిపోయిన నూలును తిరిగి ఆసొసైటీలకు బట్టరూపకముగా చెల్లించేటటువంటి శక్తిలేక నిలచిపోయినారు. కనుక, ఈనాడు సెస్సురూపకంగా ఇచ్చేటటువంటి ద్రవ్యంనుంచి కొత్త మెంబర్లకు సొసైటీలో చేరేటప్పుడు వారికి share capital కు నూలువగైరా కొనుక్కోవడానికి ఇస్తున్నటు వంటిసౌకర్యాన్ని మిగతా పాత మెంబర్లకుకూడా కలిగించి వారికి వృత్తినిచ్చినట్లయితే ఆవృత్తిలో ఇచ్చేటటువంటి వేతనాలద్వారా తమయొక్క సొసైటీ బాకీలను తీర్చుకోగలరు. ఆవిధంగా రాష్ట్రంమొత్తంమీద చేనేత పారిశ్రామికులకు జీవనభృతి లభిస్తుంది. ఇటువంటి సత్సంకల్పాన్ని సత్ప్రయత్నాన్ని మంత్రిగారు చేస్తారని నేను ఆశిస్తున్నాను. ఈ ప్రయత్నం చేయకపోతేమాత్రం, ఈఆరువందల సొసైటీలలో ఉన్నటువంటి వారు నిరుద్యోగులవడమే కాకుండా మాస్టర్ వీవర్సుదగ్గర వారుపోయి పనిచేసుకోడానికి వీలులేదు. ఇక్కడ సొసైటీలో మెంబరుగాఉండి అక్కడ మాస్టరు వీవర్సుదగ్గరకు వెళ్ళి పనిచేసుకోవడానికి వీలుఉండదు. మాస్టరు వీవరు రానివ్వడు. చేనేత సొసైటీలో పనిచేయడానికి అవకాశములేదు. ఈవిధంగా "between the devil and the deep sea" అనేటటువంటి పరిస్థితిలో చేనేత పారిశ్రామికులు బాధపడుతున్నారు. కనుక ఈపరిస్థితిని గుర్తించి యీసెస్సు నిధినుంచి వారికిసరియైన ఆర్థికసహాయం జేయవలెనని కోరుతున్నాను. తరువాత రిబేటువిషయంలో ఇది గుడ్డల పైన ఇస్తున్నారు. గుడ్డల విక్రయంపైన ఈవిధానాన్ని అమలుపరుస్తున్నారు. ఇంతే కాకుండా ఈచేనేత సొసైటీలలో నూలుచేనేత పారిశ్రామికులకు ఇచ్చేటటువంటి సందర్భంలో ఆసొసైటీలు ఎంతనూలు వీరికి గుడ్డను తయారుచేయడానికి ఇస్తుందో దానిపైన rebate లెక్కవేసి దాన్నితగ్గించి ఈ నూలుయిస్తే నిజంగా చేనేత పారిశ్రామికులకు ఆదాయములందుతుంది. తద్వారా వారికి ఒకవిధమైన లాభము, సౌకర్యము లభిస్తుంది. గనుక, ఈ విధానాన్ని అమలుజరుపవలసిందని కోరుచున్నాను. తరువాత ప్రగడ కోటయ్యగారు చెప్పినట్లు చేనేతకు చీరలు ధోవతులు ప్రత్యేకంగా కేటాయించవలెనని రాష్ట్రమొత్తంమీద ఎంతో ఆందోళన జరిగింది. మద్రాసు

Sri S. Narayanappa] [27th July 1955

రాష్ట్రంలో ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారు దీనికి ఒక తీర్మానమును తీసుకువచ్చి అసెంబ్లీలో ప్రతిపాదించినపుడు, కమ్యూనిస్టు పార్టీవారుగాని, ప్రజాపార్టీవారుగాని, ఏలాంటి భేదాభిప్రాయం లేకుండా అందరు ఏకగ్రీవంగా ఆతీర్మానాన్ని ఆమోదించి కేంద్రప్రభుత్వానికి పంపించారు. దానిపైన వారు కనుంగో కమిటీని వేశారు. ఆ కనుంగోకమిటీ ఈ చేనేతపరిశ్రమను ఒక విధంగా భక్షణ చేసేటటువంటి సూచనలు చేసింది. ఈకమిటీవారు ఇచ్చిన సూచనలు చేనేత పరిశ్రమకు, చేనేతపారిశ్రామికులకు తీరని నష్టాన్ని తీరని అన్యాయాన్ని కల్గిస్తాయని నేను భావిస్తున్నాను. ఈ కనుంగో కమిటీయొక్క సూచనలు గురించి, రాష్ట్ర చేనేతసలహాసంఘముకూడ తమ అభిప్రాయాన్ని ఇచ్చింది. కనుక రాష్ట్ర ప్రభుత్వము వెంటనే ఈ చేనేతసలహా సంఘముయొక్క అభిప్రాయాన్ని, తీర్మానమును కేంద్రప్రభుత్వానికి పంపించి, ఈకనుంగోకమిటీ సూచనలను వ్యతిరేకిస్తూ చేనేతపరిశ్రమకు సహాయంచేయుటకు అనువైన విధానాన్ని అనుసరించుటకు ప్రాతిపదికలు పంపించే ప్రయత్నం చేస్తారని నేను ఆశిస్తున్నాను.

తరువాత నంబరునూలు విషయంలో హెచ్చురేట్లతో విక్రయింపబడుచున్నందున చేనేతపరిశ్రమలో తయారుచేసేటటువంటి గుడ్డలు, మిల్లుగుడ్డల పోటీకి మార్కెట్‌లో నిలువడానికి వీలులేకుండా చేనేతవారు అవస్థపడుతున్న సంగతి ప్రభుత్వానికి తెలిసినదే. అందువల్ల నూలు మిల్లులు స్థాపించుతున్నారు. అయితే ఈనూలుమిల్లులు పెట్టడంవల్ల ఇప్పుడు కోటయ్యగారు చెప్పిన విధానంద్వారా మనకు సరియైనటువంటి ధరలకు నూలు లభించడంలేదు. ఇప్పుడు అంబరుచర్కా అనే ఒక కొత్త సాధనము ద్వారా నూలు తీయవచ్చు అని తెలియుచున్నది. ప్రతి చేనేత సొసైటీకి ఈ అంబరు చర్కాలు సప్లయిచేయించి తద్వారా నూలు నేరుగా చర్కానుంచి మగ్గమువాటికి వస్తే, మధ్య అయ్యేటటువంటి ఖర్చులు ఏవీలేకుండా, సరసమైనధరకు నూలులభించి, సరసమైన ధరలకు గుడ్డ తయారగుటకు వీలుంటుంది. అప్పుడు ఈ చేనేత గుడ్డ మార్కెట్‌లోకూడ సరసమైనధరకు లభించుటకు అవకాశం ఉంటుంది. కనుక ఈవిధంగా చేస్తారని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. తరువాత ఆర్థిక విధానానికి సంబంధించినంత వరకు, Finance Corporation ను ఒకదానిని ప్రత్యేకంగా ఈ చేనేత సొసైటీలకు ఏర్పాటుచేస్తే బాగుంటుంది. దాన్ని గురించి దాదాపు మూడుసంవత్సరముల నుంచి ఆందోళన చేస్తున్నాము. ఇటువంటి Finance Corporation ను ఒక దానిని నిర్మించినట్లయితే, ఈ చేనేత సొసైటీలయొక్క చేనేత పరిశ్రమయొక్క అభివృద్ధికి కావలసినంత దోహదం జరుగుతుంది. ఆ విధంగా ఆర్థిక సౌలభ్యం చేకూరుతుందని మేము ఆశిస్తున్నాము.

27th July 1955] [Sri S. Narayanappa]

తరువాత చేనేతపారిశ్రామికులకు గృహనిర్మాణానికి సొసైటీలు అక్కడక్కడ స్థలాలను తీసుకొని వేలకొలది రూపాయలు చెల్లించినవి. స్థలాలు అట్లనే ఉండి పోయినాయి. భవనాలు నిర్మాణం కాలేదు. ప్రభుత్వాన్ని ఆర్థికసహాయం కొరకు అర్థిస్తే ఇప్పటివరకు ఆర్థిక సహాయంకోసం చేయలేదు. కనుక ప్రభుత్వము దీనికి ఆర్థికసహాయం ఇచ్చి వెంటనే భవనాలు నిర్మించేందుకు ప్రయత్నం చేయవలెనని ఆశిస్తున్నాను."

* SRI G. BUSSANNA :—" ఉపాధ్యక్షా, మన ఆంధ్ర దేశములో చాలామటుకు industries తక్కువగానే వున్నవి. ఇప్పుడు మనకున్నటువంటి Industries లో పేరుచెప్ప దగ్గది Rajahmundry Paper Mills. ఇటువంటిది మరొకటి ఆంధ్ర పేపరుమిల్సు అనేపేరుతో స్థాపించితే బాగుంటుంది. పేపరు చేయడానికి బాంబూస్ చాలా అవసరము. నంద్యాల దగ్గరగావున్న అడవులలో యీ వెదురు చాలా దొరుకుతుంది. Transport charges కూడా చాలా తక్కువగా వుంటాయి, ఖర్చులు చాలా తక్కువగా వుంటాయి కాబట్టి యీ industry పెట్టినట్లయితే, అధికంగా లాభాలురావటానికి అవకాశమువున్నది. ప్రభుత్వమువారు యీవిషయము ఆలోచించి, ఆదోనిలోగాని, గుంతకల్లోగాని యీ పేపరుమిల్లు ఒకటి స్థాపించాలని కోరుతున్నాను.

తరువాత Spinning and Weaving Mill లు కూడా చాలా తక్కువగా వున్నవి. ఆదోని గుంతకల్లులో యీ మిల్లు ఒకటి వున్నది. దగ్గరదగ్గర 18 నుంచి 20 వేల మగ్గాలు నేసేవారు అక్కడ వున్నారు. చేనేతపారిశ్రామికులకు చేతినిండా పనిలేనందున, యీ మిల్లులో జాగాయివ్వమని అడిగితే, వాళ్లకు యివ్వకుండా మరొక జాతివారికి యిస్తున్నారు. Spinning and Weaving Mill కాబట్టి అందులో యీ weavers జాతివారినే తీసుకుంటే, మిల్లుకు చాలా ఉపయోగముగా వుండును. ప్రభుత్వము యీవిషయము గుర్తించి, యీమిల్లులో weavers జాతివారినే చేర్చుకునేటట్లు చేయుమని కోరుతున్నాము.

ఈనాటి పరిస్థితులనుబట్టి weavers జాతివారు కడుబీదవారుగా వుంటున్నారు. చేతినిండా పనిలేక నానా అవస్థలు పడుతున్నారు. అటువంటి బీదవారికి జీవనము ఏర్పాటుచేయాల్సి వున్నది. మరొక Spinning and Weaving Mill ప్రభుత్వమువారు ఏర్పాటుచేయబోతారని తెలిసింది. అది యేర్పాటుచేస్తే, గుంతకల్లులో ఒకటివున్నది కాబట్టి, యిప్పుడు రాబోయేదాన్ని కూడా ఆదోనిలోనే పెట్టించవలసిందిగా కోరుతున్నాను. Kothari Weaving Mills అనే పేరుతో

Sri G. Bussanna] [27th July 1955

ఆదోనిలోనే start చెయించుతూ, యీమిల్లు పూర్తిగా weavers కొరకేవనే పద్ధతిలో నడిపించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఆదోనిలోనే పెట్టించమనే దానికి కారణమేమిటంటే ఆదోనిలో 8 వేల మగ్గాలువున్నవి. Weaver class కు యీమిల్లులో పనిచేయటానికి బాగా యిప్పించమని ఆవిధంగా ఆర్డర్లు పంపమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

మన ఆంధ్రదేశములో woollen mills లేనేలేవు. ఈవిషయము అందరికి తెలుసు. ఎవరైనా ప్రైవేటు వ్యక్తులు యీ woollen mills ను స్థాపించేటట్లయితే ప్రభుత్వమువారుగూడా సహాయము చేయవలసిందిగా కోరుతున్నాను.

తరువాత బనగానపల్లి తాలూకాలో గచ్చాకునుంచి సుద్ద తయారుచేస్తారు. ఈ సుద్దనుంచి సామానులు తయారుచేస్తారు. ఈసామానులు తయారు చెయటానికి ఒక industry స్థాపించి అది ఆ బనగానపల్లి ప్రాంతంలోనే పెట్టించవలసిందని అంటున్నాను. ప్రభుత్వమువారు యీ గచ్చాకుదొరికే ప్రదేశాలను పరిశీలించాలని అంటున్నారు. ఈ industry కి oppose చెసేవారు members లో ఎవరూగూడా లేరు. కాబట్టి యీ industry ని స్థాపించితే బాగుంటుందని అంటున్నాను."

SRI RAJARAM :—"ఉపాధ్యక్షా! గౌరవనీయులైన మంత్రిగారు ప్రవేశపెట్టిన పరిశ్రమల డిమాండును నేను బలపరుస్తూ కొన్నిసూచనలు చేయవలచుకున్నాను. అనంతపురంజిల్లాలో పరిశ్రమలు లేవు. కుటీర పరిశ్రమలు తప్ప పెద్ద పరిశ్రమలు యేమీ లేవు. హిందూపురంలో చక్కెరఫ్యాక్టరీ పెట్టదలచారు. తాడిపత్రిలో నూలుమిల్లును స్థాపించటానికి మంత్రిగారు ఒప్పుకుంటున్నందులకు చాలా సంతోషించుచున్నాను. అందుకు వారిని అభినందించుచున్నాను. ఇంతేకాకుండా అనంతపురంజిల్లా చాలా వెనుకబడిన ప్రదేశము. అక్కడ ఎక్కువగా పేద ప్రజలుంటున్నారు. అందువల్ల ఆ జిల్లాలో పారిశ్రామికంగా కొన్ని విద్యాకేంద్రాలు నెలకొల్పినట్లయితే చాలామటుకు ప్రజలకు ఉపయోగముగా నుండును. గుంతకల్లులో రంగులఫ్యాక్టరీ, వార్నీసుఫ్యాక్టరీ స్థాపించాలని చాలాకాలంగా ప్రయత్నిస్తున్నట్లు విన్నాను. ఆ ప్రయత్నము యింతవరకు ఫలించలేదు. ఇకముందైనా ప్రభుత్వంత్వరలో తగుచర్యతీసుకుంటారని ఆశిస్తున్నాను. అంతేకాకుండా గుంతకల్లు పారిశ్రామికంగా మంచికేంద్రము. ఇదిగాక రైల్వేకూడలి. రాకపోకలకు చాలా సౌకర్యంగావుండే ప్రదేశము. ఇటువంటిచోటులో Surgical Cotton Industry ఒకటి నిర్మించడము చాల అవసరము. ఈ మధ్య ఆంధ్రదేశములో ఎక్కడైనా యీ Surgical Cotton Industry స్థాపించటానికి సూచనలు వున్నవి కాబట్టి, యీ

ఫాక్టరీని గుంతకల్లులో పెట్టించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ప్రభుత్వము యీ సూచన అంగీకరిస్తారని ఆశిస్తున్నాను. ముఖ్యంగా అనంతపురం జిల్లాలో హరిజనులలో చర్మకారకవృత్తిచే జీవించేవారు చాలామంది వుంటున్నారు. ఈ వృత్తి లేనప్పుడు వీరికి జీవించటానికి ఏ విధంగాను ఆధారములేదు. కనుక Modern Tanniug Industry అనంతపురంలో పెట్టించినట్లయితే, యీ ప్రాంతాలలోవుండే చర్మకార్మికులకు పనిచేయటానికి, వీలవుతుంది. ఇంతేకాకుండా యీ industry యిక్కడ పెట్టినట్లయితే, యీ ప్రాంతమంతేను పారిశ్రామికంగా వృద్ధికావటానికి అవకాశముంటుంది.

తరువాత అప్పులుయిచ్చే విషయములో చాలా తగాదాలు వుంటున్నవి. అప్పులు యివ్వడములో చాలా ఆలస్యము, అన్యాయాలు జరుగుచున్నవి. అందువల్ల యీ అప్పులుయిచ్చే డిపార్టుమెంటువారికి ఒక్కరికే యీ అధికారము ఉండేటట్లు చేయాలి. రెవిన్యూడిపార్టుమెంటువారు, యింకా యితర డిపార్టుమెంటువారు, యీ అప్పులు యిచ్చేవిషయములో జోక్యము కలుగజేసుకోవడమువల్ల, ప్రజలకు చాలా ఆలస్యములు, అన్యాయాలు జరుగుచున్నవి. కాబట్టి ప్రభుత్వము యీ విధానము మానివేసి, పరిశ్రమల డిపార్టుమెంటువారే అప్పులు మంజూరు చేయాలని ప్రభుత్వానికి మనవిచేస్తూ విరమిస్తున్నాను."

SRI T. VEERARAGHAVULU:—"ఉపాధ్యక్షా! ప్రభుత్వమువారు తెచ్చిన పరిశ్రమలనుగురించి తెచ్చిన పద్దును బలపరుస్తూ కొన్ని ముఖ్యమైన సలహాలను మనవిచేస్తున్నాను. పారిశ్రామిక విధానంలో ముఖ్యంగా ప్రభుత్వము దృష్టిలో వుంచుకొనవలసిన సంగతులు వున్నవి. అవి యేమిటంటే, (1) Employment potency. (2) Productive capa?ity. Private sector ను గురించి ప్రభుత్వమువారు అందజేసిన నోట్సును చదువగా గమనించవలసిన విషయమేమిటంటే, యీ private sector అనేది నామ మాత్రంగా వున్నదని అనుకుంటున్నాను. అందుచేత అది నామ మాత్రంగావుంటే, totalitarianism కు దారితీయడానికి ప్రమాదం వున్నదని ప్రభుత్వమువారు గుర్తించాలి.

రెండవ విషయము. కొన్ని కుటీర పరిశ్రమలు గురించికూడా ప్రభుత్వము తమ యిష్టము వచ్చినట్లుగా వారు అందజేసిన నోట్సులోవున్నది. కాని కుటీరపరిశ్రమల యందు చూపదగినంత ఆసక్తి, శ్రద్ధచూపించడములేదని నేను విచారపడుతున్నాను. ఈ విషయములో ప్రభుత్వము step-motherly treatmeut చూపిస్తున్నది. మనము గ్రామసీమలలోకి వెళ్లి చూచినట్లయితే అక్కడ ఎన్ని యిబ్బందులు పడుతూ జీవించు

[Sri T. Veeraraghavulu] 27th July 1955]

చున్నారో తెలియగలరు. మంత్రిగారుకూడా ఒక్క పర్యాయము ఆ ప్రదేశాలు ఏలాగునవున్నవో చూచిరమ్మని మనవిచేస్తున్నాను. ఈ కుటీరపారిశ్రామికులకు వ్యక్తిగతంగా కొద్దికొద్ది మొత్తాలైనను యిచ్చి సహాయముచేస్తే, యీ సొమ్మును వారి పరిశ్రమలకు వుపయోగించి వృద్ధికి తెచ్చుకోగలుగుతారు. ఈ విధంగాచేస్తే, వారికి జీవనభృతికికూడా ప్రభుత్వము సహాయము చేసినట్లువుతుంది. అందులో కొంతమంది వ్యవసాయి కూలీలుగూడ, వీటికి పనిదొరకని సమయములలో తాటిపీచు కొట్టి అమ్ముకోవడంకూడా జరుగుచున్నది. అయితే ప్రభుత్వమువారు అందజేసిన యీ నోట్సులో Coir Industry అనివున్నది. దీన్ని నేను కొబ్బరిపీచుతో తయారు చేసే వ్యవహారము అనుకున్నాను. కాని నేను fibre extracts ను గురించి మాట్లాడుతున్నాను. కొవ్వూరు తాలూకాలో యీ పీచు వ్యాపారము సంవత్సరములో 3, 4 మాసములు జరుగుతుంది. కాని పశ్చిమ గోదావరిజిల్లాలో యీ వ్యాపారము జాస్తిగావుంటుంది. ఈ పీచువ్యాపారముచేసేవారు చాలా బీదవారుగా వున్నారు. వాళ్లకు తాటిచెట్లుగాని, భూములుగాని వుండవు. అందువల్ల యీ తాటిచెట్లు కౌలుకు అనో లేక మరొకవిధంగానో కొనుక్కొని, యీ పీచువ్యాపారము చేస్తూ జీవించుచున్నారు. పేదవారుగావున్న కారణముచేత, వారివద్ద డబ్బుమిగులుగా వుండదు. ఏరోజుకూలి ఆరోజు సంపాదించుకొని బ్రతుకుతున్నారు. ధనవంతుల దగ్గర చిన్నచిన్న అప్పు తీసుకొని యీ తాటిచెట్లు కొనుక్కొని, వారు తయారుచేసి అమ్మితే, కొన్ని సమయములలో చివరకు అప్పుతీసుకున్న పైకమునకు వడ్డీకికూడా చాలకుండాపోయే పరిస్థితులుకూడా వున్నవి. ఇటువంటివారికి తక్కువ రేటు వడ్డీమీద, కో ఆపరేటివ్ సొసైటీలద్వారా, లేకపోతే, వ్యక్తిగతముగానో, చిన్న చిన్న అప్పులు యిచ్చినట్లైతే, యీ పేదవారికి సహాయము చేసినట్లవును. పైగా యిది కుటీర పరిశ్రమలను ముందుకు తీసుకొని రావటానికి అవకాశమున్నది. ప్రభుత్వము యీ విషయములో కొంత ఆలోచించాలని మనవిచేస్తున్నాను.

తరువాత చర్మకారక పారిశ్రామికుల విషయములో ప్రత్యేకశ్రద్ధ చూపవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఎందుకంటే ప్రతిజిల్లాలోకూడా యీ tanning అప్పుడప్పుడు జరుగుతుండడము అందుకుగాను ఒక ప్రభుత్వోద్యోగిని నియమించబడడము, పది, పన్నెండుమంది పిల్లలకు శిక్షణ యివ్వడముకూడా జరుగుచున్నది. కాని యీ tanning క్రింద, administration కొరకు ప్రభుత్వమువారు ఖర్చుపెట్టేటటువంటి డబ్బుఅంతాకూడా దుబారాఅవుతున్నదనే చెప్పవలసివున్నది. ఇందులో నాకు ప్రత్యక్ష అనుభవమువున్నది. ఎందుకంటే,

సర్టిఫికేటుపొంది యిక్కడ ఆఫీసరుగా ప్రభుత్వముచే నియమింపబడిన ఆయనకు tanning రాదు. సరికదా, ఏ విధంగాను పని తెలియనివాడుగా వుంటున్నాడు. నిజానికి ఒకమేస్త్రీగా చెలిసిన పిల్లవాడిని కలుపుకొని, యీ ఆఫీసరుకు యిచ్చే జీతము అతనిమీద ఖర్చుచేస్తే యీ tanning బాగా జరుగుతుంది. అంతేకాని tanning జరిగినా, జరగకపోయినా తన జీతము నెల ఆఖరున వచ్చేటట్లు చూచుకొని కాలము గడుపుకుని వెళ్లిపోతాడు. ఇందులో శ్రద్ధవుండదు. అందువల్ల యీ tanning పరిశ్రమలో యిదివరకు వుంటున్న వారికే యిది లాయకీగాని కొత్తవారికి పనికిరాదు. పైగా చర్మముతో వస్తువులు తయారుచేసేవారికి దీనిలోని skill తెలుస్తుందిగాని, బైటవారికి అట్టే తెలియదు. అందువల్ల ప్రభుత్వమువారు యీ చర్మకారకులకు కావలసిన మదింపుయిస్తే, వారంతటవారే బజారులో పోటీచేసి, జీవనోపాధి అభివృద్ధిచేసుకొని బ్రతకటానికి అవకాశమువుంటుంది. అందువల్ల కో-ఆపరేటివ్ సొసైటీలద్వారాగాని, లేకపోతే వ్యక్తిగతంగానో గాని, డబ్బుసహాయముచేసి ప్రోత్సాహపరిస్తే, హరిజనులలో చాలాభాగము యీ చర్మకారక వృత్తిలోదిగి, యీ పరిశ్రమను పైకితీసుకొనిరాగలుగుతారు. మంత్రిగారు యీ విషయములో కొంచెము దీర్ఘాలోచన చేయమని కోరుతున్నాను.

తరువాత గ్రామసీమలలో Brick making అనేది మరొక కుటీరపరిశ్రమ వున్నది. ఈ రాళ్లు తయారుచేసేవారు సాధారణముగా కూలీకిచేసి లాభాలు సంపాదించుకుంటారు. ఇవి తయారుచేసేవారుఅంతా పేదవారే. వీరికిగూడా Co-operative society ల ద్వారా ఆర్థికసహాయము చేయాలని మనవిచేస్తున్నాను. కాబట్టి యిటువంటి చిన్న చిన్న పరిశ్రమలు ఎన్నో రకాలుగా గ్రామసీమలలో జరుగుతున్నవి. ప్రభుత్వము యీ పరిశ్రమల విషయములో అవసరమైన వారికి డబ్బు సహాయము కో-ఆపరేటివ్ సొసైటీలద్వారాచేస్తే, యీ పరిశ్రమలు చేసేవారికి చాలా వుపయోగకరంగా వుంటుందని మనవిచేస్తూ విరమిస్తున్నాను.''

1-30 p. m.

**Mr. DEPUTY SPEAKER :—I now adjourn the House to meet again at 3 p. m.**

**The House rose for lunch**

## AFTER LUNCH—3 p. m.

**(Mr. Speaker in the Chair)**

**Sri P. GUNNAYYA :—**" అధ్యక్షా, ఈ డిమాండును నేను బలపరుస్తూ ప్రభుత్వమువారికి కొన్ని సూచనలు మనవి చేయదల్చుకున్నాను. శ్రీకాకుళం

జిల్లా బొబ్బిలి తాలూకాలో, సీతానగరం, బొబ్బిలిల్లో రెండు పంచదార మిల్లులు స్థాపింపబడ్డాయి. ఇంతవరకు 100 గ్రామముల చెఱకును ఎప్పుడూ తీసుకుంటూ వుండేవారు. కాని ఇప్పుడు 40 గ్రామాల చెఱకును తీసుకుంటామంటున్నారు. మిగిలిన 60 గ్రామాల చెఱకును తీసుకోమంటున్నారు. కనీసం 20 లక్షల రూపాయలు ఖరీదుచేసే చెఱకు అయినా తీసుకోక పోయినప్పుడు రైతులకు విపరీతమైన నష్టము వస్తుంది. ప్రభుత్వమువారు ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పార్వతీపురము తాలూకాలో ఒక పంచదార మిల్లునుపెట్టి రైతులకు చెఱకు ఉత్పత్తి చేయుటకు ఎక్కువగా ప్రోత్సాహము కలిగిస్తారని ఆశిస్తున్నాను. ఈ సంవత్సరముకూడా ఇది వరకు తీసుకున్నట్లే 60 గ్రామాల చెఱకునుకూడా తీసుకొని రైతులకు 20 లక్షల రూపాయిల నష్టము రాకుండా చేయాలని ప్రభుత్వమువారిని కోరుతున్నాను. ప్రభుత్వమువారు మన ఆంధ్రదేశములో సినీమాలు మొదలైన వాటికికూడా తగినంత ప్రోత్సాహము ఇస్తున్నారు. శిల్ప పారిశ్రామికులకు హంపీ, విజయనగరము, మహానంది, తుంగభద్ర ఇటువంటి గొప్పక్షేత్రాలలో ప్రోత్సాహము ఇస్తున్నట్లు అందులో వుంది."

THE HON. SRI K. VENKATA RAO :—" ఏదో ప్రోత్సాహము ఇస్తున్నారు అంటున్నారు. అది ఏదో ఇక్కడకు వినిపించడములేదు."

SRI P. GUNNAYYA :—" శిల్ప పారిశ్రామికులుఅంటే బంగారము, వెండి, కమ్మరము, కుమ్మరి మొదలగు వృత్తులు గలవారికికూడా తరతరాలనుండి ప్రోత్సాహము ఇవ్వలేదు. వారు గ్రామాలలో అనేకవిధాలుగా క్షీణించి పోతున్నారు. వారికి కో-ఆపరేటివు సొసైటీలద్వారాగాని, ఇండస్ట్రియల్ డిపార్టుమెంటు ద్వారాగాని, తగినంత ప్రోత్సాహము చేకూర్చాలి. అప్పుడు దేశంలో మానవజన్మమెత్తిన ప్రతిమానవునికికూడా తగినటువంటి నాగరికత నిచ్చిన వారమవుతాము. ఈ శిల్పుల సంగతులన్నియు మంత్రిగారికి బాగా తెలుసును.

మా తాలూకాలో సున్నపురాళ్లగనులు ఎక్కువగా ఉన్నాయి. అక్కడ గనులు ఉన్నవారికి తగినధనము లేక ఎక్కువగా సున్నము తయారు చేయలేక పోతున్నారు. కనుక తెల్లసున్నము తయారుచేసే సొసైటీని పార్వతీపురంలో ఏర్పాటు చేసి, సొసైటీలద్వారా ఎక్కువ సున్నమును ఉత్పత్తిచేయించి ప్రతి గ్రామాల వారికి అందేట్లు చేయాలి. ఇళ్లు కట్టుకోడానికి సున్నము దొరక్క అక్కడి ప్రజలు చాలా ఇబ్బంది పడుతున్నారు. వెంటనే ప్రభుత్వమువారు తగిన సదుపాయము

కల్పిస్తారని ఆశిస్తున్నాను. పంచదార మిల్లు విషయములోకూడా తగుచర్య తీసుకొని అక్కడి గ్రామాల రైతులకు అన్యాయము జరుగకుండా చూడాలని మనవిచేస్తున్నాను. ఈ అవకాశము నాకు ఇచ్చినందులకు అధ్యక్షులవారికి నా హృదయపూర్వక అభినందనలు సమర్పిస్తూ విరమిస్తున్నాను."

SRI K. SANTHAPPA :—"అధ్యక్షా! మనము పూర్వపు మద్రాసురాష్ట్రములో వున్నప్పుడు మా అనంతపురం జిల్లాలోని కల్యాణదుర్గము తాలూకా కంబదూరు గ్రామంలో ప్రభుత్వము 18 వేల రూపాయిలు ఖర్చుపెట్టి 22 తొట్లు, ఒక బిల్డింగు కట్టించినారు. ఇప్పటికి 8 ఏండ్లు అయింది. అవి ఇప్పటికీ పనిచేయడము లేదు. మొన్న మన డిప్యూటీ ముఖ్యమంత్రిగారు, కళా వెంకటరావుగారు, హైదవానీ తిప్ప ప్రాజెక్టు చూడ్డానికి వెళ్లినప్పుడు వారు ఆ దోవనే అప్పరు పెన్నారు ప్రాజెక్టు చూడ్డానికి వచ్చినారు. అక్కడవున్న బిల్డింగుకూడా చూసినారు. ఆ బిల్డింగుకు తప్పకుండా సహాయము చేస్తామనికూడా వాగ్దానముచేసినారు. ఇప్పుడు సహకార సంఘంద్వారా, మేము షేరు కాపిటలు కట్టడానికి తగినసమర్థత లేనివారము. ఇక్కడ 400 కుటుంబాలు వున్నాయిగాని మేము అంతాకూడా బీదవర్గము వారము. ప్రభుత్వమువారు 20 వేల రూపాయిలు సబ్సిడి ఇచ్చి దానిని నడిపిస్తారని ఆశిస్తున్నాను. మా గ్రామము మైసూరుస్టేటు సరిహద్దున వున్నది. ధర్మవరం మీదుగా పోయేందుకు వీలుగావుండును. బళ్ళారి చిత్రదుర్గమునుంచి ధర్మవరము మీదుగా రైలుమార్గముంటే అక్కడనుంచి మద్రాసు, రేణిగుంట, పాకాల పోయేదానికి అనుకూలంగా వుంటుంది. ప్రభుత్వమువారు దానివిషయము జాగ్రత్తగా ఆలోచించి వెంటనే తగుచర్య తీసుకోవాలని ప్రార్థిస్తున్నాను. ధర్మవరము తాలూకాపెద్ద అప్పరు పెన్నారు ప్రాజెక్టుకు దగ్గరలో ఒక ఫుడ్ స్టాల్ పెట్టినారు. దానికి పరిశ్రమల మంత్రిగారు పునాది రాయివేసినారు. అక్కడ పనికాగానే ఆ కట్టడమును తీసివేయక అట్లాగే వుంచవలయును. అది కొమ్ముల ఆస్పత్రికి చాలా బాగుంటుంది."

THE HON. SRI K. VENKATA RAO :—"పెటర్నిటీని తీసుకువెళ్లి ఇండస్ట్రీస్‌లో చేరుస్తున్నారు."

SRI K. SANTHAPPA :—"మా జిల్లాలో చర్మకారులు ఎక్కువగా వున్నారు. ధర్మవరము మా జిల్లా మధ్యలోవున్నది. అక్కడ ఒక ఫ్యాక్టరీని పెట్టినట్లయితే పేదప్రజానీకానికి నిరుద్యోగసమస్య తగ్గించడానికి అనుకూలంగావుంటుంది ప్రభుత్వమువారు దానికితగిన సహాయము చేయాలని ప్రార్థిస్తున్నాను."

3-30 p. m.

* SRI B. SUBBA RAO :—" అధ్యక్షా ! ప్రస్తుతము మన దేశములో నిరుద్యోగసమస్య చాలా ఎక్కువగా నున్నది. దానికి కారణము మనదేశము పారిశ్రామికంగా వెనుకబడిఉండడమే. ఈపరిశ్రమలు ఎక్కువ అభివృద్ధి చెందనిదే మన దేశము అభివృద్ధి కాదని మనవిచేస్తున్నాను. పల్లెలలో 100 కి 90 మంది హరిజనులు వ్యవసాయ కూలీలుగా పనిచేస్తున్నారు. వారికి సంవత్సరములో అనేక రోజులు ఏవిధమైన పనిలేకుండా ఖాళీగా వుండడమువల్ల వారి కుటుంబపోషణలు జరుగక చాలాబాధ పడుచున్నారు. అటువంటి పరిస్థితులలో వాళ్లకు గృహపరిశ్రమలు ఇంకా చిన్న పరిశ్రమలు స్థాపించి వాళ్ళకు వృత్తికల్పించే ఏర్పాటు చేయవలసినదిగా కోరుచున్నాను. తరువాత హరిజనులలో ఎక్కువభాగము చర్మకారకవృత్తివల్ల జీవనము చేస్తున్నారు. అయితే ఈ వృత్తివల్ల వాళ్ళకు సరియైన కూలి దొరకుటలేదు. ఎక్కువ పెట్టుబడిదారులు వీరిదగ్గరనుంచి యీతోళ్ళు కొనుక్కొని లాభములు పొందుతున్నారు. అందువల్ల యీ చర్మకారులకు co-operative basis మీద industries పెట్టి వారలకు ఎక్కువ పనికల్పించి తర్వాత వారికి జీవనమునకు లోటులేకుండా చూడవలెనని కోరుచున్నాను. హరిజనులలోను ఇంకా ఇతర కులములలోను కొద్దిగా చదువుకొన్నవారు ఇటు ఉద్యోగమునకు అటు వ్యవసాయపనులు చేయుటకు పనికిరాకుండా చాలా బాధపడుచున్నారు. అటువంటివారికి vcational training schools పెట్టి వారలకు తగిన శిక్షణ ఇచ్చినట్లయిన బాగుంటుందని మనవి చేయుచున్నాను. కనీసము తాలూకాకొక vocational training school అయినా పెట్టవలెనని కోరుచున్నాను. ఏవిధముగానైనా educated, uneducated లోఉన్న unemployment ను తొలగించుటకు గృహపరిశ్రమలను విరివిగా స్థాపించి వారలకు వృత్తి కల్పించవలసినదిగా కోరుచున్నాను. అంతేకాకుండా ప్రభుత్వము భారీపరిశ్రమలనుకూడా ఎక్కువగా ప్రోత్సహించి వాటిని అభివృద్ధిపరచి ప్రభుత్వముయొక్క ఆధ్వర్యమున నడపవలసినదిగా కోరుతూ ప్రస్తుతము ప్రభుత్వ ఆధ్వర్యమున నడుపిస్తున్నటువంటి రాజమండ్రి పేపరుమిల్లును యింకా ఎక్కువ అభివృద్ధిచేయవలసినదిగా కోరుచున్నాను. మా రాజమండ్రి తాలూకాలో రాజానగరము ఫిర్కాలో 25 గ్రామములు యితర ఫిర్కాలలో కొన్ని గ్రామాలు కేవలము తాటిపీచు కొట్టుకొని బ్రతుకుచున్నారు. కేవలము దానివల్ల షావుకార్లు ఎక్కువ లాభమును పొందుచున్నారు. అందువల్ల కార్మికులకు co-operative basis మీద కొంత పెట్టుబడితో రాజానగరములో

industry పెట్టినవారందరికి తగినలాభము కలుగుతుంది. కాబట్టి ప్రభుత్వం అక్కడ fibre industry ని స్థాపించమని కోరుతూ విరమిస్తున్నాను."

*SRI VAVILALA GOPALAKRISHNAYYA :—"అధ్యక్షా, ఈ పరిశ్రమల డిమాండుపై కోత తీర్మానమును బలపరచుచు నేను మాట్లాడుతున్నాను. ఈనాడు ఆంధ్రదేశములో 2 కోట్ల జనాభా గలదు. ఈ 2 కోట్లలో 15 లక్షలుమాత్రము ఏదైనా పనిచేస్తున్నారని జాబితా తెలుపుతున్నది. అందులో factory లు వస్తు నిర్మాణ పరిశ్రమలో ఒకలక్షమంది మాత్రమే పనిలో ఉన్నారని మనకు తెలుస్తున్నది. అందువల్ల మొత్తముమీద 2 కోట్ల జనాభాలో సరిగా orginised industries లో కూలీలు ఒకలక్షమందినిమాత్రమే పోషిస్తున్నవని ప్రధానముగా గుర్తించవలసిన అవసరమున్నది. అందువల్ల వ్యవసాయికముగామాత్రము ఆధారపడుట చాలదని అందువల్ల industries ను స్థాపించవలెనని కోరుతున్నాను. The objective aim is maximum production and equitable distribution, no unemployment అని రెండవ పంచవర్ష ప్రణాళిక planframe వ్రాయబడివుంది."

THE HON. SRI K. VENKATA RAO :—"అదేకదా నేనూ చెప్పు చున్నాను."

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—"మధ్యలో interruptions వస్తాయని నాకు తెలుసు. నా point కు నన్ను రానివ్వండి. కొత్త point కు వచ్చేటప్పుడే ప్రక్కకు లాగకండి."

MR. DEPUTY SPEAKER :—"ఏనిశ్చయమైన సలహాలిస్తారో అని మంత్రిగారు అడుగుచున్నారు."

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—"ఇప్పుడు నిరుద్యోగము ఉన్నదని అందరికి తెలుసు. Industries ను కూడా మూడు రకాలుగా విభజించారు, పెద్ద Industries అని మధ్యతరగతి industries అని గ్రామ పరిశ్రమలని ప్రస్తుత పరిస్థితులలో గ్రామపరిశ్రమలను ప్రధానముగా వృద్ధిచేసినగాని మనము పురోగమింపలేము. ఇకప్రక్కన nationalisation వస్తువున్నది. అందువల్ల పనులుదొరకవని భయముగా ఉన్నది. పెద్ద industries ను ఆర్థికలోపమువల్ల స్థాపించలేదు. అందువల్ల మధ్యతరగతి పరిశ్రమలవన్నీ తాలూకాకు ఒకటి పెట్టిన బాగుంటుందని మనవి చేయుచున్నాను. ఈ మధ్యతరగతి section లోకి పెట్టుబడి పెట్టుటకు ఉన్నవారెవరు ముందుకు రాలేదు అంటున్నారు. అది నిజమే. అయితే దానికి కారణము managing agents ఎవరైనావచ్చి చేయుదామనుకుంటే ఈ

managing agents ఏమి మ్రింగుతారో అనే భయము ఉన్నది. అందువల్ల Companies Act మార్చుట అవసరం. కేంద్రం చేస్తుందిఅంటున్నారు. దానిని మార్చినగాని అందరికి వీటిలో నమ్మకము కుదిరి వాటాదారులుగా చేరుటకువచ్చే అవకాశముండదు.

దీనితరువాత ముఖ్యమైనది గ్రామపరిశ్రమలు ఈ గ్రామపరిశ్రమలను మన దేశములో చైనాలోవలె co-operative basis మీద పెట్టిన బాగుండునని మనవి. చైనాలో ఉదాహరణకు కాగితము పరిశ్రమ కుటీరపరిశ్రమగా నున్నది. ఇందులో తయారైన కాగితమును గవర్నమెంటు కొనుటకు సిద్ధముగానుండును. అదేవిధముగా మన ఆంధ్రప్రజలు ప్రభుత్వముకూడా బాధ్యతను వహింపవలసినదిగా కోరుచున్నాను. అదీకాకుండా ఆంధ్రలో తయారైన వస్తువులు తప్పితే ఇంకోరకము వస్తువులను మేము కొనము అనే దీక్ష ఆంధ్రులు అందరు పట్టవలసియున్నది.

అదిగాక ఇప్పుడు మనకున్న Polytechnic Institutions చాలా high style లో ఉన్నవి. అందువల్ల అందరికి ఆ విద్య లభ్యమగుటలేదు. కనుక III Form వరకు చదివినవారికి లేక school final వరకు చదివినవారి కాకుండా అంతకు క్రింద వారికికూడా అనుకూలమగునట్లు Polytechnic course పెట్టవలెనని కోరుచున్నాను. మా సత్తెనపల్లిలో ఒక industrial school ప్రారంభించెదమని ఆంధ్ర ప్రభుత్వంవద్దకుకూడ పోయినారు. జనాభా ప్రభుత్వం ఉత్తరవుకు కాచియున్నారు. ప్రభుత్వం ప్రస్తుతం అనుమతించింది కాని ప్రారంభించనేలేదు. దానిని ప్రారంభించవలెను. పరిశ్రమలును స్థాపించి వాటిని control చేయుట ప్రభుత్వము తీసుకొన్నవో బాగుండును. ఉదాహరణకు చైనాలో ఇదేవిధంగా పరిశ్రమలు అభివృద్ధి చేశారు. నెహ్రూగారు అక్కడి స్థితిగతులను పాళ్ళవిధానములను "China, People's Democracy" అనే పుస్తకములోని ప్రవేశికలో ప్రశంసిస్తూ వివరంగా వ్రాశారు. ముఖ్యముగా మనదేశములో industries కు supervision లేదు. ఉదాహరణకు Andhra Paper Mills, Rajahmundry, Directors కు supervision charges క్రింద రు. 5104/—6 నెలలకు-అని మీ పుస్తకములోనే వ్రాశారు. అంత supervision charges ఆయన ఒక్కడికి ఇవ్వడము ఏ విధముగా న్యాయంగా ఉన్నది? ఆ ఒక్క industry కి అంత సొమ్ము supervision క్రింద వ్యయంచేస్తూఉంటే ఇంకా ప్రాథమిక industries ఎట్లా అభివృద్ధిలోకి వస్తాయి? గూడూరులో glass industries ఉన్నవి. అట్టి పరిశ్రమలు నష్టాలు పడవుతున్నారు. వారికి చాలా తక్కువఖర్చు supervision కు గాను అవుచున్నది. కనుక ఈ తేడాల విషయంలో వెంకట్రావుగారు తగు శ్రద్ధ పుచ్చుకో

వలసినదని కోరుచున్నాను. ఇక రాజమండ్రి పేపరుమిల్లులో కాగితము ఎవరు కొనడములేదు అని చెప్పుచున్నారు. అయితే ఆ పేపరు గవర్నమెంటుకు ఒక్కదానికే సప్లయిచేయుచున్నారు. మొన్న నేను మార్కెట్టులో అంతా రాజమండ్రి పేపరుకొరకు వెతికితిని. మొదటరోజులలో అదే పేపరు వాడుకుంటూవుండేవాణ్ణి. దొరికితే ఆ కాగితమునే వాడుదామనుకొన్నాను. కాని అది ఎక్కడా దొరకలేదు. దానిని ఒక్క గవర్నమెంటు కొనడములో మరి ఏమి ధరచేసికొనుచున్నారో, మరి నష్టము ఏ విధముగా వస్తున్నదో తెలియడములేదు. గూడూరు factory లో వస్తువులు వున్నవి. ఆవస్తువుల ధరలు కొంచెము ఎక్కువగా నున్నవి అని అంటున్నాం. అదేరకము వస్తువులు ఇతరులు తయారుచేసే అంతకంటే చౌకగా యిస్తున్నారు. అందువల్ల వాటిధరలు తగ్గించవలెనని కోరుచున్నాను. ద్వితీయపంచవర్ష ప్రణాళికలోనైనా ప్రతి తాలూకాలోకూడా industries ను ప్రభుత్వము స్థాపించవలసినదిగా కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను."

Sri N. VENKAIAH:—"అధ్యక్షా, శ్రీ ప్రగడకోటయ్యగారు సూచించినట్లు దోవతులు, చీరెలు నేతపరిశ్రమకు ప్రత్యేకించినప్పుడే ఈ పరిశ్రమ బలిష్ఠంగా సజీవంగా వుంటుందని లేకపోయినట్లైతే, ప్రమాదకరమైన స్థితిలో పడుతుందని సూచిస్తున్నాను. కేంద్రప్రభుత్వానికి ఈ ప్రభుత్వం ప్రత్యేకించి ఈ విషయంలో గట్టిగా recommend చేయాలి. ఇప్పుడు ప్రత్యేకించ బడుతోంది కాని ఎందువల్లనో సరిగ్గా ఆచరణలోనికి రాక ఈ విధానం జయప్రదం కావడం లేదు. అంబరు చరకా విషయంలో ప్రభుత్వం శ్రద్ధచూపుతున్నందుకు సంతోషం. మనప్రాంతానికి కావలసిననూలు సరఫరా కావాలంటే, రోజుకు 0—12—0 ఆదాయం రాగలిగిన పరిస్థితి వున్నప్పుడే ఈ పరిశ్రమ జయప్రదం అవుతుంది. నూలు ఎక్కడ తయారైతే అక్కడ నేతపరిశ్రమ వృద్ధికావడానికి అవకాశం వుంటుంది. అంబరు చరకా వల్ల అనుకున్న ప్రయోజనం కలిగేట్లా కొంత ధనాన్ని వెచ్చించి అయినా, తయారు చేయగలిగితే ఉపయోగకరం వుంటుందని మనవి చేస్తున్నాను.

పొగాకుపంట ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకు చాలా ప్రధానమైనపంట. Central ప్రభుత్వం ఆదాయంనుంచి ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వానికి భాగం వస్తుంది కాబట్టి ఆంధ్రప్రభుత్వానికి కూడా ఆదాయం తీసుకురాగలిగింది పొగాకు పంట. ఇందులో 60% రైతుల ఇండ్లలో పడివుంటోందని మనవి చేస్తున్నాను. ఈమధ్య చైనాతో జరిగిన వ్యాపార ఒడంబడికమూలంగా కొంత ఎగుమతి కావడానికి అవకాశం కలిగింది. దీనికి సగటున 500 lbs. రు. 180 లు ధర ఇస్తు

Sri N. Venkiah] [27th July 1955

న్నారు. కాని రైతుకు ఇచ్చేది రు 30, 40 లు మాత్రమే. కాబట్టి ఒక corporation ఏర్పాటుచేసికొని పొగాకు యావత్తు తీసుకొని grade చేయించి విదేశాలకు ఎగుమతి చేస్తే చాలా లాభప్రదంగా వుంటుంది. రైతులచేత నేను హామీ ఇప్పించగలను. ఖరీదు ఇవ్వకుండా, పొగాకు తీసికొని, grade చేయించి harbour లోకి తీసుకువెళ్లి ఇతరదేశాలనుంచి డబ్బుతీసుకొనిన తరువాతనే రైతులకు చెల్లించవచ్చును. దానికి రైతులు సంసిద్ధులుగా వున్నారు. నేను చాలా మందితో సంప్రదించాను. ఎక్కువ పెట్టుబడి లేకుండానే corporation ప్రారంభించవచ్చును. గోనుగోలు చేయవచ్చును, grading చేయవచ్చును. దీనికి 4, 5 లక్షలురూపాయిలు అయితే సరిపోతుంది. లక్షలు లక్షలు ఆదాయాన్ని ఆర్జించడానికి అమూల్యమైన అవకాశం ఇది. రైతులకు మీరు ఇవ్వదలచుకొన్నంతవరకు సంతృప్తికరంగా ఇవ్వడానికి అవకాశంవుంటుంది.

పొగాకులో ఎంతోభాగం వృధాగా పోతోంది. దీనితో నికోటిన్ తయారు చేయించవచ్చును. దీనికి ఒక factory పెడితే లాభప్రదమైన పరిశ్రమ అవుతుంది. పొగాకులో ఎక్కువ సరుకుకు colour మారి నిరుపయోగం అవుతోంది. అందువల్ల వ్యాపారస్థులు ఏధర ఇస్తే అంతవరకే తీసుకోవడం తప్పనిసరి అవుతోంది. అందువల్ల redrying plants ఏర్పాటుచేస్తే అన్ని ప్రాంతాల్లో తప్పనిసరిగా పొగాకు నిలువచేసికొని అధిక ఆదాయాన్ని ఆర్జించే అవకాశాలు వుంటాయి. చాలాప్రాంతాల్లో machines వున్నాయి. ఒంగోలువంటి ప్రాంతాల్లో లేవు. ఇటువంటి ప్రాంతాల్లో co-operative ధోరణిలో తగినంతపెట్టుబడి ఇచ్చి ప్రోత్సహించడానికి తగిన అవకాశాలు ఇస్తారని కోరుతున్నాను. ఆంధ్రదేశంలో చాలా ప్రధానమైన గృహపరిశ్రమ చర్మపరిశ్రమ. దానివిషయంలో ప్రభుత్వం తగినంత శ్రద్ధ తీసికోవడం లేదు. దీనికి కావలసిన తంగేడుచెక్క వగైరాసప్లయిచేయడానికి తగిన శ్రద్ధ ప్రభుత్వం తీసికొంటుందని, ఇతర కుటీరపరిశ్రమల విషయంలో కూడా శ్రద్ధ తీసికొని, సంవత్సరానికి 8 మాసాలు వృధాగా కాలక్షేపంచేసే గ్రామస్థుల ఆదాయాన్ని పెంచడానికి ప్రభుత్వం తీవ్రంగా కృషిచేస్తుందని ఆశిస్తూ విరమిస్తున్నాను.

SRI P. PARTHASARATHI :— ఉపాధ్యక్షా, నేను ఈ పారిశ్రామిక డిమాండును బలపరచేదానికి లేచాను. దేశం ఒక అభ్యుదయ దశకు రావాలన్నా, ఆర్థికంగా పటిష్ఠం కావాలన్నా వ్యవసాయానికి పరిశ్రమకూ వుండే వ్యత్యాసం చాలా వరకు తగ్గించాలి. వ్యవసాయంలో 89% పరిశ్రమలలో 11% ఈదినం వున్నారంటే, ఈవ్యత్యాసాలు ఎంతగొప్పగావున్నవో తెలియగలదు. దీనిని తగ్గించాలంటే ఎక్కువ

భారీ పరిశ్రమలను దేశంలో స్థాపించవలసిన ఆవశ్యకతను ప్రభుత్వం గుర్తించాలన్న సంగతి తమకు మనవిచేస్తున్నాను. ఆంధ్రదేశంలో రాయలసీమ చాలా వెనుకబడిన ప్రాంతం. రాయలసీమజిల్లాలలో ఎక్కువగా ముడిపదార్థాలు వున్నాయని అవి ఎక్కువగా పరిశ్రమలు ఏర్పాటు చేసేదానికి ఉపయోగపడతాయని ప్రభుత్వానికి తెలుసును. ప్రభుత్వంవారు cottou mills, sugar mills వీటిపై మనస్సు కేంద్రీకరిస్తున్నారు కాని జిల్లాలలో దొరికే ముడిపదార్థాలను పరిశ్రమలగా ఏర్పాటు చేసేదానికి ప్రయత్నం లేనందుకు విచారిస్తున్నాను. కడపజిల్లాలో దొరికే iron ore, బెరైటిస్, మాంగనీసు, వీటి అన్నింటికి ఒక పరిశ్రమను ఏర్పాటుచేస్తే, cotton mills, sugar mills ఏర్పాటు చేసేదానికి వీలువుంటుంది. కడపజిల్లాలో పండ్ల పరిశ్రమ చాలా గొప్పది. Canning పరిశ్రమను ఎందుకు ఏర్పాటుచేయలేదో నాకు తెలియదు. కోడూరులో రెండుమూడులక్షల పెట్టుబడితో నడిచే Fruit Growers Society ఒకటి వున్నది. ఇదివరలో ఒక canning factory స్థాపించడానికి ప్రయత్నాలు జరిగాయి. ప్రభుత్వ ఆదరణ, అభిమానం లేకనే ఆ పరిశ్రమ ఇంత వరకు ఏర్పాటుచేయడానికి వీలులేకపోయింది. ఇప్పుడైనా దానిని గురించి ఆలోచిస్తే చాలాకృతజ్ఞులుగా వుంటామని చెబుతున్నాను. Mining విషయాలలో licence ఇవ్వడానికి చాలా కాలంపడుతోంది. రెండు, మూడు సంవత్సరాలు పడుతోంది. అందువల్ల prospective miner కు కూడా ఈ ముడిపదార్థాలను బైటకు తీసుకురావడానికి వీలులేకుండా పోతుంది. అందుచేత ఈ licences ఇచ్చే విషయంలో ఎట్టి విలంబన లేకుండా వెంటనే లాంఛనగా రు 500లు బదులు రు 50, 100లు licence feeగా తీసుకుని దేశఅభివృద్ధికోసం జరూరుగా licences ఇప్పించడానికి ప్రయత్నంచేస్తారని కోరుతున్నాను. ఈవిషయంలో పాలసీ liberalise చేస్తే బాగుంటుందని విజ్ఞప్తి చేస్తున్నాను. Sericulture విషయమైకూడా పరిశ్రమలమంత్రిగారు మనవిచేశారు. దానివిషయమై స్వంత అనుభవంలేదని మనవి చేస్తున్నాను. రాయలసీమ జిల్లాలలో చాలా ఆముదపుచెట్లు వున్నాయి. వ్యవసాయ కేంద్రాలలో ఒక demonstration farm ఏర్పాటుచేస్తే ఇందులోని లాభనష్టాలను ప్రత్యక్షంగా సమీక్షచేసేదానికి వ్యవసాయదారునికి అవకాశం వుంటుందని మనవి చేస్తున్నాను.

3-30 p. m.

* SRI P. BAPAYYA :—మన దేశములో రోజు రోజుకు పెరిగిపోతుండే నిరుద్యోగ సమస్యను పరిష్కరించుటానికి, చాలి చాలనటువంటి ఆదాయముతో వ్యవసాయముమీదనే పనిచేస్తూ జీవితాలు జరుపుకొంటున్న గ్రామీణ ప్రజానీకానికి సహాయముచేయడానికి మన రాష్ట్రప్రభుత్వము కేంద్ర ప్రభుత్వముకూడా యీ గృహపరిశ్రమలకు ఎక్కువ ప్రోత్సాహము యివ్వాలని ప్రయత్నము చేయడము చాల సంతోషమైన విషయము ముఖ్యంగా మనకు మన వెంకట్రావుగారు ప్లానింగ్ మంత్రిగావున్నారు. ఈ మధ్య N. E. S. క్రింద వున్న కొన్ని గ్రామాలకు వారు వెళ్లినపుడు నేనుకూడ వారితో వెళ్లడము తటస్థించినది. వారు ఎక్కడకు వెళ్లినాకూడా ఏ గ్రామములో ఏ గృహ పరిశ్రమకు అవకాశమువుందని గ్రామస్థులను అడుగుతూ, అక్కడవున్న ఉద్యోగస్థులను ఏ గ్రామములో ఏ పరిశ్రమపెట్టితే బాగుంటుందో మీరు ఆలోచించి నాకు చెప్పవలసిందని చెప్పుతూవచ్చినారు. ఇవి చాలశుభదినాలని దీనివలన నాకు చాల నమ్మకముకల్గింది. మా తిరువూరు తాలూకాలో కంబళ్ల పరిశ్రమ ఇదివరకు జరుగుతుండేది. దానికి ప్రభుత్వము సహాయము చేసినట్లైతే బాగుంటుంది. చనుబండ, చిన్నంపేట అను గ్రామాలలో పూర్వము ప్రసిద్ధిగా కంబళ్లు నేసేవారు. అక్కడ యిప్పుడు co-operative system ప్రకారం సహాయము చేసేటట్లైతే యీ కంబళ్ల పరిశ్రమ అభివృద్ధికి ఎక్కువ అవకాశము వుంటుంది. ముఖ్యంగా నా నియోజకవర్గమైన తిరువూరు తాలూకాలో మైకా ఎక్కువగావుందని చాలామంది చెప్పుతున్నారు. ఇదివరకు చాలమంది యీ మైకా విషయంలో private పెట్టుబడితో పనిచేసి ఏ కారణముచేతనో ఆ పరిశ్రమ యిప్పుడు ఆపుజేయడం జరిగింది. కాబట్టి భూగర్భశాస్త్ర పరిశోధకుల చేత ఎక్కువగా ఆ తాలూకా అంతకూడా పరిశోధనచేయించి మైకాకు ఎక్కువ ప్రోత్సాహము య్వివాలని నేను ప్రార్థిస్తున్నాను. ఒకపెద్ద fertiliser factory ని దక్షిణ దేశములో పెట్టడానికి కేంద్రప్రభుత్వమువారు నిర్ణయించినారనిన్నీ దానికి హైదరాబాదు ప్రభుత్వము మన ప్రభుత్వము పోటాపోటీగావున్నట్టు తెలుస్తుంది. హైదరాబాదు ప్రభుత్వమువారు కొత్తగూడెములో పెట్టాలని మనవారు కృష్ణాజిల్లాలో పెట్టాలని కేంద్రాన్ని కోరుతున్నారు. ఇదివరకుఅటువంటి పెద్దపరిశ్రమ లేదు కాబట్టి ఆ పరిశ్రమను తప్పకుండా మన ఆంధ్రదేశానికి వచ్చేటట్టు ప్రయత్నము చేయాలని నేను మంత్రిగారిని కోరుతున్నాను. మరొకవిషయం మధ్యతరకమైన పరిశ్రమలు, ఈ మధ్య

Sri A. Sathyanarayanamurthi] 27th July 1955

న్నాయి ? ఎక్కడికిపోతున్నాయి ? తిరిగి ఇవన్ని మనదేశానికి ఏదోఒకరూపములో వస్తున్నాయి. వాటికితగినటువంటి research మనదేశములో లేకపోవడముబట్టి మన ఆంధ్రదేశములోవుంటే అనేక commodities foreign countries కు వెళ్లిపోతున్నాయి. ఈ లెక్కలు కావాలంటే Customs లో దొరుకుతాయి. మీరు శ్రద్ధ వహిస్తే Customs లో తప్పకుండా మీకు తెలుస్తుంది. అందుచేత ఇవి అన్నికూడ మన దేశములో వుండేటట్లు మీరు ముఖ్యముగా చూడాలి. cottage Industries and Heavy Industries అక్కరలేదు. ప్రస్తుతము Cottage Industries చూడాలి. దానినిగురించి ఎంతవరకు Government శ్రద్ధవహించినది ? ప్రపంచములో cottage industries ఏ దేశములోవున్నాయి. మన ఆంధ్రదేశములో యీవేళ పెట్టాలంటే ఏ దేశాన్ని అనుసరించి మనము ప్రాధాన్యము యివ్వాలి ? జపాను cottage industries లో చాల ప్రాధాన్యము వహించినది. ఇక స్వీడన్ డెన్మార్కు వంటివికూడా వున్నాయి. అక్కడికి ఎవరినైన తగిన టెక్నిషియన్లను పంపించినారా ? మన students ను పంపడానికి 2 వేలరూపాయలు ఖర్చుపెట్టుతామని చెప్పినారు. రెండువేలరూపాయలు సరిపోతుందా ? మీరు ఎంతమంది students ను తయారుచేస్తారు. ఇంకా ఎన్నో Industries కావాలిమనకు, క్రొత్త industries ఆచరణలో పెట్టడానికి ఎంతమంది study చేయాలి. యీ నాడు మనము వందలకొద్ది వేలకొద్ది కాకపోయిన కొద్దిమందినైన పంపించి study చేయించి ఉపయోగించుకోవడము చాలా అవసరము. ఇప్పుడు వున్నంతవరకు Dalda విషయములో చెప్పుతున్నాను. వనస్పతి విషయములో బిర్లా కంపెనీవారు ఇక్కడ పెద్ద plant పెట్టారు. మేముకూడ మా తాడేపల్లిలో పెట్టాము East Coast Food Products సంస్థను. ఇక్కడ బిర్లా company వుంది. బిర్లా కంపెనీ వారి రహస్యము గ్రహించాలి. బిర్లావ్ బాగా డబ్బున్నవాండ్లు. కొన్నిలక్షల రూపాయలు ప్రజలదగ్గర వసూలుచేశారు. కొంతవరకు స్వంత capital పెట్టారు. యీవేళ 10 రూపాయల share రూ. 1-14-0 లకు వారే కొంటున్నారంటే అర్థమేమోగ్రహించండి. అప్పుడు వనస్పతి ఆ రోజులలో తప్పకుండా ప్రాముఖ్యమువచ్చి బాగా లాభము వస్తుందని ప్రజలుబాగా ఉపయోగపరుస్తారని మేము వనస్పతి factory start చేశాము. అందులో ఒకలక్షరూపాయలు invest చేసినాను కాబట్టి నేను యీ వేళ బాధపడుతున్నాను. కాబట్టి నాయొక్క ఉద్దేశము చెప్పుతున్నాను. బిర్లాకంపెనీతో మా company compete చేయలేక ప్రతిసంవత్సరము ఇప్పటికి మూడు సంవత్స

27th July 1955] [Sri A. Satyanarayanamurti

రాలుగా నష్టపడుతున్నది. దానికి కారణమేమిటి? నష్టమువస్తున్నప్పటికీ బిర్లా కంపెనీ నడుపుతుంది. కారణమేమిటి ? Monopoly చేస్తూ మనదేశములో వున్నటువంటి మిల్లులను యావత్తు బిర్లా company పట్టుకోవడముకోసము పనిచేస్తుందని నాదృష్టికి బాగా అందుతోంది. అందువల్ల ఎక్కడకూడా అటువంటి monopoly లేకుండ Government దానిమీదsupervision చేయాలి. ఒక Supervision కమిటీ వుండాలి. కమిటీలలో officials కాకుండాగా industrialists కాకుండగా దేశముయందు భక్తివున్నవాండ్లు Industry అంటే తెలిసినవాండ్లు కొంతమంది ఆ కమిటీలో వుండాలి. రిసర్చి చేసినట్లయితే ఏ లోపముచేత యీ Industry పడి పోతున్నది. ఎందుకు లాభము రావడములేదు, ఎందుకు నష్టమువస్తుంది, నష్టమువచ్చేపరిస్థితులలో కూడా 10 రూపాయల share రెండురూపాయలకు ఎందుకు కొంటున్నారు, ఇవన్నీ బాగా తెలుసుకోవచ్చును. అందువల్ల యీ విషయాలు పరిశీలన చేయడానికి ఒక కమిటీని Government appoint చేయాలి. అటువంటి కమిటీని appoint చేసే ఉద్దేశము వుంటే దానికి ఎక్కడ provision చూపించలేదు. దాంట్లో Officials కాకుండా పై వాండ్లు వుండాలి. తరువాత Industry propaganda కావాలి మనకు. అనేక దేశములో raw materials వున్నాయి. కనుకవాటినన్నిటిని మనము ఉపయోగపరచుకోవాలి. ఉపయోగపరచుకుంటే ఇవి ఏ విధముగా సహాయపడు తుందనే propaganda చేయాలి. తర్వాత communicationsను గురించి ఇంకొక విషయము చెప్పుతున్నాను. ఏమంటే మా వూరిలో చిన్న Fruits Co-operative Society వుంది. మాతోటలలో పండేపంటలు కలకత్తా మార్కెట్టుకు వెళ్లుతూ వుంటే డబ్బు లాభము వస్తూవుంటుంది. Communication facilities create చేయాలి. Industries వున్నచోట Industries కు గాని Co-operative Society కు గాని కమ్యూనికేషన్ లేకపోయినట్లయితే అందుకు Government protection ఇవ్వాలి. అందుకనే ఎక్కడ Industries start చేయాలని కోరి నప్పటికినీ నా ఉద్దేశమేమంటే, Government కు shares వుండాలి. Government కు shares వున్నప్పుడు Government శ్రద్ధ తీసుకుంటుంది. ఆ Industries చెడిపోకుండా చూడడానికి ఎక్కువ అవకాశముంటుంది. ఈనాడు Sugar Factories Start చేస్తున్నారు, co-operative basis మీద. నవంబరులో వీటిని పెట్టినపుడు అక్కడ Government తీసుకుంటారనిమాకు తెలిపినది. అప్పుడు at least 15,20 లక్షలు Government shares తీసుకోవాలని కూడ మా తీర్మానములోవుంది. ఈనాడు Government వారుఎప్పుడైతే కొన్ని factories

Sri A. Satyanarayanamurti] [27th July 1955]

పెట్టడానికి licence యిస్తామన్నారో అప్పుడు 20 లక్షల రూపాయలు shares తీసుకుంటామని చెప్పినారు. సంతోషము. ఆవిధముగా తీసుకుంటే Industry బాగా thrive పోతుంది. ఎప్పుడైతే Government shares తీసుకున్నారో దానికి safety, protection కలుగుతాయి. ఇందులో ఇంకొక తమాషాకూడ మన Government మేధావిగా పనిచేసినది. ఎప్పుడైతే వాండ్లు shares కొన్నారో democratic సిద్ధాంతము ప్రకారం వారు permanent గా పెట్టుకోకుండ మళ్లీ మనకు యిచ్చే bonus వల్ల ఆ shares మనము కొనడానికికూడా చాల సౌకర్యము చేశారు. ఈవిధంగా ప్రతి Industry కూడా start చేయాలి. మన ఆంధ్రదేశములో యీవేళ Industries start కావాలంటే కావు. Industries develop చేసేవాండ్లకు నమ్మకములేదు. ఈలాగు వుండగా రోజు రోజు కూలీలకున్న మరి Industrialists కున్న వచ్చేటటువంటి తగవులు పరిష్కారము కావడము చాల కష్టముగా వుంటుంది.

4 p. m.

SRI N. SRINIVASA RAO:—ఉపాధ్యక్షా! పరిశ్రమలను గురించి చాలామంది మాట్లాడిన తరువాత నేను ఎక్కువ మాట్లాడడానికి సమయంలేదు కాబట్టి, నాలుగైదు విషయాలుమాత్రం తమదృష్టికి తీసుకు వస్తున్నాను. మన పరిశ్రమల మంత్రిగారు సముద్రప్రాంతానికి చాలాదగ్గరగా వున్నారు. ఆంధ్ర దేశంలో చాలాభాగం sea shore ఉండడం సంభవిస్తోంది. అక్కడ విపరీతంగా పడుతూయున్న fish tins లో పెట్టి పైకి ఎగుమతి చేయుటకు, రకరకాల oils తీయుటకు అవకాశం ఉంది. అందుచేత అక్కడ చేపలుపట్టేవారికి ఆధునిక పరికరాలు ఇచ్చినట్లయితే ఇంకా ఎక్కువచేపలుపట్టుటకు సావకాశం ఉంటుంది. దానివల్ల మనం ఇతరదేశాలనుండి కొనుక్కునే Cod liver oil ఇంక యితర oils సప్లయి చేయగలుగుతాము అని ఒకమనవి. రెండవది piggory గురించి planning లో యున్నది. పిగ్గరీనిగురించి చెబితే కొంతమంది పిగ్గరీకి ఎంతడబ్బు వస్తుందని అనుకోవచ్చును కాని labourers లో కోడిని పెంచితే కొత్తఅప్పు పందిని పెంచితే పాతఅప్పు తీరుతుందని ఒకసామెత ఉన్నది. అంటే ఏమిటంటే పందులపరిశ్రమ కేవలం కొన్ని tribes, communities కాకుండా హెచ్చుగా హరిజనులలోనూ, backward communities లోనూకూడా చేస్తూవుంటారు. దాని ఆదాయం విషయం చాలామందికి తెలియదు పెద్దలకు. అందుచేత ఏమిటంటే ఈవేళ America నుంచీ, England నుంచీకూడా ఈ పిగ్గరీస్‌ని tins లో పెట్టి తీసుకువచ్చి, ఇక్కడ అమ్మకంచేయడం జరుగుతోంది. ఈవేళ కొల్లేరుప్రాంతంలోనూ, సముద్రప్రాంతం

లోనూ, ఆరణ్యప్రాంతంలోనూ బ్రహ్మాండంగా, కోట్లాది రూపాయలు విలువగలిగిన పెద్దికి పెంచడానికి సావకాశంఉంది. Nuts roots అన్నీ ఉన్నవి. తరువాత జొన్నలూ—ఇప్పుడు civilization హెచ్చిన తరువాత సన్నబియ్యం చాయపప్పు తింటూఉన్నాము—జొన్నలూ, పెసలూ వాటిసంగతి వదిలేశాం. ఈ జొన్నపొట్టు, పెసలూ అంతా వాటికి ఆహారంగా పనికి వస్తాయని మనవిచేస్తున్నాను. మూడవది Pandit Nehru గారు Russia వెళ్ళేటప్పుడు మామిడిపళ్ళు పట్టుకువెళ్ళారు. ఆంధ్రదేశంలో మంచి మామిడిపళ్లున్నవి. అలాంటి మామిడిపళ్ళన్నీ tins లో పెట్టి ఇతరదేశాలకు ఎగుమతిచేయడానికి ఏర్పాటుచేస్తే మెట్టప్రాంతాలు వెనుకబడినాయనే టటువంటిబాధ పోతుంది. కాబట్టి అవి ముందుకురావాలంటే ఈ Fruit centresకు వీరు ఏర్పాటుచేసి ఇంకా scientificగా మంచిమంచి చెట్లనుపెంచే ఏర్పాట్లు చేయించాలని planning మంత్రిగారికి, Industries మంత్రిగారికి నామనవి. నా నియోజకవర్గంలో, కోమారుపాడులో, ఈపెద్దమంత్రు లందరూకూడా బహుమతులుగా చాలామంది పుచ్చుకుని యుంటారు. మామూలు తాడిచేనలో బ్రహ్మాండమైన art ఉన్నది. కజ్జలు తయారుచేస్తున్నారు. దానికి వెయ్యిరూపాయలు కూడ ప్రభుత్వం ఇవ్వలేదు. మాకుకూరికే సరదాగా యివ్వడంయ్యా అని అడుగలేదు. అప్పు యివ్వమన్నాము. All India Congress వారుకూడా exhibition లో పెట్టిన కజ్జలు ఇవి. గతంలో ఉంటేటటువంటి ఆంధ్రులయొక్క art ను ప్రోత్సహించని అరవవారు ఇవ్వకపోతే పోయారుగాని, ఈ తెలుగుమంత్రిగారైనా అటువంటి art నశించకుండా వాటికి loans, subsidies ఇచ్చి అటువంటి పరిశ్రమలను, పురాతనమైన శిల్పమును నిలపవలసినదిగా మంత్రిగారికి నా మనవి. తరువాత 5 వేలులేక 10 వేల రూపాయిలతో రిఫ్రిజరేటర్సుపెట్టి salt అంటే ఉప్పును table saltగా తయారుచేయుటకు సావకాశంఉన్నది. మన ప్రాంతంలో salt ఎక్కువ దొరుకుతుంది. కాబట్టి దాన్నిగురించికూడా ఆలోచించవలసినదని నా ప్రార్థన. నా నియోజకవర్గంలోని ద్వారకా తిరుమలలో సుద్ద బాగా దొరుకుతుంది. ఆ సుద్దతో రకరకాల విగ్రహాలను సుద్దలో పీయకలిపి నటరాజ మొదలగు విగ్రహాలూ తయారుచేస్తారు. మంచి marble stone లాగ ఉంటుంది. దానికి తగిన Artists ఉన్నారు, నెల్లూరుజిల్లాలోకూడా. నా మిత్రులు ఒకరిద్దరు జైలులోయున్నప్పుడుకూడా ఈ సుద్ద తెప్పించి చక్కని విగ్రహాలు తయారుచేశారు. అటువంటి కళను పోషించవలసినదని మంత్రిగారికి నా మనవి. తరువాతది "ఆవకాయ," ఇంగ్లండు దేశంనుంచీ అమెరికాదేశంనుంచి అనేక ఉత్తరాలు వస్తూయుంటాయి, మాకు తెలుసును. ఇక్కడ butlers గా పని

[Sri N. Srinivasa Rao] [27th July 1955

చేస్తున్నవాళ్లు Tins లో పంపిస్తున్నారు. ఎక్కువ మామిడికాయలు పండించే మెరక ప్రాంతాలకు లచ్చన్నగారు తొందరగా Electricity పంపిస్తే మంచినీళ్ళ నూతులు త్రవ్వి, కాయలు పండించి ఈ పరిశ్రమ అభివృద్ధిచేయవచ్చును. ఏదైనా నేర్చుకున్నారుగాని ఇంగ్లండువాళ్లకూ, అమెరికావాళ్ళకు ఈ ఆవకాయపదును మాత్రం దొరకలేదు. కాబట్టి ఆవకాయ tins లో పెట్టి ఎక్కువగా ఎగుమతి చేయడం ఒక పరిశ్రమక్రింద గుర్తించమని నా ప్రార్థన. ఆఖరుగంట కొట్టారు.

బ్రాహ్మణో క్షత్రియో వైశ్యశ్చ
త్రయోవర్ణ ద్విజాతయః
చతుర్థోయేక జాతిస్తు
శూద్రో నాస్తిపంచమః॥

అని మన భారతదేశంలో వ్యక్తులనుబట్టి మాత్రమే ఈ communities ఏర్పాటు చేయబడ్డాయి. ఈ వేళ చేనేతపరిశ్రమకు ఏలారక్షణ వస్తోందో అట్లానే చెప్పుల పరిశ్రమకు రక్షణకావాలి.

కళావెంకట్రావుగారు తాము తొడిగేటటువంటి చెప్పులు, గాంధిగారికి పంపిసటువంటి చెప్పులు అమలాపురంలో ప్రత్యేకంగా తయారుచేయించారు. అటువంటి చెప్పులు తయారుచేసే families రెండు, మూడు మాత్రమేయున్నది. Bata Company ఐనా, ఏ ఇతర company ఐనాకూడా చెప్పులు అంత చక్కగా తయారుచేయలేరు. అటువంటివారికి centres ఏర్పాటుచేసి అవృత్తిపోకుండా ఏర్పాట్లుచేయవలసినదని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. Industrial శకంలో మామూలుగా ఉండేటటువంటి village artisans దెబ్బతింటారనే విషయం తమకు తెలుసును. ఈ సందర్భంలోనే మీరు Cess fund వేసి చేనేతకార్మికులకు ఏ విధంగానైతే ఇస్తున్నారో, ఆవిధంగానే చెప్పులు Pottery వగైరా వృత్తులన్నీకూడా పెద్ద పరిశ్రమలతో పోటీపడలేక పడిపోయినప్పుడు, ప్రభుత్వం వాటికి కావలసిన subsidy ఇచ్చి వాటని రక్షించవలసిన బాధ్యత ఉంది. ఆఖరు ముక్కగా నా మనవి ఏమిటంటే ప్రతిగ్రామంలో pottery making, గానుగలు, వడ్లు దంచడం, ఇటువంటి వృత్తులు చేసేవారికి నష్టం వస్తోంది. కాని సమాజంయొక్క potentiality కోసందంపుడుబియ్యంవల్ల నష్టంవస్తే దానికి subsidy ఇవ్వడం అవసరం. గానుగనూనె మిగతా నూనెలకన్న శ్రేష్ఠమైనదని తమకుతెలుసును. అటువంటి గానుగనూనె తయారుచేసేవారికి ఎద్దు కొనుక్కోడానికిగాని లేక వారి గానుకకొరకుగాని subsidy ఇచ్చి ఆ విధంగా నశ్చీవమైనటువంటి ఆంధ్రలోకానికి జీవంపొయ్యడానికి

ఇవన్నీ చేయడం అవసరం. ఇవన్నీ చిన్న చిన్నవిగా కనిపిస్తాయి చూడ్డానికి. మంత్రిగారు వీటి విషయంలో శ్రద్ధతీసుకుంటారని ఆశిస్తున్నాను. పరిశ్రమలలో పనిచేసేటటువంటి వారు ఉద్యోగులకంటె ఎక్కువ సంపాదించుకుంటున్నారు. పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికునికి ఎక్కువ facilities ఉన్నవని, ఆయనకు insurance ఉన్నదని, గృహ వసతియున్నదని, ఆయన భార్యా పిల్లలకు Maternity centres ఉన్నవని అభిప్రాయం. ఈ graduates అంతా వీరు ఉద్యోగాలు వదలిపెట్టి కేవలం పరిశ్రమలలోకి రండి అంటే రారు. ఇతరదేశాలలో మాత్రే మామూలు jobs కంటె పరిశ్రమలలోనే ప్రత్యేకంగా ఎక్కువ వేతనాలు పొందడం మనం చూస్తున్నాం. ఆ మేరకు మీరు పరిశ్రమలు అభివృద్ధిచేసినట్లయితే అప్పుడు మీకు unemployment ఉండదు. B.A. చదువుకున్నవాళ్ళంతా Technicians గా తయారవుతారు. ఆ రకంగానే ఇప్పుడు overcrowd ఐన agricultural labour కూడా పరిశ్రమలలోకి వెడుతుంది. అప్పుడు వ్యవసాయకూలీలకు కావలసిన రేట్లు హెచ్చుతాయి. అప్పుడు మా గంజి నాగేశ్వరరావుగారు strike చేయించడం మానేస్తారు. ఈ విధంగా దేశం సర్వతోముఖాభివృద్ధి పొందుతుంది కాబట్టి పరిశ్రమలు అభివృద్ధిచేసి మా వావిలాల గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు ఆంధ్రులు కేవలం ఆంధ్రులవస్తువులే కొనాలి. చెప్పులుకూడా ఆంధ్రులవే కొనేటట్లుగానున్నా, అన్నివస్తువులు ఆంధ్రులవే కొనవలెనని గోపాలకృష్ణయ్యగారు చెప్పినది బలపరచవలసినదని సభ్యులందరిని కోరుతున్నాను.

Sri P. SATYANARAYANA :—ఉపాధ్యక్షా! భారతదేశంలోని 26 రాష్ట్రాలలో చాలా విపరీతమైన అసమానాలున్నవి. అందులో మనది పారిశ్రామికంగా బాగా వెనకబడిన రాష్ట్రాలలో ఒకటి. కేవలం కృత్రిమంగానే వెనుకపడ్డ రాష్ట్రాల జాబితాలో పడ్డామేగాని, నిజంగా ముక్కోటి ఆంధ్రులకూ తెలంగాణాతో కలిసిన విశాలాంధ్ర కనుక వచ్చినట్లయితే ఆ జాబితాలో ఉండవలసిన అవసరం మనకు ఎంతమాత్రం లేదు. మనరాష్ట్రం భారతదేశమంతటితోపాటు వ్యవసాయికరాష్ట్రం. ఈ వ్యావసాయికరాష్ట్రంలో నెల ఒక్కంటికి, ఒక్కొక్క మనిషి 22 రూపాయిల చొప్పున ఖర్చుపెడితే అందులో 13 రూపాయిలమాత్రమే cash ఇచ్చికొంటున్నాడని, Planning Commission వారు చెప్పారు. మిగతా 9 రూపాయిలూకూడా తన ఇంటిలో, లేకపోతే తన ఇంటికి ఆనుకున్న మడిలో తయారుచేసిన వస్తువులు మాత్రమే వాడుతున్నాడు. అందుచేత మన కున్నటువంటి మార్కెట్టు ఈ 13 రూపాయిల మార్కెట్టుమాత్రమే ఉంది. ఇదిమార్కెట్టుకు ఉన్నటువంటి పరిమితి.

Sri P. Satyanarayana] [27th July 1955

మరొకటి ఏమిటంటే ఆంధ్రరాష్ట్రంలో వ్యవసాయికరంగంలో డాక్టరు B. V. నారాయణస్వామిగారి అంచనాలప్రకారం సంవత్సరానికి అద్దె రూపకంగానూ, వచ్చే లాభం రూపకంగానూ అంటే శిస్తు రూపకంగానూ వడ్డీ రూపకంగాను 150 కోట్ల రూపాయిలు మధ్య తరగతి అనగా middlemen దగ్గరకు వెళ్ళిపోతోంది డబ్బు. ఉత్పత్తి చేసే టటువంటి రైతుకు దక్కకుండా ప్రభుత్వానికి దక్కకుండా middle men కీ, absentee landlords కీ ఆంధ్రరాష్ట్రంలో 150 కోట్ల రూపాయిలు పోతోంది.

4-00 p. m.

ఈ 150 కోట్లరూపాయలు producer దగ్గరలేకపోవడం అనేది మార్కెటును కుంచపరుస్తున్నది. ప్రభుత్వంయొక్క రాజకీయ పాలసీలను మార్చుకొని ఈ 150 కోట్ల రూపాయలలో సగమైనా ప్రభుత్వానికి వచ్చేటట్లు చేసుకొని, సగమైనా producer చేతిలో ఉంచినట్లయితే తప్పకుండా మార్కెటు విస్తృత మవుతుంది. Capital కూడ form అవుతుంది. 1930 సంవత్సరంలో భారతదేశము గురించి ఆలోచించినట్లుగా ఇప్పుడు ఆలోచించడంలేదు, మనము. ఒక కొత్తచారిత్రక దశయొక్క గర్భముఖద్వారములో మనము ఉంటూ మాట్లాడుతున్నాము. గనుక ఒకరకమైనటువంటి పారిశ్రామిక విప్లవం భారతదేశములో తీసుకురావడానికి చేసేటటువంటి కృషివల్లనే ప్రథమ పంచవర్ష ప్రణాళిక, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక, ఇవన్నీ వస్తున్నాయి. పారిశ్రామికంగా అభివృద్ధికావాలని అన్నప్పుడు మనము ఈ అడకత్తెరలోపడి బాధ పడుతున్నాము. Home market develop కావడానికి సావకాశం లేకపోతున్నది. Capital develop కావడానికి సావకాశం లేకపోతున్నది. ఈ రెండు develop చేయాలంటే, తమకున్న agrarian policies మార్చుకోలేనంతవరకు ముందుఅడుగు వేయడానికి ఎంతమాత్రం సావకాశం లేదు. ఇప్పుడు మనమంటూ ఈ 20 వ శతాబ్దంలో రెండవ అర్ధభాగములో పారిశ్రామిక విప్లవములో ప్రవేశించటానికి అనే ప్రయత్నం చేస్తున్నాము. తనప్రజలకు పారిశ్రామిక విప్లవం తీసుకురావడమనేది ప్రపంచానికేమి కొత్తకాదు, సుమారు మూడువందల సంవత్సరములనుంచీ, అనేక దేశాలవారు తమతమ దేశాలను పారిశ్రామిక విప్లవంద్వారా అభివృద్ధి చేసుకొన్నారు. వాటిని సమీక్షించినట్లయిన ఇదివరకు పారిశ్రామికంగా అభివృద్ధి చెందినటువంటి అన్నిదేశాలు మూడువిధానాలను అనుసరించే ముందుకుపోయాయి అని తెలుస్తుంది. మొట్టమొదటిది Imperialism - కొంత దేశాలను తమచేతిలో పెట్టుకొని కిరాతకంగా దోచుకొని ముందుకుపోవడము; రెండవది, ఇరుగుపొరుగు దేశాలలో ముడిపదార్థాలు దొరుకుతుంటే, వానివల్ల ప్రయోజనాన్నిపొంది తమ పరిశ్రమలను అభివృద్ధి

చేసుకోవడం; మూడవది, ప్రజలలో విప్లవం వచ్చి అభివృద్ధి నిరోధక శక్తులను అణచి, పారిశ్రామిక విప్లవాన్ని సాధించి, దేశాన్ని ముందుకు తీసుకుపోవడం. ప్రపంచ చరిత్ర ఈ మూడు పద్ధతులనుమాత్రం ఎరుగును. నాలుగవ పద్ధతి ఇంతవరకు ప్రపంచ చరిత్రలో లేదు. మనకు సంబంధించినంతవరకు Imperialism నేటి ప్రపంచ వ్యవస్థలో అసాధ్యమైనటువంటిది. రెండవది యితరుల యుద్ధాన్నిబట్టి మనము లాభము సంపాదించి పారిశ్రామికంగా అభివృద్ధికావడం అనే విషయంలోకూడ 1950 సంవత్సరానికి పూర్వము ఏమైనా అరకమైన కలుగడానికి అవకాశం ఉండినదేమో కాని ఇప్పుడు మాత్రము, ప్రపంచంలో శాంతిశక్తులు చాలా బలపడిపోయిన తరువాత, యుద్ధ శక్తులు చాలా బలహీన పడిపోయిన తరువాత, యిరుగుపొరుగు దేశాలలో యుద్ధాలు వస్తే దాన్ని పురస్కరించుకొని మనము ముందుకు పడిపోవడమనేదికూడ మననొసట వ్రాసిలేదు. ఇక, మూడవది ప్రజలలోనే విప్లవంవచ్చి తమ దేశంలో ఉత్పత్తిశక్తులను అభివృద్ధిచేసుకొని ముందుకుపోవడము అనేది ఉన్నది. ఇందులో మనదేశముయొక్క చరిత్రను బట్టి ఇప్పుడు మనము ఒక క్లిష్టమైనటువంటి పరిస్థితికి వచ్చాము. ఒకవైపు feudalism మనను నొక్కుతున్నది. కుంచపడినటువంటి home market కూడ మనయొక్క progress మీద ఒక పరిస్థితిని ఏర్పరుస్తున్నది. ఈలాంటప్పుడు ఏమిచేయాలని, ప్రభుత్వము ఈ సమస్యమీద చాలా తలక్రిందులవుతున్నట్లుగా గత ఆరుసంవత్సరములయొక్క చరిత్రనుబట్టి మనకు తెలుస్తున్నది. మొట్టమొదట Commonwealth అని అన్నారు. తరువాత Welfare State అని అన్నారు. తరువాతేమో socialistic pattern అని అన్నారు. ఈ socialistic pattern అనే టటువంటి విధానాన్ని ముందుకు తీసుకపోవడంకూడ ఈ capital development, home market development, ఈ రెంటిని పురస్కరించుకొనే చేసి ఉండవచ్చు. ఈ విషయంలో ఇప్పుడు కేంద్ర ప్రభుత్వము 1948 సంవత్సరం Industrial policy revolution అనేటటువంటిది లోక్‌సభలో pass చేశారు. దాన్ని నేటివరకు జీవము పోసి పెంచుతూనే ఉన్నారు. రెండవ పంచవర్ష ప్రణాళికలో భారతదేశము ప్రవేశించేటప్పుడుకూడ దీన్ని అనుసరించవలసిన అవసరం లేదేమోనని National Development Council లో చెప్పుతున్నారు. దానిలో కొంతవరకు Central Government యొక్క resources పెరగడానికి సావకాశాలున్నాయి. సందేహం లేదు. ఈ విషయం గురించి Central Government వారి అభిప్రాయం మనవిచేస్తాను. Socialistic pattern లో ప్రధానంగా state sector కు ఎక్కువ capital కావాలి. National Economy లో state sector కు వచ్చేభాగము పెద్దదిగా ఉండాలి,

Sri P. Satyanarayana] [27th July 1955

అందుచేతనే heavy industries అన్నీ కూడ state sector లో పెట్టుతాము అని చెప్పారు. సాధారణంగా heavy industries ను Central Government తీసుకొంటుంది. అవి రాష్ట్రప్రభుత్వానికి ఎంతమాత్రంరావు. Heavy industries తోటి ఇంకా ఏమైనా ఎవర్నల Factory అలాంటివి పెట్టిన బహుశ అవి Central Government స్వయంగానే పెడుతుందేమో! దానివల్ల మన రాష్ట్ర బడ్జెటులో గణనీయమైనటువంటి మార్పు ఏమి లేకపోవచ్చు. అందుచేత Industrial policy statement లో కేంద్రప్రభుత్వాన్ని బలపంచుకొనేటటువంటి అంశాలు ఉన్నప్పటికీ, రాష్ట్రప్రభుత్వాలు అభివృద్ధికి వచ్చేటటువంటి అంశాలు అందులో శూన్యమనే చెప్పాలి. కనుక మనం కేంద్ర ప్రభుత్వంమీద కొంతవొత్తిడి చేయవలసియుంటుంది. రెండవదిఈ రాష్ట్రాలలోకూడ, అసమానత్వ మున్నది, West Bengal, Bombay, U.P., కొంతవరకు Punjab, ఇవి ఆంధ్రరాష్ట్రంకంటె పారిశ్రామిక రంగంలో ముందుకుపోయాయి. అందుచేత సిమెంటు, పంచదార మొదలైనటువంటి వాటికి, మేముఅది మాత్రము ముట్టుకోము అని ప్రభుత్వము అన్నప్పటికి, ఆ private sector లోనే బలవంతులు ఉన్నారు. అందుచేత ఆ రాష్ట్రాలలో వాళ్లు ఆ sector ను అభివృద్ధి చేయగలరు. కాని ఆంధ్ర మొదలైనటువంటి వెనుకబడినటువంటి రాష్ట్రాలలో మాత్రము ఆ clause ను దేవతాస్త్రలాగ దాన్ని ఎవరు ముట్టుకోకూడదను అంటె పరిశ్రమలు ఎంతమాత్రము ముందుకు వెళ్ళలేవు.

ఇప్పుడు ఆంధ్రరాష్ట్రముయొక్క revenue ను చాలా ఎక్కువగా పెంచుకునేవరకూ పరిశ్రమలలో మనము ఎంతమాత్రము ముందుకుపోలేము. కళా వెంకట్రావుగారు గత రెండుమాసాలు ప్రతి జిల్లాలోను పర్యటించి వచ్చారు. అక్కడవున్న స్థానికపరిస్థితులు అన్నీ పరిశీలించడమే కాకుండా, రాష్ట్రము అంతటను పారిశ్రామిక అభివృద్ధి ఏ విధంగా ముందుకు తీసుకొని రాగలము అనేది ఆలోచించి అందుకుగాను ఒక picture మాదిరిగా ఒక plan ను మనస్సులో పెట్టుకొని పర్యటన సందర్భములో అన్ని విషయాలు మాట్లాడారు. ఆ సమావేశములో నేనుకూడా వున్నాను. పర్యటనవల్ల ఆయనకు చాలా అనుభవము చిక్కింది. ఆయన ఇక్కడ మాట్లాడిన ధోరణినిబట్టి చూస్తే, మొత్తము ఆంధ్రదేశములో పరిశ్రమలు ముందు రాలేకపోతున్నవి అనే దృఢ అభిప్రాయము వారికి కలిగినట్లు గోచరించింది. పరిశ్రమలకు డబ్బు సమకూర్చవలసి వుండెను. డబ్బు సమకూర్చేటందుకు ఉపాయాలను యోచించి, వారు వ్యవసాయముచేసేవారిమీద agricultural incometax పెడ్తామాఅని అనుకుంటే, గోపాలరెడ్డిగారు ఒప్పుకోవడములేదు. పోనీ, surcharge కూడా పెడ్దామాఅనుకుంట్నే,

దానికికూడా ఒప్పుకోవడములేదు. పోనీ, వున్న capital అయినా పుంజుకొనవస్తున్నదా అంటే, అదికూడ కనబడుటలేదు. అందుచేత మనము యీ Socialistic pattern లో కాస్త ముందుకు వెళ్లాలంటే, మన పరిశ్రమలలోవున్న consumer goods తయారీలో ప్రభుత్వము కొంతవరకు ప్రవేశించితీరాలి. 1945వ సంవత్సరములో ఏర్పడిన పాలసీలోకూడా consumer goods రంగాన్ని, ప్రైవేటు రంగానికి పూర్తిగానే విడిచిపెట్టమని యీ శాసనసభ యిందులో జోక్యము కలిగించుకోకూడదని వాగ్దానము ఎక్కడా లేదు. అది ఒక general policy గా చెప్పారు. మినహాయింపు చేసుకొనే అధికారము మాత్రము ప్రభుత్వానికి ఉండనేవున్నది. దాన్ని పురస్కరించుకొని యిక్కడ తప్పకుండా కొన్ని consumer goods ను తయారుచేసుకోటానికికూడా ప్రభుత్వము పరిశ్రమలను పెట్టుకోవలసి వుంటుంది.

ఉదాహరణకు మాచెర్లలో సిమెంటు ఫ్యాక్టరీ విషయముతీసుకుంటే, దాన్ని మన State Government పెట్టినట్లయితే తప్పకుండా యీపాటికి ప్రతి సంవత్సరమూ 50 లక్షలనుంచి 70 లక్షల రూపాయలవరకూ ఆదాయము వస్తూవుండేది. ప్రభుత్వము యీ ఫ్యాక్టరీని ఎందుచేతనో పెట్టలేదు. ఇప్పటికైనా మించిపోలేదు. మనదేశములో సిమెంటు తయారీకి అపారమైన resources వున్నవి. కాబట్టి Co-oparative పద్ధతిలోనైనా యీ ఫ్యాక్టరీని కట్టించి ఆ resources ను ఉపయోగించుకోవచ్చును. ఒక spinning mill, ఒక sugar factory co-operative పద్ధతిలో ప్రభుత్వము కట్టబోతున్నారుగదా. అలాంటప్పుడు సిమెంటు ఫ్యాక్టరీ మాత్రము co-operative bascis మీదనే ఎందుకు కట్టకూడదు? ప్ర ప్రథమములో అసలు కో-ఆపరేటివ్ ఉద్యమము చిన్నదిగానూ, humble గానూ ప్రారంభమై, రానురాను పెరిగినందున, యిక అన్ని sections ను భరించలేక handloom weavers కు వేరేవిడదీశారు. ఒక elected body ని దానికి ఏర్పాటుచేశారు. Land Mortgage Section విడదీసి దానికి మరల effect section ఒకటి వేరే ఏర్పాటు చేశారు. ఇక finance section ఒకటి మాత్రము ప్రభుత్వమువారు తన కౌగిటిలో పెట్టుకున్నారు. అదికూడా unwieldy గానే ఉన్నది. ఇప్పుడు గ్రామాలలో కూడా building societies ఏర్పాటుచేస్తున్నారు. Major Panchayats మొదలుకొని పెద్ద పెద్ద మునిసిపాలిటీలవరకు పెరిగిపోతున్నవి. వాటి అన్నిటికి రాష్ట్రవ్యాప్తముగా scheme పద్ధతిలో elected body ఒకటి అవసరము వున్నది. అలాంటి bodies ను త్వరలో రప్పించి వాటిద్వారా ఒక సిమెంటు ఫ్యాక్టరీని కట్టించవచ్చు. అందులో పెద్దకష్టము ఏమీలేదు. అందుచేత consumer goods తయారీ విషయములోకూడా ప్రభుత్వము త్వరపడితేనేగాని,
[illegible] capital [illegible]

Sri P. Satyanarayana] [27th July 1955

లేనేగాని పరిశ్రమలలో ప్రభుత్వము ముందుకు వెళ్ళలేదు. Factory రంగములో wholesale stage (strategic stage) కీలకస్థానముగా ఉన్నది. రైతాంగాన్ని దివాలా తీయించాలంటే అక్కడ monopoly ఎవరైతే వుంటుందో, అంటే ఎవరైతే మేనేజిమెంటు చేస్తారో, వారు చేయవచ్చు. అందుచేత వ్యాపార రంగంలో కూడా strategic points Government స్వాధీనములో పెట్టుకొని ముందుకు వెళ్ళినట్లయితే, అటువైపున రైతాంగము పడిపోకుండా యిటువైపున రాష్ట్ర ఆర్థికవ్యవస్థ పాడుకాకుండా కూడా కాపాడవచ్చును. రెండవది State కు capital కూడా వృద్ధి అవుతుంది. Industrial గా State ను వృద్ధికి తెచ్చుకోవచ్చును. చైనాదేశము మనకంటె చాలా వెనుకబడినదేశము. మనకంటె కొంచెము ముందుగానే స్వతంత్రము సంపాదించుకొన్నది. ముందుకుపోతున్న దేశాన్నిగురించి చెప్పాలంటే 1950 వ సంవత్సరములో ప్రజలయొక్క purchasing power తో పోల్చిచూస్తే 1954 వ సంవత్సరమునకు 76 percent పెరిగింది. కాని ఆరకమైన లెక్కలు యిప్పుడు మంత్రిగారు మనముందు పెట్టడములేదు.

Private trade మీద విధించిన పన్నులద్వారా ప్రభుత్వానికి వచ్చేడబ్బు 1950 వ సంవత్సరము బడ్జటులో 33% వుంటే, 1954 వ సంవత్సరములో 15% మాత్రమే వున్నది. దీన్నిబట్టి State Sector బాగా develop అవుతున్నదన్న మాట. State Sector నుంచి వచ్చేఆదాయము బడ్జటులోని అంకెల ప్రకారము 1950 వ సంవత్సరములో 85% వుంటే, 1954 వ సంవత్సరము వచ్చేటప్పటికి 65% వరకు develop అయింది. అందువల్లనే ప్రత్యేకంగా StateSector లో తయారయ్యే పరిశ్రమలు 1951 లో 100 అయితే 1952 లో 140 అయింది. 1953 లో 203 అయితే 1954 లో 276 వరకు పెరిగింది. అందుచేత State owned economy అనగా ప్రత్యేకంగా State స్వాధీనములో వున్న వాటితోనే మడికట్టుకుని కూర్చోకుండా పరిశ్రమలలోనూ, వ్యాపార రంగంలోనూ, finance వగైరాలు అన్నిటిలోను కొంతవరకు ప్రవేశిస్తేనేగాని లేకపోతే మనము ముందుకు వెళ్ళడము చాలా కష్టము. ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకు యిప్పుడు fertilizer ఫ్యాక్టరీకి సంబంధించినంతవరకు ఒక పెద్దపాయింటుగా అంటున్నాను. రెండు arguments మనకు అనుకూలంగావున్నవి. కాబట్టి మొత్తము భారతదేశములో అన్ని రాష్ట్రాలకంటె మనది చాలామటుకు వ్యవసాయరాష్ట్రము గనుక, మనకు ఎక్కువ ఖర్చవుతుంటుంది గనుక కేంద్రప్రభుత్వమును ఏ విధంగానైనా ఒత్తిడిచేసి, ఆ ఫ్యాక్టరీని ఇక్కడే మనరాష్ట్రములోనే స్థాపింపచేయటానికి ప్రయత్నించాలి.

27th July 1955] [Sri P. Satyanarayana

తరువాత capital formation విషయములో మనమిత్రులుకూడా చాలామంది చెప్పుతున్నారు. మన రాష్ట్రీయుయొక్క పొగాకు వ్యాపార రంగములో I.L.T.D. Factory వుండనే వున్నది. ఆ కంపెనీవారు మన రైతులను యిష్టమువచ్చినట్లు లక్క బొమ్మలను ఆడించినవిధంగా, ఆడించి క్రిందమీద పెట్టుతున్నారు. ఆ కంపెనీ వారు మనదేశములో అధిక లాభాలు గడించుచున్నారు. వారిమీద sales tax ప్రభుత్వము ఎందుకు వసూలుచేయడము లేదో తెలియదు. ఈ sales tax ను వారిమీద విధించినట్లయితే, మన ప్రభుత్వమునకు సర్వసాధారణముగా ఏయాభైలక్షలో సంవత్సరానికి రావటానికి వీలుఅయ్యేది. అటువంటిది సాధించటానికి మనప్రభుత్వము నిస్సహాయులైపోతున్నారు. Sales tax ఏసందర్భములలోనైనా విధించటానికివీలులేకపోతే, purchase tax అని మరొకరూపములో విధించవచ్చును. అటువంటి tax వేయటానికి అభ్యంతరము వుండదు. Purchase Tax వేసి వసూలుచేస్తే మనకు కనీసము 50 లక్షలు వస్తుంది. మనము ముడివస్తువులను ఎంతకాలము అయితే యితరదేశాలకు పంపుతూ వుంటామో అంతవరకూ మనలను యీ colonial economy మాత్రము వదలదు. ఇక గృహపరిశ్రమల విషయములో చూస్తే మన ఆంధ్రదేశానికి పంచవర్ష ప్రణాళిక యొక్క అయిదుసంవత్సరాలలో ఖర్చుచేయడానికి కేటాయించిన మొత్తము మనకు యీ రోజు యిచ్చిన budget literature ప్రకారము 46 లక్షల రూపాయలుమాత్రమే. పోతే పెద్ద పరిశ్రమలకుగాను కేటాయించిన మొత్తము 46 లక్షలరూపాయలు. అయిదవ సంవత్సరము పూర్తి అయ్యేనాటికి 24 లక్షలు ఖర్చు చేయగలమని అన్నారు. వీలుగా వుంటే 22 లక్షలే ఖర్చుచేస్తే, యింక మనకు 24 లక్షలు మిగిలిపోతాయి అనిచెప్పారు. Industries విషయములో తగినశ్రద్ధ తీసుకోవడము లేదని అన్నారు. పెద్దపెద్ద పరిశ్రమలలో తమంతట తామే acquisition system గనుక సంపాదించిన అనుభవమునుబట్టి, వుపయోగించుకుంటారు. కాని కుటీర పరిశ్రమల విషయములో ప్రభుత్వమువారుగాను డబ్బుతీసుకొనివచ్చి ఖర్చు చేయటానికి organisation వుండాలి, ఇందులో చాలా లోపాలు వున్నవి. గనుక ఇవన్నీముందుగా సవరించుకొని పరిష్కరించుకోలేక పోతున్నాము. రాష్ట్రీములకు డబ్బుయిచ్చి మనము చేతులు కడుగుకొంటున్నాము అని శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు అన్నారు. వీరుకూడా తగినంతగా అభివృద్ధికి తీసుకొనిపోవడం లేదు. ఆంధ్రదేశానికి యిచ్చిన కోటా యిక్కడ ఖర్చు చేయడము తప్పితే, ప్రత్యేకశ్రద్ధ ఏమీ తీసుకున్నట్లు కనబడదు. అందుచేత Industries విషయములో పనిచేయాలి అంటే కేవలం రేయి యింటిలోనివారు ఆ యింటిలోనే కూర్చుని, ఒక్కొక్క మగ్గము పెట్టుకొని పనిచేసేవానికి ప్రతి సంవత్సరముకూడా ప్రభుత్వము సహాయముచేయుడానికి కష్టముగా వుంటుంది.

Sri P. Satyanarayana] [27th July 1955

కుటీర పరిశ్రమలంటే, కమ్మరి కావచ్చు, కుమ్మరి కావచ్చు. అన్ని కార్ఖానాలనుచేర్చి ఒక unit గా పెట్టడానికి డబ్బుసహాయముచేసి అభివృద్ధి చేయవచ్చుగదా. కాబట్టి దేనివిషయములోనైనను ప్రభుత్వము ఒక సమగ్రమైన ప్లాను వేసుకుని కుటీర పరిశ్రమలను వృద్ధికితీసుకొని రావటానికి అన్నివిధాలా సహాయము చేయవలసి వుంటుంది.

4—00 p. m.

చిట్టచివరకు Labour భారతదేశములో Intensive Industry మీద ఆధారపడవలసిన పరిస్థితి ఏర్పడింది. ఎక్కువగా ఉద్యోగాలు కల్పించే వృత్తులకే ప్రాధాన్యము ఇచ్చితీరాలి. దేశంలో పెట్టుబడిదారి విధానమే తమకు అమలు జరిగినట్లయితే ఉద్యోగభాగాన్ని అంత పట్టించుకోకుండా పరిశ్రమ లాభభాగాన్ని మాత్రమే పట్టించుకొని ముందుకు పోతూవుంటుంది. కాని సోషలిస్టు దేశంలో నిరుద్యోగసమస్య లేకుండా వుండాలని అదే ప్రధానఅంశముగా పెట్టుకొని పనిచేస్తే industrial పాలసీలు అన్నీకూడా ముందుకు పోతూవుంటాయి. J. C. కుమారప్ప మొదలైనవాళ్లు చైనాకుకూడా వెళ్ళి అక్కడ వున్నటువంటి పరిస్థితులను తెలుసుకుని వచ్చారు. అక్కడ వున్నది కమ్యూనిస్టు గవర్నమెంటు అయినప్పటికీ, అక్కడ జాతీయ పరిశ్రమలకు ముఖ్యముగా చేనేతగుడ్డకు ప్రత్యేకంగా, ప్రతి జిల్లాకు సంతలు ఏర్పాటు చేశారు. మనదేశంలో ఆ విధంగాలేవు. ఏదో 1, 2 జిల్లాలలో మాత్రమే వుండవచ్చును కాని దేశం అంతా మాత్రము లేవని చెబుతున్నారు. అందుచేత మనదేశము పారిశ్రామికంగా అభివృద్ధి కావలసినటువంటి అవసరము వున్నది. అవతల ఉద్యోగాలు కల్పించవలసిన అవసరము వున్నది. ఈ రెంటిని సమన్వయముచేసి మిల్లు సంఘమునకు చేనేత పారిశ్రామిక సంఘమునకు ఒక common programme వేసి దేశంలో వస్త్రోత్పత్తి పెరుగునట్లు, చేనేత కార్మికులకు వృత్తి లభించేటట్లు చేయవలసిన అగత్యం ఎంతో ఉన్నది. అందుచేత నే చీరెలు, ధోవతులు కేటాయించమనేటటువంటిది దేశంలో అన్నిపార్టీలు అన్ని సెక్షనులు అంగీకరించిన మాత్రమే. అయినప్పటికి దానిని ఇంతవరకుకూడా కేంద్రప్రభుత్వము అంగీకరించలేదు. కనీసము ఈప్రభుత్వము అయినా గట్టిగా సిఫార్సుచేసిందా అంటే, ఈవేళ గౌరవనీయులైనటువంటి కళా వెంకట్రావు గారు ఇచ్చిన రిపోర్టులో ఆఖరున దానినిగురించి చెబుతూ చాలా చతురతలో ఆకును అందకుండా, పోకను పొందకుండా, పాము చావకుండా, కర్ర విరగకుండా జాగ్రత్తగా మాత్రము చెప్పారు. కేంద్రప్రభుత్వము మమ్ములనుఅడిగింది మేము ఆలోచిస్తామని మాత్రము చెప్పారు. గాని గట్టిగా కేటాయించామని చెప్పలేదు. అందుచేత తప్పకుండా గృహపరిశ్రమలలో ఈ పరిశ్రమకే ఈ సిద్ధాంతాన్ని వర్తింపచేట్లు చేయమని కాదు. వేరు చెప్పేది. అయితే గృహపరిశ్రమల్లో ఇదిచాలా

27th July 1955] [Sri P. Satyanarayana

పెద్ద పరిశ్రమ కాబట్టి ఇది ఒక సమస్యగా తయారైనది. కనుక గృహపరిశ్రమలన్నింటిలో, చేతిసంఘాలను, మిల్లుసంఘం మింగివేయకుండా అవి encroach కాకుండా తగిన్న రక్షణలు ఏర్పరచడము చాలా అవసరము అని చెప్పి మనవిచేస్తూ నేను ఇంతటితో సెలవు తీసుకుంటున్నాను.

THE HON. Sri K. VENKATA RAO:—అధ్యక్షా, ఈ డిమాండుకు ఇచ్చినకాలం అప్పుడే అయిపోయింది. అందుచేత నేను వీలైనంత తక్కువగానే సమాధానము చెప్పడానికి యత్నిస్తాను. ఇవాళ జరిగినచర్చల్లో సామర్లకోట నియోజక వర్గసభ్యులు మాట్లాడేదాకా అసలు పారిశ్రామిక విధానము పునాదికివెళ్ళిన చర్చ లేనే లేదు. మిగిలినవారందరూ దేశమును పారిశ్రామికముగా అభివృద్ధికి తీసుకువెళ్ళాలనే విషయం గురించిమాత్రమే చెప్పారు. మిత్రులు సామర్లకోట సభ్యులుమాత్రము కొన్ని పునాది సిద్ధాంతాలలోకి వెళ్ళారు. ఈ విషయం గురించి ఆగస్టు 3,4 వ తేదీలలో ప్లానింగుమీద చర్చజరిపినపుడు చెప్పదలచుకున్నాను. ఇప్పుడు చెప్పదలచలేదు. కాని 1,2 విషయాలకు నేను సమాధానముచెప్పకతప్పదు. అందులో మొట్టమొదటివిషయము వారు ప్రపంచంలో పారిశ్రామిక అభివృద్ధికి మూడుమార్గాలు వున్నాయనిసూచించారు. (1) సామ్రాజ్యవాదతత్వము. (2) ప్రక్కింటివాడు పోరాడుకుంటుంటే తన దేశానికి లాభముచేసుకోవడము, (3) దేశంలో అంతర్గర్భితమైన విప్లవము రావడము. కాని నాల్గవవిధానము ఒకటి ప్రపంచంలో వుందన్న సంగతి ఈ దేశంలో పుట్టిపెరిగ కూడా సత్యనారాయణగారు మరచిపోవడము చాలా విచారకరమైన విషయము అని నా మనవి. అది గాంధీ సిద్ధాంతము. ఏ రోజుఅయినా ప్రపంచానికి శాంతివచ్చి దేశానికి అభివృద్ధివచ్చి, దేశంలో ఈ పేద ప్రజానీకము అని పిలువబడేవారికి కడుపు నిండావుండే ఉత్తమమైనటువంటిది ఈ నాల్గవమార్గము. దీనికి గాంధీజీ సిద్ధాంతేను తప్ప ఇంకొకటిలేదు. ఈ నాడు భారతదేశములో వున్నటువంటి పారిశ్రామిక అభివృద్ధికి పునాది గాంధీ సిద్ధాంతము అని, మనవిచేస్తున్నాను. దేశములో దౌర్జన్యాన్ని అంతర్‌యుద్ధాన్ని ప్రవేశింపకుండా, దేశంలో దౌర్జన్యాన్ని బలవంతంగా ప్రవేశింపకుండా ఈ దేశాన్ని ఇతర దేశాలయొక్క స్థాయికి తీసుకువెళ్ళే యత్నం ఒక్క గాంధీజీ సిద్ధాంతము ద్వారానే సాధించడానికి భారతప్రభుత్వము ఆంధ్రప్రభుత్వముకూడా సంకల్పించాయని నేను వారికి మనవిచేస్తున్నాను. అందువల్ల ఈ రోజు ఆ మూడు మార్గాలేకాదు. నాల్గవదికూడా వున్నది. దానిని అనుసరిస్తున్నాము. ఈ మార్గముయొక్క ప్రశక్తి ఒక్కభారతదేశములోనే కాకుండా, ఇతర దేశాలలో కాపిటలిస్టు దేశాలనుకున్నచోట్ల, అవతల కమ్యూనిస్టులు దేశాలు అనుకొనే చోట్లకూడా వస్తున్నది. ఈ నూతనమార్గాన్ని మనయొక్క ప్రజాస్వామ్య

Sri K. Venkata Rao] [27th July 1955

తత్వము ద్వారా అమలుపరచి దేశంలో Socialistic pattern of Society ని మనము కల్పించగలిగినట్లయితే ప్రపంచానికి అమితమైన సేవచేసినవాళ్లము అవుతాము. ఆ క్లాజు ప్రక్కవాళ్ల ఇంట్లోనుంచి తీసుకొనే తత్వము నశించిపోతుంది. కేవలము పోర్జన్య యుతుమైనటువంటి ప్రజావిప్లవమునకు ఎట్టి ఆస్కారము లేకుండా పోతుంది. దేశంలో ప్రజల purchasing power కుదింపు అయిపోయినదని వారన్నారు. అసలు ఈ పంచ వర్ష ప్రణాళికల యొక్క ఉద్దేశ్యము ఈ కుదింపు అయినటువంటి శక్తిని అభివృద్ధిచేయడమె అనే నేను వేరే మనవిచేయ నవసరములేదు. ఒకాయన నవ్వుతూ ఒకపర్యాయము "చైనాదేశం అన్నిదేశాలకన్నా ఎక్కువ జనాభా కలిగిన దేశము. (మనదేశంకన్నాకూడా ఎక్కువ జనాభా కలిగినదేశం). ఆ దేశంలోవున్న స్త్రీలుఅందరూ లంగాలను రెండు అంగుళాల వెడల్పు పెంచినట్లయితే మాంచెస్టరుకు 6 యేండ్లు పని దొరుకుతుంది" అని చెప్పారు. అంటే home marketing potential అంత వున్నదన్నమాట. అలవాటులో ఒక చిన్నమార్పు తీసుకురావడము వల్ల అంత ఉత్పత్తిని కొనేటటువంటి శక్తి వస్తుంది. భారతదేశానికికూడా దైవకృపవల్ల ఈ హెచ్చుపెరిగే జనాభావల్లవచ్చే మొట్టమొదట లాభము ఏమిటంటే కొనుగోలు శక్తి ఎక్కువ అవడమే. అమెరికాలాగా భారతదేశం పారిశ్రామికంగాను, వ్యవసాయకంగాను ముందుకు వెళ్లినటువంటి రోజున ప్రతిష్ఠాయిలోనుకూడా మన కొనుగోలు శక్తిపెరిగి మన మార్కెటు ఎక్కువ అవడమేకాకుండా మన ఉత్పత్తియొక్క విధానమునుకూడా ముందుకుతీసుకువెళ్ళే పరిస్థితులు ఏర్పడుతాయని నేను మనవిచేస్తున్నాను. Agricultural Income taxకు గోపాలరెడ్డిగారు వ్యతిరేకమని వారుమనవిచేశారు. అందుకు గోపాలరెడ్డిగారు ఎంతమాత్రము వ్యతిరేకము కాదు. నాకు స్వయముగా తెలుసు. మేము మద్రాసు ప్రభుత్వములో వుండగానే Agricultural Income tax వేయుటకు బిల్లులు తయారు అయినాయి. కాని మద్రాసులో ప్లాన్ కేసను కూడా కలుపుకొని బీహారు బేసిస్‌మీద, అన్నాము. బేసిస్‌మీద బిల్లు పెట్టితే మొత్తము ఆదాయం అంతా కలిపి 50 లక్షల రూపాయలుకూడా వచ్చేపరిస్థితి లేకపోయింది. దానిలో అయ్యే ఖర్చులు మనకుతెలుసు. అందుచేత ప్రత్యేకమైన లాభము లేకపోవడమువల్ల వదలివేయడము జరిగింది. ఈ వేళ దీనిమీద ఏ మాత్రం లాభము వస్తుందన్నా Agricultural Income tax బిల్లు పెట్టడానికి గోపాలరెడ్డిగారికిగాని, నాకుగాని మంత్రివర్గానికిగాని ఏ విధమైనటువంటి అభ్యంతరము లేదని మనవి చేస్తున్నాను. ఆ విషయంలో కొంచెము పరిశోధనచేసి నా మిత్రులు ఏమైనా తోడచూపిస్తే ఇలాంటి constructive efforts కు మేము సహాయము పడడానికి ఏ విధమైనటువంటి అభ్యంతరము వుండదు. సర్‌ చార్జివేయడము లేదని చెప్పా

తున్నారు. మొన్న గోపాలరెడ్డిగారు ఈ ఒక్క చెక్ పోస్టేకాదు, ఎన్నో చెక్ చార్జీలు వేయడానికి సిద్ధంగావున్నారని చెప్పారు. వేయడానికి ఏమాత్రము జంకవము లేదు. వేయకచేసే స్వార్థములేదు. పన్ను చెల్లించుకోగలిగిన సామర్థ్యము దేశంలో వుందో లేదో అనేటటువంటి విషయములో భేదాభిప్రాయం ఉన్నప్పటికి మోయలేనటువంటి భుజాలపైనకూడా కొంత బరువుపెట్టి, ఈ బరువును పిమ్మట వాళ్లను కల్పించేటటువంటి సౌకర్యాలద్వారా తీసివేద్దామని యత్నముచేస్తూ మేము ముందుకు పోతున్నాము. దీనికి విమర్శనా రహితంగా సహాయపడుతారని నేను ఆశిస్తున్నాను. దేశములో పెట్టుబడికోసం ఒక సంస్థకూడా లేదు అని చెప్పారు. ఈవిషయము గురించి నేను ఈమధ్యనే చెప్పాను. ఆంధ్రరాష్ట్రములో Industrial Investment Corporation ను ఏర్పాటు చేయడానికి Government of India వారి అనుమతి వచ్చింది. Special officer ను appoint చేసినాము. ఆయన 5 వ తెదీనవచ్చి చార్జి తీసుకుంటారు. మూడు నెలలలోపుగానే మన రాష్ట్రములో Industrial Investment Corporation తయారవుతుంది. ఈ Industrial Investment Corporation ద్వారాగాని ఇంకొక రకంగాగాని 2 కోట్ల రూపాయలు పెట్టుబడి కావలెనంటె co-operative system అన్నారు. అయితే ఈ heavy industry కి co-operative పద్ధతి తీసుకపోయి పెట్టడానికి సాధ్యముకాదని మనవి చేయుచున్నాను. Strategic wholesale trade అనే ఒకపదము ఆయన ప్రయోగించారు. దానికి ఇప్పుడు మన గ్రామములో self-sufficiency ఉండి, దేశముకూడా ఆ basis మీద వున్నట్లయితేగానిలో కొంత కీలకము ఉంటే ఉండవచ్చు. కాని world market మీద raw-material కు ఆధారపడే పరిస్థితిలో పొగాకు ధర రూ. 600/లు వుంటే, world market లో రూ. 400/-లు ఉంటుంది. దీని State handle చేస్తే దేశమును దివాళా తీయించడానికి ఈ మాత్రము margin చాలును. అందుచేత ఈ whole State trade అనే పదమువారు ఉపయోగించడము పొరపాటని నేను ఈ సమాధానము చెప్పవలసివచ్చింది. చైనాలో 76% increase వచ్చిందన్నారు. నిజమే అయియుండవచ్చు కాదని నేను చెప్పలేను. కాని ఈ percentage లతో growth ను కొలచడము మాత్రము నిజము అయినదని కాదని చెప్పుచున్నాను. Percentage సరియైన physical target ను నిరూపించదు. వంద, రెండువందలు అయినదంటే రెట్టింపుఅయినట్లు లెక్క. కాని 2,4 అయినాకూడా రెట్టింపు అయినట్టే లెక్క. School final కు ఇద్దరువెళ్లి ఇద్దరూ ప్యాసు అయినట్లయితే cent percent ప్యాసు అయినట్లవుతుంది. 200 మంది వెళ్లినచోట ఇద్దరు

Sri K. Venkata Rao] [27th July 1955

హ్యాసులయితే 1% అవుతుంది. అందువల్ల ఈ percentage లతో అభివృద్ధిని లెక్క పెట్టడము ప్రపంచములో ఎక్కడా లేదు. మన లెఖ్ఖింపుకు చాలా మార్గాలు ఉన్నవి. వాటి ప్రకారముగా లెక్క వేసి చైనా ముందుకు వెళ్లితే చాలా సంతోషము. అక్కడ మన దేశ సిద్ధాంతములకు అనుగుణంగా వున్నటువంటి కొత్త పద్ధతులు ఏమైన ఉంటే ఒక్క చైనాయే కాకుండా ఇతర దేశములలో ఉన్న కొత్తపద్ధతులుకూడా నేర్చుకొనడానికి సిద్ధంగా వున్నాము. కాని ఒక్క percentage quotation వల్ల దానిని అనుసరించడానికి వీలుండదు. ఇక మిగిలిన విషయములన్నీ అందరిమాదిరిగానే వారూ చెప్పిరి. Labour intensive development మీద industry ని develop చేయాలనేది వారు అంగీకరించి నందులకు సంతోషముగా ఉన్నది. ఆ రకముగా దేశము అభివృద్ధికి వెళ్ళడమే గాంధీ గారి సిద్ధాంతములకు మార్గము. అందువల్ల వారుకూడా దానిని ఆమోదించినందులకు నేను చాలా సంతోషమును వెలిబుచ్చుచున్నాను. ఇంకొక విషయము. అందరిని ఒక చోటచేర్చి వాళ్ళకు చిన్న పరిశ్రమలవల్ల ఎందుకు ఆధారము చూపించరు అని సూచించి నారు. రేపు ఆ విషయము చర్చకువస్తుంది. Industrial estates రెండు ఇదివరకే propose చేసినాము. Industrial estates అంటే గవర్నమెంటువారే కొన్ని గృహాలు ఒకేచోట 50, 60, ఎకరముల స్థలములో కట్టించి అక్కడ ఎవరైనా చిన్న పరిశ్రమలు స్థాపించుకునేవారికి ఆశ్రమము, ఆశ్రయము కల్పించి, సహాయముచేసి వాటి అభివృద్ధిని ప్రోత్సహించుట కూడా మా స్కీములో వున్నదని మనవి చేస్తున్నాను.

రత్నసభాపతిగారు ముఖ్యముగా చెప్పిన విషయములో చాలావరకు సమాధానము చెప్పినాను. కాని వారికి మనకు ఉన్న భేదాభిప్రాయాలు ఏమిటంటే power looms పెట్టాలని చెప్పారు. Power looms పెట్టడం గవర్నమెంటు పాలసీ కాదు. ఇవతల చేనేత పారిశ్రామికులకు వృత్తి కల్గించడము, power looms పెట్టడం చాలా కష్టము. కనుక అది వీలులేదు. కనుంగో కమిటీ రిపోర్టు విచారణ మీద ఈ ప్రభుత్వమునకు భేదాభిప్రాయాలు ఉన్నవి. అందువల్లనే ఆంధ్రరాష్ట్రములో బట్టల మిల్లులకు ఎక్కువగా లైసెన్సులు ఇవ్వడములేదు. నేసే మిల్లులకంటే వడికే మిల్లులకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తున్నారు. ఇంకా technical personnel ను ఎక్కువ చేయాలన్నారు. రెండవ పంచవర్ష ప్రణాళికమీద జరిగే చర్చలో ఈ విషయము మనవిచేస్తాను. గవర్నమెంటుకూడా ఏదో కొన్ని చర్యలు తీసుకొను చున్నది. పాలిటెక్నిక్ పాఠశాలలో ఈఏడు double shift system పెట్టు చున్నారు. ఇంకా Industrial school పెట్టడానికి పాలిటెక్నికల్లు అభివృది

27th July 1955] [Sri K. Venkata Rao

పరచడానికి ప్రభుత్వము చాలా కృషిచేయుచున్నది. అందువల్ల వారికి ఆ విషయములో తృప్తి కలిగించగలమనే ఆశిస్తున్నాను. ఇంకా old improvements ను గురించి సభ్యులు చెప్పారు. అనేక విషయాలమీద గవర్నమెంటు ప్రైజులు కూడా ఉన్నాయి.

సునిశితమైనటువంటి నూలు ఎక్కువ ఉత్పత్తిచేసే వారికి రోజుకు ఒక రూపాయి ఆదాయము వచ్చేటటువంటి అంబరు చరఖా తయారు చేయించవలసిందని నాగినేని వెంకయ్యగారు చెప్పారు. నేను దానిని కొనడానికి ప్రయత్నము చేస్తూంటే ఇంతవరకు దొరకలేదు. త్వరలో దొరుకుతుందని ఆశిస్తున్నాను. గాంధీగారు వున్నప్పుడు దీనికి లక్షరూపాయిలు ప్రైజు ఆఫరు చేశారు. ఎవరైనా అటువంటి చరఖాను ఉపయోగిస్తే అటువంటి instrumentను తయారుచేసి తీసుకువస్తే గవర్నమెంటు వాటిని ప్రోత్సహించడానికి ఏవిధమైన అభ్యంతరము ఉండదని మనవి చేస్తున్నాను.

నరసింగరావుగారు మాట్లాడుతూ ఇప్పట్నుంచీ రెండవ పంచవర్ష ప్రణాళికకు సిద్ధపడమని చెప్పారు. తయారు పడుతున్న విషయము వారికి తెలిసినదే. వారు steel industry ని పెట్టమన్నారు. ఒక steel plant అంటే 85 కోట్ల రూపాయలు అవుతుంది. భిలాయిలోనూ, రూర్‌కేలాలోనూ చూస్తూనేఉన్నాము. రు. 85 కోట్లు తెచ్చుకోవడమనే సమస్యతో బాటు మన దేశములో steel తయారీకి కావలసిన ప్రాథమిక పదార్థాలు ఒకచోట లేవు. ఇంతమటుకు దొరకలేదు. ఇకముందు దొరికినట్లయితే ఇంకో పంచవర్ష ప్రణాళికలో దానికి స్థానము లభిస్తుంది. మునుస్వామిగారుకూడా iron ore ను గురించి చెబుతూ అక్కడ industry పెట్టమన్నారు. అది సాధ్యమైన విషయముకాదు. మిగిలిన జిప్సము వగైరాలను తయారు చేసుకునే యత్నము జరుగుతోంది. కాని అక్కడ మొదటిరకము జిప్సము దొరకదని చెప్పారు. అదీగాక deep గా త్రవ్వినాకూడా లేదనే విషయము వచ్చింది. ఉన్నది వినియోగించుకొవడములో కష్టము ఉండదు. శ్రీహరికోటకు నేను రావాలని మునుస్వామిగారు కోరారు. వారి పరిచయము నాకు లేకపోయినను నేను రెండుసార్లు అక్కడకు వెళ్ళిన సంగతి వారికి మనవిచేస్తున్నాను. సత్యనారాయణగారు 'cottage industry to co-operation అని చెప్పారు. దానికి ఏవిధమైన అభ్యంతరమూలేదు. శెట్టిగారు కూడా ఈ public limited companies ను గురించి సునిశితమైన విమర్శచేశారు. దీనిలో లోపములు కొన్ని కనిపెట్టడమువల్లనే ఇప్పుడున్న కంపెనీ రూల్సును పార్లమెంటు సరిచేస్తోంది. ఆ చేసే మార్పులవల్ల ఇలాంటివి ఏవిధమైనా వున్నట్లయితే అదుపులోకి వస్తాయని నేను ఆశిస్తున్నాను. వారు ఇంకా కొన్ని పేర్లుకూడా చెప్పారు.

అది నిజమో, అబద్ధమోగాని, నేను చెప్పడానికి వీలులేదు. పైగా ప్రభుత్వము వారి యొక్క knowledge లో లేని విషయాలు ఎవరైనా ఒక వ్యక్తిగాని, ఒక సంస్థగాని శాస్త్ర వైరుధ్యమైన రీతిని వ్యవహరిస్తే దానికి ప్రతీకారము తెచ్చుకోవడానికి ఆ షేరుహోల్డర్సు చేతులలో హక్కు ఉన్నది. అటు వంటి హక్కును ఇంతవరకు చలాయిస్తున్నట్లు లేదు. కాని నా అంతట నేను చర్యతీసుకొనే హక్కు కూడలేదు. ఒకవేళ తీసుకునేందుకు వీలు ఉన్నను అసలు అది తప్పో, ఒప్పో నిరూపణ మొదటచేసుకుంటేగాని బహిరంగంగా ఆ విమర్శలలో నేను join అగుటకు వీలులేదని మనవిచేస్తున్నాను. కోటయ్యగారు ముఖ్యముగా చేనేత పరిశ్రమనుగురించి చెప్పారు. ఆయన చెప్పిన విషయములకు నా కున్నటువంటి భావములకు ఏమీ తేడాలేదని వారే చెప్పారు. ఆ పద్ధతిలోనే ప్రభుత్వముయొక్క దృక్పథముకూడా నడుస్తోంది. కాబట్టి ఈ స్వల్పకాలములో దానినిగురించి నేను మాట్లాడ దలుచుకోలేదు. జగన్నాథరాజుగారు చోడవరంతాలూకాలో ఒక పంచదార ఫ్యాక్టరీని పెట్టమని మనవి చేశారు. అది రిజిస్టరుచేయవలెనని 3 నెలల time లో వాళ్ల ప్రాథమిక capital ను వసూలుచేయవలసినదిగా గవర్నమెంటు orders వేశారు. ఊరికే telegram పంపడమే తప్ప చర్య ఏమీ స్థానికంగా తీసుకున్నట్లు కన్పడలేదు. జగన్నాథరాజుగారైనా శ్రద్ధతీసుకొని ఆ పని పూర్తిచేస్తే తప్పకుండా ఫ్యాక్టరీ పెడతాము. దానికి అభ్యంతరము ఏమీలేదు. తుంపాల ఫ్యాక్టరీ గురించి చెప్పారు. దానినిగురించి ఒకశాసనము ఉన్నది. ఆశాసనమునకు లోబడి పనిచేయుటకు ఏ విధమైన అభ్యంతరము లేదు.

మాలా సాహెబుగారు ఏమిచెప్పారో నాకు అర్థం కాలేదు. సంచా నారాయణప్ప గారుకూడా కోటయ్యగారు చెప్పినవిషయాలనే ఎక్కువగాచెప్పారు. వారు మరొక విషయం. Loans to defaulting members గురించి చెప్పారు. పాత అప్పులుగురించి ప్రభుత్వానికి హక్కు ఇస్తే వారికికూడా క్రొత్తగా అప్పు ఇవ్వ డానికి ఏ విధమైన అభ్యంతరం వుండదు. బుస్సన్నగారు నంద్యాలలో పేపరుమిల్లు పెట్టాలి అన్నారు. దానినిగురించికూడా రెండవతారీఖున తెలుస్తుంది. ఆదోనిలో woollen mill పెట్టేవిషయంలో స్కీముతయారుచేసి ఇస్తే ప్రభుత్వం ఆలోచిస్తుంది. రాజారాంగారు Industrial schools గురించి చెప్పారు. నేను ఇందాక చెప్పాను, ఏ రకంగా అభివృద్ధిలోనికి తీసుకరావాలనేది త్వరలోనే ఏర్పాట్లు అవు తాయి. కంబదూరులోవుంటే తోళ్ల పరిశ్రమను గురించి ఇద్దరు మాట్లాడారు. శాంతప్ప గారు అక్కడ బిల్డింగుకట్టారు. మొన్న నేను tour కు వెళ్లినపుడు ఆ బిల్డింగును చూశాను. మంచి building, ఉన్నది కాని, మనిషి మాత్రంలేదు. కారణం నాకు

[27th July 1955] [Sri K. Venkata Rao

తెలియదు. ఎటువంటి ఏర్పాట్లు లేకుండా బిల్డింగు ఎందుకు కట్టారో తెలియలేదు. దీనిని గురించి చర్య తీసుకుంటున్నాం. అనంతపురంజిల్లాలో తోళ్లపరిశ్రమకు ఒక ఆదర్శ కేంద్రం ఏర్పాటుచేయాలని ప్రభుత్వనిర్ణయం జరిగింది. త్వరలోనే orders వస్తున్నాయి. దీనిని గురించి ప్రత్యేకంగా మనవి చేయవలసిన అవసరం లేదు. రాఘవయ్య గారు కీచుపరిశ్రమ, tanning పరిశ్రమ గురించి చెప్పారు. Tanning centres చాలాచోట్ల పెడుతున్నాము. వారు సూచించిన విషయాలలో tanning అయిన తరువాతగాని నిపుణతవున్న వారికిగాని industrial loans ఏ security లేకుండా రు. 500 ల వరకు ఇచ్చేట్లు ఏర్పాట్లు చేశాము. నిపుణతవున్నవారు దానిని వినియోగించుకొని తమంతట తాము అభివృద్ధిచెందడానికి ఏ విధమైన అభ్యంతరం వుండదు. దానికి ఏ విధమైన సెక్యూరిటి ఇవ్వనక్కరలేదు. గున్నయ్యగారు సున్నంపరిశ్రమ, శిల్ప పరిశ్రమను గురించి చెప్పారు. ముఖ్యంగా వారుచెప్పింది పార్వతీపురంలో sugar mill పెట్టాలని. గవర్నమెంటువారికి sugar mill పెట్టే స్తోమతులేదు. 15 లక్షలు వారు తెస్తే 4, 5 లక్షలురూపాయలు సహాయంచేస్తుంది. అలా తయారైన వారున్నారు. గున్నయ్యగారి దృష్టి పాతపట్నం వదిలిపోయి పార్వతీపురంవైపుకు వెళ్ళింది. వారు స్థానికంగా ఏమైనా యత్నంచేస్తే ఏమైనాచేస్తాము. బొబ్బిలి sugar mill గురించి Tumpala కు చెప్పిన సమాధానమే చెబుతున్నాను. శాంతప్పగారికి సమాధానం చెప్పాను. B. సుబ్బారావుగారు వ్యవసాయ కూలీలు, Industries గురించి చెప్పారు. అది అంతా అంగీకరించిన విషయమే. వావిలాల గోపాలకృష్ణయ్యగారు ఇదివరకుచెప్పిన విషయాలే చెప్పారు. Managing agencies గురించి ఇదివరకు చెప్పాను. Village Industries గురించి ఏకాభిప్రాయమే. Co-operative పద్ధతిమీద వ్యాపారం చేయాలన్నారు. Co-operative Society లన్ని ఆ దృష్టితోనే చేస్తున్నాము. Andhra products for Andhra అన్నారు. ఆయన ఆ స్తమానం సంచివేసుకొని గ్రామ గ్రామం వెళ్లేటప్పుడు ఈ ప్రచారంకూడా చేయాలని నామనవి. నేనుకూడా ఆయనతో ఏకీభవిస్తున్నాను. ఆంధ్రలో తయారయేబట్టలు, జోళ్లు నేను వినియోగం చేస్తున్నాను. ఇంకా ఏ జిల్లాలో ఎక్కడనుంచో తెప్పించుకొంటున్నా మనం industries పెట్టుకున్న తరువాత అమలులో చేస్కోవచ్చును. Andhra Paper Mills కు ఒక publicity agent వున్నాడు. ఇందాక వేమయ్యగారు cut motion ఇవ్వడానికి స్పీకరుగారిని అడుగుతున్నారు. రు 200 లు జీతంఇచ్చి propaganda officer ఎందుకు అన్నారు. ఆయన ఈ sales చేయడానికే. Paper Mill పేపరును, Ceramic Factory పింగాణీసరుకును మార్కెట్టులోనికి తీసుకువెళ్లి Orders

book చేసే ఉద్యోగం ఆతనిది. ఇది స్వల్పజీత మేనని వేమయ్యగారు గుర్తిస్తారని ఆశిస్తున్నాను. Ceramic products cost గురించి చెప్పారు. Gudur Ceramic Factory యొక్క sanitary ware ఇక్కడ రు 13-14-0 వుంటే ఇండియా మార్కెటులో రు 26 లకు అమ్ముతున్నారు. అందుచేత ఎంత demand వచ్చిందంటే కావలసిన సరుకు తయారు చేయలేకుండా వున్నారు. ఈ ఏడాది prices reduce చేసే ఉద్దేశంతో production double చేసేయత్నం జరుగు తోంది. ఆర్డర్లు వెళ్లాయి. వాగినేని వెంకయ్యగారు అంబరు చరఖాగురించి చెప్పారు. Nicotin factory గురించి, redrying plant గురించి చెప్పారు. అవి ఆ జిల్లాలో చాలా ఉన్నాయి. నికొటిన్ ఫ్యాక్టరీ గురించి ఒంగోలునుంచి దరఖాస్తు వచ్చింది. వీలు అయితే సహాయం చేస్తాము. పార్థసారధిగారు రాయలసీమలో (metallurgy) లోహ పరిశ్రమ గురించి చెప్పారు. లోహాలు దొరికితే లోహ పరిశ్రమ పెట్టడానికి వీలువుంటుంది. దీనిని గురించి geological survey వారు final opinion చెప్పలేదు. ఏ లోహమైనా ఎక్కువగా దొరికితే తప్పకుండా కృషి చేయవచ్చును. వీటిసంగతి తెలిసినాక చూడవచ్చును. ఆయన పండ్లపరిశ్రమమీద ప్రభుత్వం ఆదరణ చూపాలన్నారు. ఆయన సొసైటీ ప్రెసిడెంటు. పండ్ల squash వుండే సీసాపంపిస్తే నేను diabetic patientను అయినా అప్పుడప్పుడు ఆస్వాదించ డానికి ఏమి అభ్యంతరంలేదు. Delays in mining licences తగ్గాలని చెప్పారు. ఈవిషయంలో ఏవిధమైన delays జరగడంలేదు. ఎక్కడైనా particular case వుంటే legal objection వున్నదన్నమాట. అధమపక్షం 10 mining licences మీదనైనా సంతకం పెడుతున్నాను. ఏదైనా ఆలస్యం వుంటే నా దృష్టికి తీసుకువస్తే చూడడానికి వీలువుంటుంది. పేటబాపయ్యగారు కంబళి పరిశ్రమగురించి చెప్పారు. వారికి N.E.S.: వున్నది.

Sri S. NARAYANAPPA :—Mica plant ప్రభుత్వంవారు తలపెట్టి నట్లు అంటున్నారు. అది నిజమేనా ? అయినచో దానిని private పరిశ్రమకు వదలి పెడతారా ?

The Hon. Sri K. VENKATA RAO :—పెడతాం అనే ఉద్దేశం తోనే జగ్గయ్యపేటలో విచారణలు జరుగుతున్నాయి. ఇంకా అనువైన పరిస్థితులు మా దృష్టిలోకి రాలేదు. ఆ ఉద్దేశంతో 2000 ఎకరాలలో వుండే కొకిరాయిని ఎవరూ వినియోగించకుండా order వేశాము. అక్కడ మైకా దొరికితే మనదేశాన్ని బాగుచేసినట్లు అవుతుంది. అద్దేపల్లి సత్యనారాయణమూర్తిగారు ప్రభుత్వానికి సలహా ఇచ్చేదానితో బాటు వారివద్ద నిలువవున్న ధనాన్ని industries మీద పెట్టుబడి పెడితే బాగుంటుంది.

SRI A. SATYANARAYANA MURTHY :—గవర్నమెంటు shares తీసుకుంటే పెట్టడానికి సిద్ధంగావున్నాము.

THE HON. SRI K. VENKATA RAO :—నేను వారి ఊరికికూడా వెళ్లి చెప్పాను. వారు ఆ మీటింగుకు రాలేదు. ఏలూరులో జరిగిన మీటింగులో చెప్పాను. రు. 50 లు పట్టుకువస్తే రు. 50 లక్షలో గవర్నమెంటు ముందుకు వస్తుందని చెప్పాను. ఆయనవద్దర ఎంతవున్నదో ఆయన చెప్పాలి కాని నాకు ఎట్లా తెలుస్తుంది ? ఆయనచెప్పిన సలహాలో research institutes గురించి ఏర్పాట్లు జరుగుతున్నాయి. పెద్ద research institutes పెట్టుకోవాలంటే రెవెన్యూలోనుంచి ఖర్చుపెట్టుకోవాలి. Industries develop చేసుకుంటూరు ఇతరదేశాలలో. భారత ప్రభుత్వం దేశంలో 12 research institutes పెట్టింది. మనకు ప్రత్యేక industry ఏదైనా develop అయితే దానిని గురించి research institute పెట్టడానికి ఏమి అభ్యంతరంలేదు. గూడూరులో మైకాగురించి ఒకచిన్న research institute పెడుతున్నాము. వనస్పతి గురించి చెప్పారు. వారైతే దీనిని గురించి మాట్లాడారు కాని దీనిని గురించి నేను మాట్లాడాలంటే కొంచెం కష్టంగావున్నది. ఆంధ్రదేశంలో పెట్టిన వనస్పతికి ప్రభుత్వం ఇదివరలో ఇచ్చినడబ్బులో 25%అయినా వసూలు అవుతుందా అని అనుమానంగా వున్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఆ విధంగా సహాయంపొందిన factory లు ఎన్నివున్నాయి ?

THE HON. SRI K. VENKATA RAO:—మూడో, నాలుగోవున్నాయి.

Sri PILLALAMARRI VENKATESWARLU :—పేర్లు చెబుతారా ?

THE HON Sri K. VENKATA RAO: — ఎప్పుడో చెబుతాను; తొందర ఏమి వున్నది ?

Mr. SPEAKER :—Let the Hon. Minister continue his speech.

Sri A. SATYANARAYANAMURTY :—ఇచ్చిన డబ్బులో కొంచెమైనా వనస్పతినుంచి వస్తుందా, రాదా అని మీరే భయపడుతున్నారు కదా. అది ఏమైనా బాగుపడే విషయం ఆలోచిస్తారా ?

THE HON. Sri K. VENKATA RAO:—అసలు వనస్పతి వుండాలా, అక్కరలేదా అనేదానిపై అభిప్రాయభేదాలు వున్నాయి. వారు దీనిని ఉపయోగించుకొని బాగుచేయదలుచుకుంటే shareholders, company వాళ్లు మా సహాయం

[SRI K. Venkata Rao] [27th July 1955

అడగాలి కాని liquidation proceedings కొరకు దరఖాస్తు పెట్టుకొని మమ్ములను అడిగితే ఏం లాభం ? వారి దృష్టిలో ఒకటే వున్నది. ఉన్నవాటిలో అదికొంచెం మంచిది. దానిని బాగుచేయాలి కాని దేశంలో తలక్రిందులైన industry గురించి సత్యనారాయణమూర్తిగారు అంత శ్రద్ధ తీసుకోవలసిన అవసరంవుండదు అనుకుంటాను. వయ్యూరు శ్రీనివాసరావుగారు చాలా విషయాలు పందులదగ్గరనుంచి పండ్లవరకు చెప్పారు. ఆవకాయ అంటే చాలా ఇష్టం, నాకు. ప్రతిరోజు ఉంటే కాని కాలక్షేపం జరుగదు. జైలులోకూడా జరుగలేదు. ఆ industry ఎక్కడైనా పెడితే నా అభ్యంతరం ఏమీలేదు. వారు చెప్పిన పదివ్యవహారాలు—అంటే fish, పండ్లు, పందులు, తాటికర్రలు, table salt, సుద్ద, ఆవకాయ, చెప్పులు, నూనె, నగలు—ఇవన్నీ కూడా ప్రస్తుతంవున్న Cottage Industry Scheme లో వున్నాయని మనవిచేస్తున్నాను. ఇంతవరకు ప్రభుత్వంవారు పంచవర్ష ప్రణాళికలో రు. 4,05,000 లు పై చిలుకు cottage industries కోసం వ్యయం చేస్తున్నారు. List వున్నదికాని చదివితే ఆలస్యమవుతుంది. ఇప్పటికే ఆలస్యం అయినది.

5 p. m.

తరువాత బెజవాడలో Central Sales Emporiums యీ Cottage Industriesలో వచ్చినసరకులకుగాను పెట్టుతున్నాము. Marketing facilities కలుగజేయడముకోసము చాలావరకు చెప్పినాను. పైకి తీసుకవచ్చిన విషయాలన్నింటికి సమాధానము చెప్పినా ననుకుంటున్నాను. ఒకవేళ ఏదైన మరచిపోయినదానిని గురించి సభ్యులు గవర్నమెంటు దృష్టికి తీసుకొస్తే తప్పకుండా చూస్తాను.

Sri N. VENKAYYA :—తక్కువ గ్రేడు పొగాకుకు Trading Corporation ఏర్పాటుచేసే విషయము మంత్రిగారు చెప్పలేదు.

THE HON. SRI K. VENKATA RAO:—నేను చెప్పినాను; వెంకయ్యగారు పికారు వెళ్లినారు అనుకుంటాను. Trading Corporation commercial crops కు పెట్టితే ఆంధ్రప్రభుత్వము ఇదివరకు వున్న పరిస్థితులలోనుండి 10 అడుగులు క్రిందికి దిగవలసివుంటుంది. ఎందుచేతనంటే world prices మీద control అయ్యే commodities ను Trading కార్పొరేషన్‌లోనికి తీసుకరావడము చాల కష్టమైన విషయము. కాని private agencies పనిచేస్తే ఇదివరకు సహాయము చేసినట్టు ప్రభుత్వము సహాయము చేయడానికి వీలు కలుగుతుందని మనవి చేస్తున్నాను. ఈ తరిగ్రేడులను గురించి మొట్టమొదటనే మనవిచేశాను. నా first sentenceను

గమనించినట్లయితే పరిశ్రమల విషయములో మన పరిస్థితి చాలకొద్దిగాను స్వల్పముగాను వుంది. నా అభిప్రాయముకూడా అదే. దానిని గురించి విమర్శ అనవసరము. ఎందుకంటే మన స్థితి అది. ఈ వేళ దానిని ముందుకు తీసికొని పోయే యత్నము మనము చేయాలి. ఇదివరకు ఎప్పుడు చేయలేదని విమర్శచేస్తే ఏమి చెప్పలేము. ఇదివరకున్న మద్రాసురాష్ట్రములోనుండి మనమువచ్చి రెండేండ్లుకూడా పూర్తికాలేదు. ఇంతట్లో ఇక్కడ విప్లవముకాని విప్లవకరమైన కార్యక్రమముకాని సాధనము వీలులే నటువంటి పని కావున మనమందరము కలసి ముందుకువచ్చి 5-6 సంవత్సరములలో నైన దానిని మనము చాలవరకు బాగుచేయవచ్చును. నాకు ఒక్క విషయమే సంతోషముగా వుంది. ఇక్కడవున్న సభ్యులకుకూడా ప్రధానమైన సూత్రాలపైన చాల వరకు ఏకాభిప్రాయము వుంది కనుక మనము చాలావరకు ముందు అడుగువేయడానికి వీలువుంది. నేను ఏడుజిల్లాలకు వెళ్లివచ్చాను. రెండవ పంచవర్ష ప్రణాళికలో అధమపక్షము ప్రతిజిల్లాలోను ఒక medium type industry ప్రభుత్వముయొక్క సహాయముతో ఏర్పాటు జరుగుతుంది. దానిని గురించి M. L. As. ను నేను అడిగితే నాకు సలహా ఏమి చెప్పతారు? దానిని గురించి కృషి చేయలేము సరి కదా, అంతా ప్రభుత్వమే ఎందుచేత పెట్టకూడదంటారు. మీరు చేసిన పని ఏదో నాకు నిరూపిస్తే తర్వాత ప్రభుత్వము ఎంతభాగము చేస్తుందనే విషయము వుంటుంది. నేను జీరోగానే వుంటాను మీరు ఒకటిదగ్గరనుంచి మొదలుపెట్టి వందదాకా వెళ్ళండి అని చెప్పడము న్యాయముకాదు అని మనవిచేస్తున్నాను. రేపు పంచవర్ష ప్రణాళిక ఎంతవరకు public sector లో వెళ్లుతుందో, ఎంతమేరకు public sector co-operation లో వెళ్లుతుందో, ఎంతమేరకు State participation వెళ్లుతుందో, ఎంతమేరకు private sector వెళ్లుతుందో, అన్న విషయములు దానిలో తెలియజేయడానికి వీలుపోతుంది. సభ్యులు ప్రభుత్వము ఏకీకరణము ఐనట్లయితే యీ దృష్టితోనే మనము వచ్చేసంవత్సరము పనిచేసినట్లయితే తప్పకుండా వ్యవసాయాత్మకమైన ఆంధ్రరాష్ట్రము పారిశ్రామికంగాకూడా ముందుకు అడుగువేస్తుందని నేను ఆశిస్తూ తమ అందరియొక్క సహాయాన్ని అభిలషిస్తున్నాను. ఈ వేళ యీ సందర్భములో వచ్చిన cut motions ను ఉపసంహరించుకోవాలని కోరుతూ నేను సెలవు తీసుకుంటున్నాను.

All the cut motions were by leave of the House withdrawn.

Mr. SPEAKER :—The question is :

That Government be granted a sum not exceeding Rs. 52,49,200 under Demand No. XXI-Industries.

The motion was carried and the Grant was made.

[27th July 1955

## DEMAND No. XXIII—LABOUR INCLUDING FACTORIES.

---

THE HON. SRI G. LATCHANNA :—Sir, on the recommendation of the Governor, I beg to move :

That Government be granted a sum not exceeding Rs. 6,57,500 under Demand No. XXIII—Labour including Factories.

THE HON. Sri G. LATCHANNA :— అధ్యక్షా ! 23 వ నంబరు డిమాండుక్రింద 6,57,500 రూపాయలపద్దును యీ శాసనసభ ఆమోదాన్ని పొందడానికి ప్రవేశ పెట్టుతున్నాను. ఈ Demand ను ప్రవేశ పెట్టుతూ గౌరవసభ్యులకు స్పష్టంగా దీనియొక్క వివరాలు క్లుప్తముగా మనవి చేస్తున్నాను. Labour Department కు సంబంధించిన Headquarters లో ఖర్చు పోతున్నది. రు. 2,03,000. జిల్లాలలో అవుతున్నది. 40,200 రూపాయలు. Industrial Tribunal క్రింద అవుతున్న ఖర్చు 16 వేల రూపాయలు. Factories కు సంబంధించినంతవరకు Inspector of Factories యొక్క జీత భత్యాలక్రింద 1,33,800 రూపాయలు Assistant Labour Inspectors జీత భత్యాలక్రింద 2,64,500 రూపాయలు ఖర్చుఅవుతున్నది. ఈ Demand లో కార్మికశాఖయొక్క పరిపాలనా విధానమును గురించి ప్రత్యేకముగా రాష్ట్రప్రభుత్వానికి ఒక స్వతంత్రవిధానము అనేది లేదు అనే సంగతి గౌరవనీయ సభ్యులందరికీ తెలిసినవిషయమే. కేంద్రప్రభుత్వము వారు అప్పుడప్పుడు అమలుపరుస్తూవుండే కార్మికులకు సంబంధించిన శాసనాలను అమలు పరుచడానికిగాను రాష్ట్రప్రభుత్వము సిబ్బందిని ఏర్పాటుచేసి ఆ శాసనాలలో ప్రత్యేకించిన సౌకర్యాలు ఆయా Factories లోను కర్మాగారాలలోను కార్మికులందరికికూడా లభ్యమయ్యేటట్లు జాగ్రత్తవహించడము రాష్ట్రప్రభుత్వ భాధ్యతలలో ప్రధానమైన విషయము. ఈ Department క్రింద ముఖ్యంగా అధికారములో వున్నవారు Labour Commissioner ఆయనకు Deputy Commissioner Deputy Chief Inspector of Factories యిద్దరు ఉద్యోగస్థులున్నారు. తరువాత జిల్లాలలో జిల్లా Labour officers, జిల్లా Factory Officers, Factory Act ప్రకారము ఆ యా factories లో వున్నటువంటి కార్మికుల సౌకర్యాలు సక్రమముగా జరుగుతూ వున్నాయా లేదా అని పరిశీలనచేస్తూ మన రాష్ట్రప్రభుత్వము చేసినటువంటి శాసనాలు Shop Employees Act క్రింద చూడదమైతే నేమి మరి Maternity కి సంబంధించిన చట్టమైతే నేమి వాటిని అమలుపరచే బాధ్యత వహిస్తూవుంటారు. Assistant Labour Inspector పూర్తిగా ఈ Shop Employees

27th July 1955] [SRI G. Latchanna

Act సక్రమముగా అమలు జరుగుతున్నదా లేదా అని పరిశీలనచేస్తున్న సంగతి మన సభ్యులందరికి తెలిసినటువంటి విషయమే. ఇందువలన యీ రాష్ట్రములో Factory Inspectors 5 గురు వున్నారు. Assistant Inspectors 57 మంది వున్నారు. నలుగురు Labour officers, ఒక Industrial Tribunal ద్వారా యీ కార్యక్రమమంతా రాష్ట్రములో జరుగుతున్నది అని మనవి చేస్తున్నాను. ముఖ్యంగా మనకు ఇప్పుడు వున్న చట్టాలలో ప్రధానమైనది, కేంద్ర ప్రభుత్వమువారు అమలం పించినది, Indian Trade Union Act 1926 వ సంవత్సరములో అమలులోనికి వచ్చింది. ఈ చట్టము Trade Unions అనేవి ఏర్పాటు చేసుకోడానికి కార్మికులకు వున్న హక్కులను స్పష్టపరుస్తూ ఆ Trade Union యొక్క న్యాయచట్టాలను సూత్రాలను విపులపరుస్తున్నది. దానిప్రకారము ఒక కర్మాగారములో గాని ఒక పరిశ్రమలోగాని పని చేస్తున్నటువంటివారు కనీసము ఏడుగురు అయినా వుంటే వారొక సంఘంగా ఏర్పడి register చేసుకోడానికి వారికి హక్కు ఏర్పడుతున్నది. అది యీ Trade Union Act లో ముఖ్యముగా వున్నటువంటి విషయమని మనవి చేస్తున్నాను. రెండవది Industrial Disputes Act 1947 లో అమలులోనికి వచ్చింది. దీనియొక్క ప్రధానమైన సంకల్పము ఏమిటంటే Factory యజమానులకు కార్మికులకు తగాయిదాలు వచ్చినప్పుడు అవి సామరస్యముగా పరిష్కారమవటానికి అవకాశములేని పరిస్థితులలో ఈ చట్టప్రకారము Industrial Tribunal ద్వారా జరిగిన విచారణయొక్క తీర్పు చట్టరీత్యా బాధ్యతా బంధనగా వుంటుంది. ఆ తీర్పును ఉల్లంఘించినవారిపై ప్రభుత్వము prosecution కూడా జరిపించి నడిపించేదానికి ఈ చట్టముద్వారా అవకాశాలున్నాయి అనికూడా సభ్యులకు తెలిసిన విషయమే.

5—00 p. m.

రెండవది Factory Act అనేది ముఖ్యంగా పదిమందికిగాని, అంతకంటె ఎక్కువగాని కూలీలచేత పనిచేయిస్తూయున్న పరిశ్రమలు ఆ Factory Act క్రింద గుర్తించబడుతున్నవి. ఆ Factory Act అనేది apply అయిన తరువాత దానిలో కార్మికులకు ఏవిధమైన సౌకర్యాలు ఉండాలనేది, ముఖ్యంగా ఈ Factory Act లో తెలియజేస్తూ ఉంటారు. దానిలో ముఖ్యమైనటువంటి విషయం 500 మంది కార్మికులుగాని, అంతకు మించిగాని factory లో పనిచేస్తూంటే అక్కడ కార్మికులయొక్క సౌకర్యాలను కనిపెట్టడానికి కంపెనీవారే ఒక welfare officer ను నియమించాలనే మాత్రంకూడా ఈ Factory Act ద్వారా అమలులోకి వచ్చిందనే సంగతి నేను ప్రత్యేకంగా మనవిచేయవలసిన పనిలేదు, తరువాత

Sri G. Latchanna] [27th July 1955

Madras Shops and Employment Act అనేది 1947 లో ఉమ్మడి Madras రాష్ట్రప్రభుత్వంచే చేయబడి అమలులోకి తేబడిన చట్టం. ఈ చట్టం ప్రకారంగా దుకాణావిూదే కాకుండా, సినిమాలోనూ, Coffee Hotel లోనూ కూడా పనిచేస్తున్నవారికి రోజుకు 8 గంటలకంటే ఎక్కువ పనిచేయకూడదని, వారికి కూడా జీతాలతోపైన సెలవులు, తదితర సౌకర్యాలూ ఉండవలెననే విధానం అమలులోకి ఈ చట్టంద్వారా వచ్చింది. దాన్ని పరిశీలన చేసుకోడానికికూడా ప్రభుత్వం ప్రత్యేకంగా సిబ్బందిని ఏర్పాటుచేసి పనిచేస్తోంది. మూడవది Madras Maternity Benefit Act. ఇది 1934 లోనే మన ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో ఉండగా అమలులోకి తెచ్చినచట్టం. ఇందులోయున్న ప్రధానవిషయం ముఖ్యంగా గర్భవతియైన స్త్రీకి, ప్రసవసమయానికి మూడువారాలు ముందు, ప్రసవమైన తరువాత 4 వారాలవరకూ, జీతంవిూద ఆమెకు విధిగా సెలవుఇవ్వాలనేది. Minimum Wages Act అనేది 1948 లో కేంద్రప్రభుత్వం అమలులోకి తెచ్చింది. కొన్నికొన్ని పరిశ్రమలలో కనీసపు వేతనాలు నిర్ణయంచేస్తేగాని Company అధికార్లు యీ దేశంలోయున్న నిరుద్యోగసమస్యను ఆధారంగా తీసుకుని కార్మికులను తక్కువవేతనంతో ఎక్కువ శ్రమ కల్గించే అవకాశం కలుగుతుందని కేంద్రప్రభుత్వం గుర్తించి అటువంటి అవకాశం లేకుండా చేయుటకుగాను ఈ Minimum Wages Act అనేది 1949 లో ఏర్పాటు చేశారు. దానిప్రకారం మనరాష్ట్రానికి సంబంధించి నంతవరకూ వ్యవసాయ కార్మికులకు సంబంధించి 5 జిల్లాలలో 14 గ్రామాలలో minimum వేతనాలు అనేవి నిర్ణయించడం 1954 December లో జరిగింది. దానిని ఏవిధంగా ఎంతవరకూ సంతృప్తికరంగా అమలులో యున్నది, ఇది ఎంతవరకూ అభివృద్ధి చెయ్యాలనే విషయం ఇప్పుడు ప్రభుత్వ ఆలోచనలో యున్నది. త్వరలోనే దానివిూద ఒకనిర్ణయానికి రాగలరని మనవిచేస్తున్నాను తరువాత Employers State Insurance Act అనేది, 1948 లో కేంద్రప్రభుత్వంవారు అమలులోకి తెచ్చారు. ఈ Employers State Insurance Act ప్రకారంగా పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికులకు ఏమైనా ప్రమాదకరమైన జబ్బులు వచ్చినప్పుడు లేదా ఇతరత్రా మరేమైనా జబ్బులు కల్గినప్పుడు ఉద్యోగాలు పోయే సందర్భంలోనూ వారి జీవితానికి కొంత రక్షణ కల్గించడానికిగాను విధిగా Insurance విధానం ఒకటి ముఖ్యంగా వారికి ఉండాలని ఈ Employees State Insurance Scheme అనేది అమలులో పెట్టడానికి కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. ఈ యొక్క Insurance Scheme అమలు చెయ్యడానికిగాను [illegible] Employees State Insurance

Corporation అనే ఒక . సంస్థనుకూడా నిర్మించవలసివున్నది. అది ప్రతి రాష్ట్రానికీ ప్రతి ప్రాంతానికీ ఒక కేంద్రం అనేది ఏర్పాటయింది. ఇప్పుడు Regional Insurance Corporation Office మదరాసులో ఆంధ్రా, మదరాసు తిరువాన్కూరు మున్నగు రాష్ట్రాలను సంబంధించి ఒక కార్యాలయం ఏర్పాటుచేసి యున్నారు. ఈ scheme ను అనుసరించి ఇప్పుడు మన రాష్ట్రప్రభుత్వం ఏడు కేంద్రాలలో ఈ Insurance scheme ను అమలు పరుచుటకు తీర్మానించడమైనది. ఈయొక్క కార్యక్రమం October 7వ తేదీనుండి ప్రారంభించడానికికూడా ఇటీవలనే ప్రభుత్వం ఒక నిర్ణయానికి వచ్చింది. దీనివల్ల మొట్టమొదట 7 ప్రాంతాలలో చేయాలి అనే ఆలోచనతో అదికూడ ముఖ్యంగా ఎక్కువగా కార్మికులున్నచోట ముందు ప్రారంభించి, అది అభివృద్ధిపరచుకొని రాష్ట్ర వ్యాప్తంగా దాన్ని పెంచాలని ప్రభుత్వం ఒక అభిప్రాయానికి వచ్చిందని మనవి చేస్తున్నాను. అది కాకుండా మనకు రాష్ట్రంలో labour కు సంబంధించి Workmen's Compensation Act అనేది ఉన్నది. అకస్మాత్తుగా ఒక worker కు ఏదైనా కష్టమో, నష్టమో కల్గినప్పుడు ఆ కష్టానికీ నష్టానికీ బాధ్యులైన company వారు దానికి నష్టపరిహారం ఇవ్వాలని, ఇచ్చే విధానాన్ని తెలియజేసే చట్టం అది. Employment of Children Act అని ఒకటి ఉన్నది. అంటే పసిబిడ్డలు, చదువు సంధ్యలు నేర్చుకోడానికి అవకాశంలేక అభివృద్ధికి అవకాశం లేనిరీతిగాని వారి నిర్బంధంగా పనులలోకి పంపించడమనేది అది సంఘానికినష్టం కలిగిస్తుందన్న మాత్రంపైన ఏర్పాటుచేయబడిన చట్టం ఇది. Industrial Employment Act ఉన్నది. తరువాత Plantation Labour Act ఉన్నది కాని, అది మనకు సంబంధించలేదు. Employees Provident Fund Act ఒకటి యున్నది. ఈ విధంగా చట్టాలు కార్మికులయొక్క ప్రాథమిక హక్కులను కాపాడుతూ వారి ఆర్థికసాంఘిక అభివృద్ధికి ఉపయోగపడేదానికిగాను కేంద్ర ప్రభుత్వంవారు అనేక చట్టాలు చేసియున్నారు ఆ సంగతి నేను వీటికి మనవిచేయవలసిన పనిలేదు. ముఖ్యంగా మన రాష్ట్రంలో ఇప్పుడు సుమారుగా చిన్నవీ పెద్దవీ అన్నీ లెక్కపెట్టుకుంటే మూడువేల Factories ఉన్నాయి. ఈ మూడువేల Factories లో కొంత ఎక్కువ జనాభా కల్గినటువంటి Factory లు అని చెప్పుకోడానికి వీలైనవి Tobacco Rice, Groundnut, వీటికి సంబంధించినవి. ఈ Factory లు ఎక్కువమందికి పని కల్పిస్తున్నాయని చెప్పుకునే అవకాశం కల్గుతోంది కాని ఇవన్నీ seasonal Factories కాబట్టి సంవత్సరం పొడుగునా ఈ కార్మికులందరికీ పనికల్పించే విధానంగాని అవకాశంగాని ఈ factory లలో లేనందువల్ల అనేకమంది కార్మికులకు సంవత్సరంలో కొన్ని రోజులే పనిచేసుకునే అవకాశంవుంది. మిగతారోజులలో వారు ఖాళీగా

వుండవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఈ కార్మికులందరకుకూడా న్యాయంగా ధర్మంగా వారికి ఇవ్వవలసి నటువంటి కూలిని, వారి వేతనాన్ని అభివృద్ధి పరిచే దానికిగాను ఈ కార్మిక చట్టాలు ప్రధానంగా సంకల్పించబడినవి అనే సంగతి నేను మనవిచేయవలసిన పనిలేదు. ఐతే అది. ఎట్లా సాధ్యమవుతుందనేది ప్రశ్న. చిన్నచిన్న పరిశ్రమలు మన రాష్ట్రంలో యున్నవి. ఇప్పుడు నేను మనవిచేసిన ఈ మూడుకేలలో 100 కి 80 వరకూ కూడా చాలా చిన్నచిన్న పరిశ్రమలు. పెద్దవి ఉన్నాయంటే ఎక్కడో ఒకటి రెండు, ఒక ship yard లేక మరి ఒకటి రెండు cement factory లు, ఇల్లాంటి 4, 5 factory లను మినహాయిస్తే మిగతావన్నీ seasonal factory లుగా ఉన్నాయి. బాగా organize ఐనటువంటి industries లో కార్మికులు తమ సంస్థలద్వారా తమయొక్క సౌకర్యాలను గురించి అధిక వేతనాలను గురించీ వారు కృషిచేసుకోగల్గుతూ యున్నారు. మరి చిన్నచిన్న పరిశ్రమలున్నచోట వారి మీద అక్కడ పనిచేస్తూయున్న కార్మికులకు ఈ అవకాశం లభ్యమయ్యేదానికి తగిన సావకాశాలు లేకుండా పోతున్నాయనే సంగతి నేను ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. అక్కడున్నటువంటి కార్మికులు ఏదైనా మా కిటువంటి కష్టములున్నవి, ఈ కష్టములు నివారణ ఐతేకాని మేము పనిచేయలేమని చెప్పే పరిస్థితి వచ్చేసరికి, సరే మీరు ఆ మాటలు ఎప్పుడంటారు మేము దేముడికి దణ్ణం పెడు తున్నామని, తాళాలు వేసుకుని ఇంట్లో కూర్చునే పరిస్థితికివచ్చి ఆ చిన్న చిన్న పరిశ్రమలవాళ్ళు అంతాకూడా ఉండే అవకాశాలు కల్గుతున్నాయి. ఇది మన ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మనం అభివృద్ధి చేసుకోగల పరిశ్రమలద్వారా అధికంగా ఎక్కువమందికి ఉద్యోగాలు కల్పించుకుని తద్వారా వారి కందరికీ అధిక సౌకర్యాలు కల్పించడమనే విధానంకూడా మనం పరిశీలించవలసియున్నది. ఇంతవఱకూ Labour Department కు సంబంధించినంతవఱకూ పనిచేస్తూ యున్న కూలివానియొక్క కష్టసుఖాలు పరిశీలించడం అనే పద్ధతి ప్రధానంగా Labour Department ద్వారా జరుగుతున్నదని సభ్యులంతా గమనించి యుంటారని నా విశ్వాసం. పనిలేనివారికికూడా పని కల్పించే బాధ్యత వహించి దానికి తగిన కార్యక్రమంచేస్తే బాగుండుననే విషయం ప్రభుత్వ పరిశీలనలో యున్నది. దానికి సహకారిగా ముఖ్యంగా ఈ నాడు కేంద్రప్రభుత్వం వారు తమ Employmont Exchanges అనేవి ఏ రాష్ట్రంలో ఉన్నటువంటివి ఆరాష్ట్రప్రభుత్వం వారి Labour Department అజమాయిషీ క్రిందనే వాటిని నిర్వహించడం మంచిదని వారు ఏర్పాటుచేసిన committee వారు విచారణచేసి సలహా ఇవ్వడం ఆ సలహాను కేంద్రప్రభుత్వంవారు ఆమోదిం

27th July 1955] [SRI G. Latchanna

చడంకూడా జరిగింది. ఆ నిర్ణయాన్ని అనుసరించి వీలైనంత త్వరలో ఈ Employment Exchanges కూడా Labour Department వారియొక్క పరిపాలన క్రింద తీసుకోవడం అనే కార్యక్రమాన్ని గురించి ఇప్పుడు కేంద్రప్రభుత్వానికి రాష్ట్రప్రభుత్వానికీ ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి. అందువల్ల అదిపూర్తి అయి ఒక నిర్ణయానికి వచ్చినవెంటనే ఇప్పుడున్న Labour Department పనులు సంపాదించుకున్న కార్మికుల సౌకర్యాల పరిశీలనే కాకుండా పనులు లేనటువంటి వ్యవసాయ కార్మికులకుగాని ఏ ఇతర కార్మికులకుగాని వారికి పనులు కల్పించే మార్గాలుకూడా పరిశీలించవలసిన బాధ్యతకూడా Labour Department వహించవలసిన పరిస్థితి వస్తుందని మనవిచేస్తున్నాను. మరి కొంతమంది మిత్రులు కొన్ని cut motions ఇచ్చారు. అవి పరిశీలన చేశాం. తప్పకుండా సాధ్యమైనంతవరకూ ఈ కార్మికు లందరికీకూడా నేను మనవిచేసినట్లుగా పని దొరికిన కార్మికులకంటె పనిలేని కార్మికులకుకూడా పని కల్పించేవిధానం అమలు పర్చాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం ఈ విధానం పరిశీలిస్తూ యున్నది. వీరందరికీ కూడా మనకు ఎక్కువ కాలం లేదంటున్నారు. సభ్యులు వీలైనంత త్వరలో ఈ demand ను ఏకగ్రీవంగా ఆమోదించవలసినదని కోరుతూ విరమిస్తున్నాను.

MR. SPEAKER :—The motion before the House is :

"That Government be granted a sum not exceeding Rs. 6,57,500 under Demand No. XXIII—Labour including Factories."

301—

453 SRI P. SUNDARAYYA:—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 6,57,500
for Labour including Factories by ... Rs. 100

(కార్మికులకు తగిన సౌకర్యాలు కల్గించడానికి, వారిజీతాలు పెంపొందించడానికి తగినరీతిగా కృషిచేయనందులకు.)

302—

(159) SRI G. YELLAMANDA REDDI :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 6,57,500
for Labour including Factories by ... Rs. 100

(ప్రభుత్వముయొక్క జి. ఓ. యమ్. యస్. నం. 2820 జి. ఓ. యమ్. యస్. నం. 600 మోటారు వెహికల్సుకు మోటారు కార్మికులకు సంబంధించినది అమలు జరుపబడని విషయము చర్చించుటకు.)

305—(241)

SRI G. NAGESWARA RAO :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 6,57,500
for Labour including Factories by ... Rs 100

(వ్యవసాయ కూలీలకొరకు నిర్ణయించిన 0-8-0 వేతనాన్ని వెనుకబడిన 14 గ్రామాల్లో మాత్రమే అమలుజరిపి డెల్టాప్రాంతాలలో వెంటనే అమలు జరపక పోవడము గురించి, తాలూకాల్లో వేజి బోర్డ్సును నియమించే విషయంలోను ప్రభుత్వవిధానాన్ని చర్చించేందుకు.)

307—

(282) SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 6,57,500
for Labour including Factories by ... Rs. 100

1. మోటారుడ్రైవరు కండక్టరు లైసెన్సుల్లో కండక్టరు యిబ్బందులు సరిచేయుటకు.

2. The decision of the conciliation of the Labour Officer must be made an obligation upon the employee.

3. The lorry drivers and conductors must also be entitled for the Wages Payment Act provisions.

4. To discuss the policy

308—

(330) SRI P. SATYANARAYANA :—Sir, I beg tomove :

To reduce the allotment of Rs. 6,57,500
for Labour including Factories by ... Rs. 100

2. సామర్లకోట సుగర్ ఫ్యాక్టరీలో శేషవ లైజేషన్ చేసి వందలకొలది పని వారిని తీసివేస్తున్న విషయాన్ని ప్రభుత్వదృష్టికి తెచ్చుటకు.

27th July 1955] [SRI P. Satyanarayana

309—

(354) SRI S. VEMAYYA :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 6,57,500
for Labour including Factories by ... Rs. 100

(ఫ్యాక్టరీలలో పనిచేయు కార్మికులకు విద్య, ఆరోగ్య గృహవసతులు కల్గించుటకు ప్రభుత్వం సరియైన శ్రద్ధ వహించనందుకు.)

Mr. SPEAKER:—The main Demand and the cut motions are before the House for discussion.

5-00 P. M.

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, కార్మికసమస్యను గురించి ప్రభుత్వము 6,57,500 రూపాయలు మాత్రమే కోరినా, ఇది చాలా ముఖ్యమైనటువంటి డిమాండు అని అంటున్నాను. అందుచేత మనము ఇక్కడ అనుకొన్న రెండు గంటలు సరిపోదు. అయినప్పటికీ అనేక యితరడిమాండ్లమీద చర్చించవలసియున్నది కాబట్టి ప్రస్తుతమిదీనికి రెండుగంటలే చాలును. అసలు కార్మికులయొక్క పరిస్థితులను బాగుచేయడానికిగాను ప్రభుత్వము ఎంత అశ్రద్ధ చూపుచున్నదో దీనిని కేటాయించిన స్వల్పమొత్తాన్నిబట్టి తెలుసుకోవచ్చును. ఆంధ్రరాష్ట్రములో ఉన్న కార్మికులకు సరియైన వసతులు కలిపించాలన్నా, ప్రభుత్వము చేసినటువంటి చట్టాలు సరిగా అమలు జరపాలన్నా ఈ 6,57,500 రూపాయలలో ఏరీతిగా చేయగలదో అర్థంకాదు. ఈ విషయంలో ప్రభుత్వవిధానం ఎంత అసంతృప్తికరంగా ఉన్నదో తెలియజేయడానికిగాను కొన్ని వివరాలు మీముందు పెడుతున్నాను. కాని demand చర్చించేటప్పుడు మన సాంప్రదాయాన్నిబట్టి మనం డిమాండుయొక్క మొత్తమును ఎక్కువ చేయుటకు వీలులేదు. అధికంగా రూల్సులో లేదు. Constitution లో కూడా కొంత మార్పుచేయవలసియున్నది. కనుక గవర్నరుగారి అనుమతిలేనిదే ఈ finance కు సంబంధించి కనీసం మన శాసనసభలో మాట్లాడడానికికూడ అవకాశంలేదు. అందువల్ల మీరు వచ్చేపర్యాయము 6,57,500 కాకుండా 60 లక్షలకు ఈ డిమాండు తీసుకొనివస్తే కార్మికుల వసతులకొరకు, అప్పుడు మేము ఇంకా చాలదని బలపరుస్తాము. మొట్టమొదట వారికి పనికావాలి, Security of service కావాలి. పనిలేనివారికి పనికావాలి. దానికి ప్రభుత్వం ఏమైనా ఏర్పాట్లుచేస్తుందా అంటే లేదు. Exchanges ను తీసుకొంటున్నామని చెప్పడంవల్ల వచ్చే లాభము ఏమి? 1953 Factory Inspection Report లో ఆ సంవత్సరానికి (జనవరి-డిసెంబరు 1953) 63,872 మంది మాకు ఉద్యోగాలు కావాలని ఆంధ్ర

SRI P. Sundarayya] [27th July 1955

రాష్ట్రంలో దరఖాస్తులు పెట్టుకున్నారని ఉన్నది. Employment Exchange లో 63,872 మంది క్రొత్తగా application లు పెట్టుకొంటే, దానిలో 4,569 మందికి మాత్రము ఉద్యోగాలు యిచ్చారు. మిగిలిన 59 వేలమందికి ఉద్యోగాలులేవు పొమ్మన్నారు అన్నమాట. అందుచేత ఈ Exchange ను పెట్టుకొన్నందువల్ల, service guarantee ఎక్కడ ఉన్నది ? మన ఆంధ్రరాష్ట్రము technical గా వెనుకబడి ఉన్నది. Technical people కావాలి అని అంటున్నారు. కాని 5,588 మంది technical personnel Exchanges లో applications పెట్టుకొంటే అందులో 526 మందికిమాత్రమే ఉద్యోగాలు చూపించారు. మిగిలిన 50.0 మందికి ఉద్యోగాలు లేవు పొమ్మనిచెప్పారు. అంతేకాదు 1951 జనవరిలో, మీకు ఉద్యోగాలులేవు పొమ్మని చెప్పేటప్పటికి ఇంకా ఆశతో ఆ Exchanges register ను అంటిపెట్టుకొని 12,495 మంది పడిగాపులు గాచుతూఉంటే, 1953 ఆఖరికి 27,590 మంది మాకు ఉద్యోగాలు లేవనిచెప్పి ఆ register మీదనే అంటిపెట్టుకొని కూర్చొన్నారు. 1954 సంవత్సరం పరిస్థితి నాకు తెలియదు. మంత్రిగారు ఆ లెక్కలేమీ చెప్పలేదు. ప్రభుత్వందగ్గర ఆ లెక్కలుంటే, ఇస్తే బాగుంటుంది. ముందుముందుకు ఉపయోగపడుతుంది. కనుక, దీనినిబట్టి ఆంధ్రరాష్ట్రములో సంవత్సరాలు గడిచేకొలది నిరుద్యోగము ప్రబలిపోతున్నదని తెలుస్తున్నది. గ్రామసీమలలో వ్యవసాయ కూలీలకు నిరుద్యోగమేకాదు, పారిశ్రామికులలోకూడ నిరుద్యోగముప్రబలుతున్నది. Technical staff లోకూడ నిరుద్యోగము సంవత్సరాలు గడిచేకొద్దీ, ఎక్కువ అవుతుందిగాని తక్కువ కాదు. వారికి పనిచూపించడానికి మేము ప్రయత్నం చేస్తున్నామని అంటున్నారు. మన ప్రయత్నాలన్నీకూడ వెనుకకు పోతున్నట్లు కన్పిస్తున్నది. ఈ సమస్య పరిష్కారానికి ఒకఅడుగైనా ముందుకు వచ్చినట్లు కన్పించడంలేదు. పోనీ ఉన్న వాళ్లకైనా, పనిలోనుంచి తీసివేయకుండా ఉండేందుకు guarantee గా ఏమైనా హక్కులున్నాయా అంటే, ఏవో చట్టాలు చూపిస్తారు. Retrench చేస్తే వారికి కొన్ని పరిహారాలు ఇవ్వాలని, కారణం లేనిదే తొలగించడానికి వీలులేదని, ఈవిధంగా rules, చట్టాలు, ఉన్నాయని చెప్పతున్నారు. కేవలం కాగితాలు, చట్టాలు చూచి సంతృప్తిపడమంటె కాదు. ఆచరణలో ఏమి జరుగుతున్నదో చూడాలి. ఈ సందర్భంలో కొన్నికొన్ని ఉదాహరణలు మంత్రిగారి దృష్టికి తీసుకురాదలచాను. సామర్లకోట sugar factory, British management క్రింద ఉన్నటువంటిది. దాన్ని అభివృద్ధిచేసేకొరకు Financing Corporation దగ్గరనుంచి పదిలక్షల రూపాయలు అప్పుతీసుకొని దానిని అభివృద్ధి పరచారు. ఈ అభివృద్ధి చాలదని అనుకుంటాను. దాంట్లో మూడువందలమంది

workers కు పనిలేకుండా పోయింది. అదే రీతిగా Nellore Ceramics లో notice ఇచ్చి కూర్చొన్నారు. 80 మందికి ఉద్యోగాలు పోయే స్థితిలో ఉన్నది. తాడేపల్లిలో East Coast Food Products factory ని వారు మూసివేసి కూర్చొన్నారు. రెండువందల కార్మికులకు పనిలేకుండా పోయింది. ఇక, గనులు చూచినట్లైతే, Manganese, Mica గనులు చాలా గడ్డు స్థితిలో ఉన్నాయి. అక్కడ వేలకొలది కార్మికులు పనిలేకుండా చస్తున్నారనే సంగతి ప్రభుత్వానికి తెలుసును. దాన్ని గురించి ఈ కార్మికులకు తిరిగి పని కల్పించడానికిగాను ఆ Manganese పరిశ్రమనుగాని, Mica పరిశ్రమనుగాని అభివృద్ధిచేయుటకు ఏమైన చర్య తీసుకొన్నారా అంటే, ఆ వివరా లేవి చెప్పలేదు. వారిని Employment Exchanges తీసుకొంటె ఏమి లాభం లేదు. ఆ రిజిష్టరులో పేర్లున్నంత మాత్రాన సంతృప్తిపడడానికి వీలులేదు.

పోనీ ప్రైవేటు ఉద్యోగాల సంగతి వదిలివేయండి. గవర్నమెంటు డిపార్టుమెంట్సులో గవర్నమెంటు సాగిస్తున్న పరిశ్రమలలో కొన్నికొన్ని తీసుకోండి. విద్యుచ్ఛక్తి డిపార్టుమెంటు తీసుకొండి. లేదా హైవేసు డిపార్టుమెంటు తీసుకోండి. ఈ డిపార్టుమెంట్సులో పనిచేస్తున్న పారిశ్రామికులకు ఏమైనా గ్యారంటీ యిస్తున్నారా అంటే, (వీటిలోని వివరాలు మీ దృష్టికి తెస్తున్నాను), కొన్ని టెంపరరీ ఉద్యోగాలు అని చెప్పి నందున వారికి పని గ్యారంటీ లేకుండా పోతున్నది. పదిఏండ్లు 20 వారికిగూడా పనికి గ్యారంటీ లేకుండా యింకా టెంపరరీ అనే చెప్పడము జరుగు ఏండ్లు సర్వీసుచేసినతున్నది అంటె దీని అర్థము వారిని టెంపరరీగానే పనికి పెట్టు కున్నారన్నమాట. ఎన్నాళ్లుచూచినా తాత్కాలికము అంటే, యిక వారికి గ్యారంటీ అనేది ఎక్కడ కనబడడము లేదు. ఈ విధంగా వేలకొలది పారిశ్రామికులను 10 ఏండ్లు, 20 ఏండ్లు టెంపరరీగానే వుంటున్నారు. హైవేసువారుకూడా టెంపరరీ లెక్కలలో వేసేస్తువస్తున్నారు. ఒక్క కృష్ణాజిల్లాలో 60 మందిని అయిదు ఏండ్లు, పదిఏండ్లు, సర్వీసుచేసినవారిని టెంపరరీ క్రిందనే వుంచినట్లు లెక్కలవల్ల కనబడు తున్నది. హైవేసు డిపార్టుమెంటులో గుమాస్తాలు ఆఫీసు సూపర్వైజర్లును గురించితప్ప, మిగతా రోజురోజు పనిచేయవలసిన వారందరు వర్కర్లతో సహా టెంపరరీ పోస్టుల లోనే వుంచారు. వారినిగురించిన లెక్కలు ఏవిగూడాలేవు. తరువాత Electricity Department తీసుకొండి. ఆంధ్రదేశము పారిశ్రామికంగా అభివృద్ధి కావాలని మనము అనుకుంటున్నప్పుడు యీ విద్యుచ్ఛక్తి శాఖలలో పని చేసేవారికి వుద్యోగము గ్యారంటీ లేకపోతే పనిచేసేవారుమాత్రం ఏ విధంగా పని వుత్సాహములో చేస్తారు? దేశానికి Electricity Department అవసరమున్నదని ప్రభుత్వానికి తెలియదా?

[Sri P. Sundarayya] [27th July 1955

అందులో పనిచేసేవారిని టెంపరరీ అని చెప్పితే ఎట్లా? ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మరి కొన్ని కోట్లు ఖర్చుచేయ దలచుకున్నారు. ఇటువంటి ముఖ్యమైన శాఖలో నామినల్ మస్టరురోలు అనే పేరుతో అయిదువేలమందిచేత పనిచేయించుతున్నారు. వారందరుని టెంపొరరీ అనిగాని, పర్మనెంటు అనిగాని కాకుండా ఎప్పుడు పడితే అప్పుడు వూడపెరకటానికి వీలువుండేటట్లుగా పనులు చేయించుకుంటున్నారు. ఎన్ని సంవత్సరాలు చూచినా, 3, 4 సంవత్సరాలు అయినాగూడా యింకావారికి నామినల్ మస్టరురోలు అనిపెట్టి పనులు జరుపుతున్నారు. ఈ Nominal Muster roll లోనివారు కాకుండా workers సుమారు 4,500 మంది వుంటున్నారు. ఇందులో బహుశః ఏ 500 మందో పర్మనెంటువారు వుంటారు అనుకుంటాను. అంటే నూటికి పదోవంతుమాత్రం పర్మనెంటు, 90 వంతులు టెంపరరీ అంటే గ్యారంటీ లేని పని అన్నమాట. వారికి seniority అనేది లేదు. ఎప్పుడు పడితే అప్పుడు తీసివేయవచ్చు. Increments యివ్వడము వుండదు. ప్రతి సంవత్సరము ఒకటిగాని, రెండుగాని మూడుగాని రూపాయిలు యింక్రిమెంట్లు యివ్వవలసివుంటే, అది యివ్వబడకుండా పోతున్నది. Increments యిస్తే, వారి జీవనానికి తోడ్పడుతుంది గదా! ప్రభుత్వము వారికి జీతాలు పెంపకము చేయడములేదు. Temporary వారికి State Insurance Scheme apply కాదు. పారిశ్రామికులనుగాని, ఉద్యోగస్థులనుగాని టెంపరరీగానే పనిచేయించుకుంటే, వారందరు ప్రభుత్వముయొక్క దయ దాక్షిణ్యాలలో వుంచుకోటానికి చేస్తున్నట్లు అర్థ మవుతున్నది. పనివాళ్లకు సాధారణముగా యిచ్చే జీతము నెలకు 40 రూపాయలో, 50 రూపాయలో వుంటుంది. ఈ చిన్న జీతముతో వాళ్ల జీవితము ఏవిధంగా గడుస్తుంది? వుద్యోగము చూద్దామంటే, దానికి గ్యారంటీ అనేది లేదు. పర్మనెంటుగా వుంటుంది అని స్థైర్యముగా వుండామా అనుకుంటే, అది టెంపరరీ వుద్యోగము అని అంటారు. ఈ విధంగా నిలకడలేని ఉద్యోగము. చాలీచాలని జీతమయిస్తూ, ఏరోజున తీసివేస్తారో అనే భావము, భయముతో ఉద్యోగములు చేయించుకుంటే, యిది ప్రభుత్వానికి న్యాయమేనా అని అడుగుతున్నాను. Electricity Department సంగతి చూస్తే దానిగురించి అనేక సంప్రదింపులు జరిగిన తరువాతకూడా అందులో పనిచేసేవాళ్లు ఏవో కొన్ని షరతులు అడిగితే, అందులో కొన్ని ప్రభుత్వము ఒప్పుకున్నది. అందులో రెండేళ్లు పనిచేస్తే వారందరిని పర్మనెంటువారుగా గుర్తిస్తామని అన్నారు. రెండేళ్లు పనిచేసినవారికి జూలై ఒకటవ తేదీనుంచి ఒక increment అయినా యిస్తామని అన్నారు. కాని ఆ సంతు యింతవరకు ప్రభుత్వము అమలు జరపలేదు. ఇది జరిగి యిప్పటికి రెండేళ్లు అయింది. పైగా పర్మనెంటు అన్నతరువాత దాని ఫలితంగా వచ్చే increments కూడా యింతవరకు యివ్వలేదు. ఒప్పందము జరిగింది,

పోయిన June నెలలో, జూన్ మాసమునకు రావలసిన జీతము, increment అంతా చేరి, July మొదటి తేదీన యిస్తామని చెప్పినప్పటికిని, ఇప్పటికీ July నెలలో 20 రోజులు గడచినవి. దాన్ని యింతవరకూ అమలుపరచలేదు. Chief Engineer గవర్నమెంటు ఉద్యోగస్తుడుగా వున్నాడు. అటువంటి ఆయన యూనియన్ ప్రతినిధులతో సంప్రదించి అంగీకరించిన షరతులు యింతవరకు అమలు జరుపలేదు.

ఇదేవిధంగా హాస్పిటల్ వర్కర్సు విషయము చూస్తే, అక్కడ కూడా టెంపరరీ వుద్యోగాలనే చెప్తున్నారు. P. W. D. workers విషయము చూస్తే, ఇంజనీరింగు శాఖలోని workers విషయముతప్ప construction శాఖకు సంబంధించిన వివరాలు యేమీ రావు. మొత్తముమీద ఇవన్నీ కూడా ఒక్కొక్కటి కొద్దిగా యిదే దామాషాలో వుంటున్నవి. కాబట్టి యింకా ఈ రకంగా చెప్పవలసుకుంటే, Industries విషయము అన్నీ తీసుకుంటే వేలకొలది లెఖలు యివ్వవచ్చు. అందుచేత ఉద్యోగము చూస్తేనా గ్యారంటీ లేదు. ప్రభుత్వోద్యోగులను చూస్తే, నూరుమంది పనిచేస్తూంటే, అందులో పదిమందో ఏ పర్మనెంటు తప్ప మిగతా 90 మందిన్నీ, casual అని, temporary అని ఈ విధంగా ఉద్యోగముమీద హక్కులేకుండా చేసే ఈ ప్రభుత్వము యొక్క పద్ధతి ఈ నాడు దేశపురోభివృద్ధికి దారితీసేది కాదని అంటున్నాను. ఇటువంటి విధానము కార్మిక అభ్యుదయ పంథా కాదు అని చెప్పవలసి వుంటుంది. మాకు పర్మనెంటు చేయండి, increments ఇవ్వండి, జీతాలు పెంచండి, తిండికి చాలడం లేదు అని మొరపెట్టుకుంటే, యిష్టములేనివారు వెళ్లిపోండి అంటారు. లేకపోతే, temporary కాబట్టి తీసివేస్తాము అని అంటారు. ఈ విధంగా జరుపుతూ యిష్టము లేనివారిని తీసివేయటానికి రకరకాల ప్రయత్నాలు చేస్తున్నారు.

ఇక పోతే Rice Mills విషయము తీసికోండి. Bezwada, Gudlavalleru Tadepalligudem వగైరా ప్రాంతాలు బియ్యము ఎక్కువగా దొరికే చోటు. అక్కడ బియ్యపు మిల్లులు పెద్దపెద్దవి వున్నవి. ఇవి సాధారణముగా పెద్దభూస్వాములవే. మిల్లు యాజమాన్యం మారినప్పుడల్లా పాతవాళ్లను తీసివేసి క్రొత్తవాళ్లను వారి ఇష్టము వచ్చినవారిని వేస్తామని అంటున్నారు. స్వంతదార్లు స్వంతముగా నడుపరు. ఈ మిల్లులు అద్దెలకు యిస్తారు. ఇక్కడ వుండే బియ్యపుమిల్లులలోగాని, నూనెమిల్లులలోగాని, యింకా ఏ మిల్లులలోనైనా సరే Technicians కావలసివుంటారు. వీరందరి విషయాలు విచారించటానికి ఒక కమిటీని వేయమంటే, వేయకుండా వున్నారు. ఒక్కొక్క మిల్లులో 10 మంది Technicians కావలసివుంటే ఏ ముగ్గురినో, నలుగురినో తీసుకొని వాళ్లచేత ఎక్కువకాలము పనులు చేయించుకుంటారు. Normal

working hours fix చేయరు. ఒక మనిషికి తగినంత పని యివ్వక, ఎక్కువ పని చేయిస్తారు. ఈ రకంగా అనేక సంఘటనలు యివ్వవచ్చు. ఇక కనీసవేతనాల సంగతికి వస్తే మునిసిపాలటీలవారు యిచ్చే కనీస వేతనము 36 రూపాయలు. ఈ 36 రూ. డియర్ నెస్ యాలవన్సుతో చేర్చి యిస్తున్నారు. అయితే ప్రభుత్వమువారు యిచ్చేది మాత్రే Dearness allowance, House Rent Allowance, అంతాచేర్చి 25 రూపాయలు యిస్తున్నారు. మునిసిపాలటీలవారు 36 రూపాయలు యిస్తూంటే, ప్రభుత్వము 25 రూపాయలు అన్నియలవన్సులుచేర్చి యివ్వడమనేది ఎంత సబబుగా వున్నదో చూడండి. పైగా ఈ విషయము కలెక్టరు విచారించి, కనీస వేతనము 25 రూపాయలుయిస్తూ Dearness allowance వేరుగా యివ్వమని recom-mend చేస్తే, ప్రభుత్వము ఆ recommendation ను పాటించి యివ్వలేదు. అలాగు యివ్వకపోవడము అంటే, దీనికి Collector గారి recommendation ప్రభుత్వముఎంత value చేస్తున్నది అని అడుగుతున్నారు. అలాంటి సందర్భములో కలెక్టరు recommendation కు value లేదన్నమాట.

ఇంతేకాదు mica కార్మికుల విషయము తీసుకోండి. అక్కడకూడా కార్మికులు బ్రతుకు సంపాదించుకునే దానికంటే, తక్కువే నిర్ణయము జరిగింది. పుగాకు విషయములో చూస్తే, దినకూలి 1-8-0 యివ్వాలని అన్నారు. కాని అది ఆచరణలోకి వచ్చేటప్పటికి 1-2-0, 1-4-0, 1-6-0 యిస్తున్నారు. కాని 1-8-0 యివ్వటానికి ప్రయత్నము జరగడములేదు.

కనీస వేతనాలసంగతికి చూస్తే, వుయ్యూరు సుగర్ ఫ్యాక్టరీ విషయము తీసుకొని చూడండి. అక్కడ కార్మికులకు కనీస వేతనముక్రింద యిచ్చేది 19 రూపాయలు. దీనికితోడు dearness allowance కొద్దిగా యిస్తే యివ్వవచ్చు.

అక్కడవున్న మొత్తము కార్మికులకు సంవత్సరానికి 2½ లక్షలయితే, అందులో పనిచేస్తూన్న Managing Director కు సంవత్సరానికి 3½ లక్షలు తీసుకుంటాడు. ఇంత మందికి చేర్చి 2½ లక్షలు అయితే అతను ఒక్కడే 3½ లక్షలు తీసుకుంటున్నప్పుడు ఇది ఎంత అన్యాయముగా ఉన్నదో ప్రభుత్వము గుర్తించాలి. సాధారణముగా ఆ ఫ్యాక్టరీలో సుమారు 1200 నుంచి 1500 మందిదాకా పనిచేస్తున్నప్పుడు ఫ్యాక్టరీ యజమానులు ఏదోరకంగా జీతాలనో, ఎలవెన్సులనో, మరొక విధంగానో అధికభాగము ఫ్యాక్టరీనుంచి తీసుకుంటున్నారని ప్రభుత్వముగుర్తించాలి. ఇటువంటి విధానము socialistic pattern of society కి తోడ్పడమిచ్చే విధానమేనా అని అడుగుతున్నాను. ఫ్యాక్టరీ యజమానులకు, కార్మి

కులకు సంబంధములేదని అంటారా? ఇటువంటి యాజమానులమీద తగినచర్య తీసుకోమని కేంద్ర ప్రభుత్వమును యీ ప్రభుత్వము ఎందుకు కోరదు?

తరువాత Road gang men, Avenue coolies వర్గాలవారికి ఈ మధ్యనే వారి జీతములో ఒక్కొక్కరికి 10% తగ్గించారు. జీపు డ్రైవర్లకు రు. 15 రు. 25 ల గ్రేడుకు తగ్గించారు. ఇంతవరకు యిస్తున్నది 25 రూపాయలు, 30 రూపాయలు. ఈ డ్రైవర్లకు యింత పెద్దజీతము యిచ్చేబదులు, ఆఫీసులలో పనిచేసే ప్యూన్లకు యిచ్చే జీతము యిచ్చి, యెందుకు వారిచేత యీ జీపులు నడిపించకూడదని అని ప్రభుత్వము ఉద్దేశించుచున్నది. ప్రభుత్వమువారు చెప్పేది ఏమిటంటే, మోటారు డ్రైవర్లకు నైపుణ్యము అవసరములేదు. డ్రైవర్లు చేసేపని ప్యూన్సుకూడా చేయగలరు. ప్యూను చేయవచ్చు. మరొకరు ఎవరైనా సామాన్యమనిషి బజారులో పొయ్యేవారుకూడా చేయవచ్చు అనేది ప్రభుత్వముయొక్క ఉద్దేశ్యమా? ఈ జీపు డ్రైవర్లకు యింతజీతము ఎందుకు ప్యూన్సజీతము తక్కువ కొట్టి, యింకొక peon ను ఎక్కువగా వేసుకోవచ్చుననే ఉద్దేశ్యముతో ప్రభుత్వము యీ కొత్తపద్ధతి ఎందుకు అవలంబిస్తున్నది? ఇంతవరకు ఈజీపు డ్రైవర్లకు ఎక్కువగా జీతాలు యిస్తూవుంటున్నప్పుడు, ఆ జీతాలను ప్రభుత్వము తగ్గించే కొత్తపద్ధతులు ఎందుకు అవలంబిస్తున్నది?

ఉద్యోగమా గ్యారంటీ లేదు. జీతాలా తక్కువ. పోనీ పని భారం తగ్గించారా అంటే అదీ లేదు. పని భారం పెరుగుతూనే ఉన్నది.

రైసు మిల్లుల సంగతి ఇదివరకే చెప్పాను. ఇంకా అనేకవిషయాలు వుదహారణకు చెప్పారు. కాని నేను దానికి వెనువెంటనే వెళ్ళలేను. కాలము చాలా తక్కువగా వున్నది. ఇంకా చాలా విషయాలు చెప్పాలి.

కార్మికులకు ఇళ్ల వసతి గురించి ఏమి ఏర్పాటుచేశారో ఈ రిపోర్టులో చదివితే ఉపోద్ఘాతంలో గవర్నమెంటు చేసిన ఆర్డరులో 10 ఫ్యాక్టరీలకు ఇళ్లవసతి కార్మికులకు కలుగజేశారని వున్నది. ఆంధ్రదేశంలో వేల ఫ్యాక్టరీలు వున్నాయని మంత్రిగారు ఇప్పుడే సెలవిచ్చారు. 1953 రిపోర్టులో 2573 ఫ్యాక్టరీలు పనిచేస్తున్నాయని చెప్పారు. ఈ 2573 లో 1900 ఫ్యాక్టరీలు మాత్రమే రిపోర్టులు పంపించాయి. ఎంత మంది అందులో పనిచేస్తున్నారో ఆ వివరాలతో పంపాయి, 607 ఫ్యాక్టరీలు పంపించ నిరాకరించాయి. దీనికి చర్య తీసుకుంటాము అంటున్నారు అనుకోండి. ఆ చర్య 3 రూపాయలనుంచి 4 వందల రూపాయలువరకూ జరిమానా వేశారు. 171 మంది మీద

SRI P. Sundarayya] [27th July 1955

కేసులు పెట్టారు. ఒక ఫ్యాక్టరీ యజమానికి 3 రూ॥లు జరిమానా వేస్తే అది ఒక జరిమానా ? ఫైను వేస్తే అవమానము అనుకునేటటువంటి ఫ్యాక్టరీ యజమానివున్నట్లైతే మీ రిపోర్టును కాగితముమీద లెక్కలు వేసి పంపిస్తాడు. అందుచేత 3 రూపాయలు జరిమానా ఎంత నిరూపయోగమో, ఎంత అర్ధరహితంగావున్నదో చూడండి. పోనీ 2573 ఫ్యాక్టరీలు 1953 సం॥లో వున్నాయని ఇప్పుడు మంత్రిగారు సెలవిచ్చారు. ఈ ఫ్యాక్టరీల్లో 10 ఫ్యాక్టరీలు మాత్రమే ఇళ్లవసతి ఏర్పాటు చేసినవని అంటున్నారు. ఇళ్లుకట్టితే 4 వంతు ఊరకే ఇస్తాము. ఇంకా 3 వ వంతు అప్పుగా తక్కువ వడ్డీకి ఇస్తామని కేంద్రప్రభుత్వం అంటున్నది. అలాంటప్పుడు ఇంకొక 3 వ వంతు మాత్రమే వీళ్లు స్వంతంగా పెట్టుకోవలసి వుంటుంది. దానిని తక్కువ వడ్డీకి తీసుకోవచ్చును. స్కీముకూడా వుపయోగించుకొని ఆ మూడవవంతు తన జేబులోనుంచి పెట్టాల్సి వస్తుందనే భయంతో పెట్టడము లేదు. తరువాత 10 యేండ్లకు అద్దెల క్రింద మనకు వసూలు చేసుకోవచ్చును. అలాంటి అవకాశము వున్నప్పటికికూడా తాను ఏ మాత్రము జేబులోంచి పెట్టుబడి పెట్టుకొనే దానికికూడా తయారు కాకుండా ఉన్నారు. 10 ఫ్యాక్టరీలు వున్నాయని అనుకొన్నాము. వాటిలో ఆంధ్ర సిమెంటు, కృష్ణా సిమెంటు, హిందూస్థాన్ షిఫ్‌యార్డు ఈ మూడు తప్ప మిగిలినవి అన్నీకూడా నిరుపయోగంగా వున్నాయి. సూపర్ వైజర్సుస్టాఫ్‌కు, వర్కర్సుకు ఇళ్లు కట్టించామని, దాంట్లోవున్నది. చదివేదానికి టైములేదు. కాని మంత్రిగారు చదువుతారు అనుకొంటాను. Appendix 323 వ పేజీ. ఇదికూడా రిపోర్టులో 10 ఫ్యాక్టరీల కార్మికులకు వసతి కల్పించిందని వ్రాసుకోవడము ఏ రకంగా న్యాయము అవుతుంది ? లేబరుకమీషనరు ఇకముందు రిపోర్టులు వ్రాసేప్పుడు ఒక ఇల్లు, 2 ఇళ్లు కట్టించారని వ్రాయకూడదు. కార్మికులకు అత్యధిక సంఖ్యాకులకు 700 మందికో 750 మందికి ఇళ్లు కట్టించినట్లుగా వ్రాయాలే కాని సూపర్ వైజరు స్టాఫ్‌కు కట్టించామని, ఇంకొకరికి ఎవరికో కట్టించామని ఈ రకంగా వ్రాస్తే అది అర్ధరహితంగా ఉంటుంది.

ప్రభుత్వం సంగతిమాస్తే రాజమండ్రిలోను, సిరమిక్ ఫ్యాక్టరీలోను రెండే మాకువున్నాయి, ఈ రెండింటిలో కట్టేదానికి ప్రణాళిక వేస్తున్నాము అన్నారు. కర్నూలులో రెండుయేండ్లుఅయిన తరువాత ఉద్యోగస్థులు A Type, B Type అని ఇండ్లుకట్టినాకూడా ఇంకా 600 మంది గుడారాలలో వుండాల్సివుంటే మిగిలిన కార్మికులకు కట్టలేదనిచెప్పి ప్రత్యేకంగా నేను విమర్శించడంలో వుపయోగము వుండదను కొంటాను. కాని ఇండ్లవసతి చాలా అసంతృప్తికరంగావున్నదనే సంగతి కనిపిస్తున్నది.

మెటర్నిటీ బెనిఫిటును గురించి మంత్రిగారు చెప్పారు. కనడానికి ముందు మూడు వారాలు, కన్నతరువాత 4 వారాలు, లేకపోతే కనేదానికి ముందు 4 వారాలు కన్న తరువాత 8 వారాలు శెలవువున్నదని చెప్పారు. 1955 సంIIలో ఎంతమందికి ఇచ్చారంటే (నేను నా లెఖ్కలు చెప్పడములేదు. గవర్నమెంటు లెఖ్కలే చెబుతున్నాను.) అంతా మొత్తం రు. 4000/- మాత్రము మెటర్నిటీ బెనిఫిట్ ఇచ్చామన్నారు. ఆంధ్ర ఫ్యాక్టరీలలో 37,000 మంది పని చేస్తున్నట్లువున్నది. అంటే 19000 ఫ్యాక్టరీలు మాత్రమే రిపోర్టులు పంపిచాయి. దానిలో పనిచేసే 37,000 మందిలో 17,000 మంది స్త్రీలు. 14 యేండ్లలోపల వున్న స్త్రీలు గాని బాలురు గాని ఎవరినికూడా పనిలో పెట్టుకోకూడదు. ఆ రకంగా ఎవరిని పెట్టుకోవడములేదనికూడా ఆ రిపోర్టులోవున్నది. ఏదో 300, 400 మందికి ఒక్కరు వున్నారు వాళ్లను తప్పితే పెట్టుకోవడము లేదన్నారు. 14 యేండ్లులోపల స్త్రీని అయినా పెట్టుకోవడంలేదు. పెట్టుకున్నవాళ్ళంతా దానికి మించినవాళ్ళే. అయితే కనవద్దు అనిచెప్పి ప్రచారము చేస్తున్నా ప్రజలు మీ మాట వినిపించుకోవడములేదు. బిడ్డలయందువున్న ప్రేమతో బిడ్డలు పెద్ద భాగ్యము అనుకొంటూ, కంటూనేవున్నారు. సంతోషంతోవున్నారు. ఎన్నిబాధలు పడుతున్నా బిడ్డల సంతోషముఅయినా సంపాదించుకొందామని వాళ్లు కంటూనేవున్నారు. వేలమంది స్త్రీలు పనిచేస్తున్నారు. మీరు 187 మందికి మెటర్నిటీ బెనిఫిటు ఇచ్చారు ఎందుకు అంటే మీ చట్టంలో రూల్సు దానికి వర్తించవు అంటారు. 240 రోజులు పని చేస్తున్న వారికి ఈ మెటర్నిటీ బెనిఫిటు వర్తిస్తుంది అని చెప్పారు. ఇతర ఫ్యాక్టరీలలో కన్నా టుబాకో ఫ్యాక్టరీలలో ఎక్కువమంది స్త్రీలు పని చేస్తున్నారు. కాని అవి సంవత్సరము పొడుగున పనిచేసే ఫ్యాక్టరీలుకావు కాబట్టి అవి ఎప్పుడు పనిచేసినా సంవత్సరములో 80, 90 రోజులుకన్నా ఎక్కువ పనిచేయవు. కాబట్టి వాళ్లకు ఆ Act వర్తించదు అంటున్నారు. నిజమే. All India Maternity Benefit Act ఆరకంగానే వుండవచ్చును. మద్రాసు బెనిఫిట్ యాక్టు ఆ రకంగా వుండవచ్చు. కాని అస్సాములో 150 రోజులకు తగ్గించి నట్లే మన ఆంధ్రరాష్ట్రములో ఎక్కువమంది స్త్రీలకు ఇది వర్తించేట్లుగా అన్ని దినాలకు ఎందుకు తగ్గించకూడదు? సంవత్సరమునకు, 75, 80 రోజులు పనిచేసి నప్పటికి కూడా వర్తింపజేస్తె గర్భవతులు వచ్చి పనిచేసుకొని పోతారు అంటే, ఆ రకంగా ఎవరూరారు. అయితే కనీసము 3 సంIIలు వరుసగా పనిచేసిన వాళ్లకు ఇవ్వాలని చెప్పారు. ఆ రకంగా మూడు సంవత్సరములు 200 రోజుల్లో 170

SRI F. Satyanarayana] [27th July 1955

రోజులో పనిచేసిన స్త్రీలకు అంతా కూడా, Act వర్తింపచేట్లు ఎందుకు ప్రభుత్వము చర్య తీసుకోకూడదు ? అది కేవలం మన రాష్ట్రప్రభుత్వము చేతుల్లో నే ఉన్నది. కేంద్ర ప్రభుత్వమువద్దకు పోవలసిన అవసరము లేదు. క్రాస్‌వర్డ్ పజిలు బిల్లుకు మాదిరిగా ఢిల్లీ ప్రభుత్వమువద్దకు దీనికోసంకు పోవలసిన అవసరము లేదు. కాని ఎందుకు అదిచేయరో అర్థము కావడము లేదు. చివరకుచేస్తామనే ఆలోచన వున్నదా అంటే అదికూడా కన్పించడము లేదు. ఉంటే మంత్రిగారు చెప్పి వుండేవారు.

స్త్రీలు పనిచేస్తున్నప్పుడు బిడ్డలను పోషించేదానికి వాళ్లకు ఏదో కొద్ది కొద్ది ఏర్పాటులు చేస్తున్నాము అని చెప్పారు. ప్రతి ఫ్యాక్టరీ దగ్గరజరిగేది ఏమిటంటే, స్త్రీలు తాము పనిచేసేచోటుకు దగ్గరలో పాత చీరెవ్రూయల కట్టుకొని పిల్లలను పండుకోబెట్టుకోవడము జరుగుతోంది. ఏడ్చినప్పుడు వెళ్లడం ఆ విధంగా జరుగు తోంది. ఈ రకంగా బిడ్డలను మనము పోషిస్తున్నాము. ఈ ఫ్యాక్టరీలలో ఎంత వరకు సౌకర్యాలు వున్నాయనే సంగతిలో ఫ్యాక్టరీల ఇన్‌స్పెక్టరుగారు ఇచ్చిన రిపోర్టును చదివితే తెలుస్తుంది. అంతా పూర్తిగా చదువక కొంచెము చదువుతాను.

ఫ్యాక్టరీలలో మురుగుపారుదల సౌకర్యములు అసంతృప్తికరంగా వున్నాయని వారు అంటున్నారు. పగలు ఎట్లాగో వెలుతురువుంటుంది కాబట్టి రాత్రిళ్లు సరియైన దీపాలు లేకుండా వున్నాయన్నారు. 1913 లో ఏలూరు మునిసిపాలిటీ చైర్మను ఈ ఫ్యాక్టరీలలో అంతా దుమ్ము, ఈ యంత్రాలు చేసే ధ్వని బయటవుండే ధ్వని ఇది అంతా కూడా నానాభీభత్సంగా వుంది, ఇది మంచిది కాదని చెప్పారు. ఆ రోజు, 1913 లో, ఏ స్థితి వుందో 1953 లో కూడా అదేస్థితి వుందని ఫ్యాక్టరీ ఇన్స్పెక్టరు గారు చెప్పారు. ఫ్యాక్టరీలలో వున్న వేడిని గురించి, ఫ్యాక్టరీలలో వేడివుంటే ఉత్పత్తికికూడా ఏ విధముగా నష్టమో ఆరోగ్యానికికూడా ఏవిధంగా నష్టమో ఫాక్టరీ ఇన్‌స్పెక్టరుగారు చెప్పారు. దానిని గురించి ఈ ఫ్యాక్టరీ యజమానులు ఏ విధంగా శ్రద్ధ పుచ్చుకోవడము లేదు.

ఇటువంటి స్థలములలో 37 వేలమంది పనిచేస్తున్నారు. ఆస్త్రీల బిడ్డలుకూడా ఆ ఫ్యాక్టరీలలోనే చిన్నవయస్సులోనే వుండడముఅంటే మన భావిసంతానాన్ని ఏ రకంగా అభివృద్ధికి తీసుకువస్తున్నామో మంత్రివర్గం ఒక పర్యాయము ఆలోచిస్తా రని నేను ఆశిస్తున్నాను.

ఆంధ్రరాష్ట్రములో ప్రావిడెంటు ఫండు compulsory గా ఇంకా చేయలేదు. ఇప్పుడు సుమారు 4, 5 ఫాక్టరీలలో తప్ప మిగిలిన

చోట్ల ప్రావిడెంటు ఫండు సరిగా ఇవ్వడములేదు. ఉదా:—I. L. T. D. Company, Andhra Cement, Krishna Cement Factory లో అమలు జరుపుచున్నవి. గవర్నమెంటు ఆఫ్ ఇండియా ప్రావిడెంటు ఫండునుగురించి నేను చెప్పడములేదు. ప్రయివేటు ఇండస్ట్రీలను గురించి నేను చెబుతున్నాను. ప్రభుత్వ ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికుల ప్రావిడెంటు ఫండు స్కీము గురించి తీసుకున్నట్లయితే అవిఅయినా సక్రమముగా చేశారా అంటే ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటు, పి. డబ్ల్యు. డిపార్టుమెంటు హైవేస్ డిపార్టుమెంటు వీటన్నింటిలో చాలామందిని తీసివేయడమువల్ల ఈ ప్రావిడెంటుఫండు స్కీము వాళ్ళకు వర్తించకుండా పోవు చున్నది.

కనీసము రైల్వేలోమాదిరిగా మీరు పర్మనెంటు చేసేదానికోసం వెంటనే ఒప్పుకోనకపోయినా చట్టాలు, రూల్సు ఏమైనా మార్పుచేయాలని ఒకశాసనము తీసుకురండి. రైల్వేలో gate way men కు రు 75 లు యిస్తుంటే (బెజవాడలో) దాని ప్రక్కనఉన్న ఎలక్ట్రిసిటీ థర్మల్ స్టేషనులోవున్న foreman కు రు 75 యిస్తున్నారు. గేటువేయుట, తీయుట, పనలు గలిగిన అతనికి అంతజీతము, కష్టపడి పని చేసే foreman కు అదేజీతము యిస్తున్నప్పుడు ఇది ఎంత దారుణముగా నున్నదో కన్పడుతూనే ఉన్నది.

అంతేకాదు. Electricity Department కు వచ్చేటప్పటికి V Class చదివి ఉంటేనేగాని వారికి ఆ ఉద్యోగము ఇవ్వరు. 5, 10, 15 సంవత్సరములు సర్వీసులో ఉంటూ అనుభవముతో పని సక్రమంగా చేస్తూఉంటే, (ఇంతవరకు ఏ పనిముట్టు విరగలేదు, ఏ యంత్రము విరిగిపోలేదు), అటువంటివారిని సర్వీసులో permanent చేయడముకొరకు ఈరోజు educational qualifications కావాలంటున్నారు. కొత్తరూల్సు పెట్టుకొని కొత్తగా పనిలోకి తీసుకొనే వారికి educational qualifications కావాలంటే అర్థమున్నది కాని అయిదేళ్లు పదేళ్లు పనిచేసిన తరువాత వారిని పర్మినెంటు చేసేదానికి educational qualifications కావలెననుటలో ఏమైనా అర్థమున్నదా? కాని ఆ సందర్భములోకూడా ఈ సంప్రతింపులలో అంగీకరించారు. 2 సంవత్సరములనుంచి ఏ హోదాలో పని చేస్తున్నారో వాళ్ళను అందులో permanent చేస్తామని అంగీకరించిరి. కాని దానిని గురించి ఇంతవరకు orders ఏమీ రాలేదు.

తరువాత State Insurance:—ఆంధ్రరాష్ట్రములో 7 కేంద్రములలో ఈ స్టేటు ఇన్సూరెన్సును పెట్టబోతున్నాము, State Insurance మంచిదే కాని

దానివల్ల ఆ 7 కేంద్రములలో కార్మికులందరికి స్టేటు ఇన్సూరెన్సు స్కీము వర్తించుటలేదు. కొన్ని పరిశ్రమలలో వారికే వర్తిస్తున్నది. పోనీ ఆ పరిశ్రమలలో వారికే ఇచ్చినప్పుడు కూడా కార్మికులకు ఎక్కువ ఉపయోగము ఉండేట్లు చేస్తున్నారా అంటే అదికూడా లేదు. ఈ 7 కేంద్రాలలో కొన్నింటిలో ఈ కార్మికులకు కొంత మందికి షిప్ యార్డులో కానీయండి, ఇతర స్థలములలో కానీయండి ప్రత్యేకంగా వైద్య సౌకర్యాలు ఉన్నాయి. జబ్బుచేస్తే ప్రత్యేకంగా శెలవుఇవ్వడము అనేది ఉన్నది. ఇవన్నీకూడా వాళ్ళ ఆందోళనవల్ల, ఫ్యాక్టరీలు బాగాలాభములు సంపాదించడమువల్ల ఏర్పాటు చేయబడినది. ఈ State Insurance లకు ప్రతి worker కూడా తన జేబులోంచి కొంతడబ్బు ప్రతినెలా కట్టుకోవలసి వస్తున్నది. ప్రభుత్వము కొంత contribute చేస్తుంది. తరువాత యజమానులు కొంత contribute చేస్తారు. ఇదివరకు ఉచితంగా సౌకర్యాలు అనుభవిస్తున్న కార్మికులకు, అదే సౌకర్యాలను తన జీతములోనుంచి కొంతడబ్బు ఖర్చుపెడితే అనుభవించేటట్లు చేస్తున్న స్కీము కార్మికులకు అంతా సంతోషముగా ఆహ్వానిస్తారంటే అసంభవము. ఇష్టములేకుంటే మానుకోమంటారు. అది అందరికీ తెలిసినదే. కాని ఒక అభివృద్ధిపంథా, Welfare State, సోషలిస్టుక్ పాటరన్ ఆఫ్ సొసైటీ సమాజానికి పూనుకున్నటువంటి ప్రభుత్వము "ఇష్టముపుంటే తీసుకోండి లేకపోతే మానుకోండి" అని చెప్పడమేనా ప్రభుత్వం వంతు? లేకపోతే వారలకుకూడా ఉపయోగపడేట్లు ఏమైనా చేస్తారా? గవర్నమెంటు ఆస్పత్రులద్వారానే వాళ్ళకు వైద్యసౌకర్యాలు కలుగజేస్తాము అంటున్నారు. Government Hospitals పూర్తిగా బీదప్రజలకు వుపయోగపడేట్లుగా చేసేంత వరకూ, కేవలం మీరు ఆస్పత్రులకు వెళ్ళి మందులు తీసుకొన్నట్లయితే మునిసిపల్ ఆస్పత్రులలోను, ఈ ధర్మాస్పత్రులలోను ఎటువంటి వైద్య సౌకర్యాలు కలుగుతున్నాయో ఈ కార్మికులకుకూడా అదేగతి పడుతుంది. అందుచేత బొంబాయిలో పెట్టినటువంటి pannel system ప్రకారం వాళ్ళయిష్టము వచ్చినటువంటి డాక్టర్ల దగ్గరకు వెళ్ళవచ్చు. ఆ మందుకైన ఖరీదు గవర్నమెంటు భరించవలసినదే. పనిచేస్తున్నటువంటి కార్మికునికి ఒక్కడికే కాకుండా వారికుటుంబము అంతకుకూడా ఈ వైద్యసదుపాయములు కలుగజేయాలి. అట్లా చేయనిచో ఏమీ ప్రయోజనములేదు.

కార్మికులలో తగాదాలను గురించి ప్రత్యేకముగా ట్రిబ్యునల్సు పెట్టినాము. దానికి చాలా డబ్బు ఖర్చుపెట్టుచున్నాము అంటున్నారు. కార్మికులకు తగాదా వచ్చినప్పుడు Labour Conciliation క్రింద Officers క్రింద విచారణ చేస్తారు. కాని Conciliation officers పంపిన report ను బట్టి తీసుకో

వలసిన చర్యలు ప్రభుత్వము అమలు జరుపకుండా బుట్టదాఖలుచేసిన ఘటనలు ఎన్నో ఉన్నవి. కొన్ని ఉదాహరణలు చెపుతాను. Andhra Scientific Company కొంతమంది కార్మికులను తీసివేస్తే కొన్నిరోజులు మూసివేసిన కారణముగా వాళ్ళకు ఆ చట్టంప్రకారం 30 వేల రూపాయలు ఇవ్వవలసిఉంటుంది. ఆ డబ్బు ఇచ్చుటకు యజమానులు నిరాకరించారు. కాని తరువాత దానిమీద Conciliation Officers దగ్గరకువెళ్లితే ఆయన ఇవ్వమని recommend చేశారు. కాని ఇంతవరకు ఆ 30 వేల రూపాయలు యివ్వడము జరుగలేదు. ప్రభుత్వము ఏమిచేస్తున్నది. తాను ఏర్పాటుచేసి చట్టమును అమలు పరచేదానికి Labour Conciliation Officer ఇచ్చిన award ను అమలుపరచకుండా ప్రభుత్వము కూర్చున్నదంటే దానిని ఏమి అనుకోవలసిఉంటుందో మీరే ఆలోచించండి.

అనపర్తిలో కొన్ని ఇటువంటి ఘట్టనలు Housing accommodation గూర్చి, Lady doctor ను ఏర్పాటు చేయడముగురించి Conciliation Officer దగ్గరకువెళ్ళినవి. దానిమీద Conciliation Officer orders pass చేస్తే అది కాదని విచారణకు Development Commissioner ను వేస్తే ఆయన ఈ కార్మికు కోర్కెలు చాలా అసమంజసముగా నున్నవని వాటిని గురించి ఏమీచర్యలు తీసుకోవలసిన అవుసరములేదని order పంపించారు.

పశ్చిమగోదావరిజిల్లా భీమవరము తాలూకాలో 4 awards ఉన్నవి. అవి గవర్నమెంటు ఆఫీసర్లుఇచ్చిన అవార్డులు, వాటిని ఇంతవరకు అమలు జరుపలేదు. 1951 లో Madras Workmen's Compensation Act ప్రకారం కోర్టు 46 కార్మికులకు రు. 2,600 లు జీతంక్రింద ఇవ్వాలని ఇచ్చిన రిపోర్టు ఇంతవరకు అమలు జరపడములేదు. 1954 ఏప్రియల్ లో భీమవరం మోటారు కార్మికులకుయిచ్చిన award ను ఇంతవరకు అమలుజరుపలేదు. దానికి వెంకట నారాయణ యజమాని. 1954 లో నర్సాపురం మోటారు కార్మికులు ఇచ్చిన అవార్డులోకూడా ఇద్దరు కార్మికులను తీసివేస్తే వారిని మరల చేర్చుకోవాలని అవార్డుఇస్తే దానిని ఇంతవరకు అమలుజరుపలేదు. అరీతిగా ఇంకా 2, 3 ఉన్నవి. నెల్లూరులో కార్మికుల కేసు ఒకటి ఉన్నది. దానిమీద రిపోర్టు April 25 న వస్తే మూడునెలలవరకు దానిమీద చర్యతీసుకోబడలేదు. Conciliation Officer కార్మికులకు యజమానికి తగాదా వచ్చినప్పుడు 15 రోజులలోపల తన రిపోర్టు పంపించాలని orders ఉన్నవి. Conciliation Officer ఒకటిన్నర సం॥ము 2 సం॥లు అయినాకూడా వాటిమీద ఎటువంటిచర్య తీసుకున్నట్లులేదు. అదేమనిఅడిగితే, నేను ఏమిచేస్తాను. ఫాక్టరీ యజ

Voting of Demands for Grants (Contd.)

Demand No. XXIII—Labour Including Factories

[SRI P. Sundarayya] [27th July 1955

మాని నాతో సంప్రదించడానికి పూనుకోలేదు, అతనిని compel చేయడానికి నాకు అధికారములేదు, అందువల్ల నేను 15 రోజులలోపల ముగించడములేదు, అని చెప్పిన ఘటనలు ఉన్నది. గుడ్లవల్లేరు, పెడన, తరిగొప్పలలోవున్న రైస్‌మిల్లులకు సంబంధించి నటువంటి కేసులలో 15 రోజులలో reports పంపించాలంటే ఇంతవరకూ ఆ ఆఫీసరు పంపించలేదు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే పారిశ్రామికరంగంలో శాంతిని కాపాడాలనే ఉద్దేశంతో Tribunals పెట్టారు. ఆ చట్టం చేసినపుడు కార్మికులుకాని యజమానులుకాని కోరితే ప్రభుత్వం కేసును adjudication కొరకు Tribunals కు పంపవచ్చునని వున్నదేకాని, పంపించి తీరాలని అందులో లేదు. పంపవచ్చుననేదాన్ని అధారంగా తీసుకొని అనేకచోట్ల కార్మికులు కోరినా ప్రభుత్వం పంపకుండా నిరాకరిస్తోంది. ఆఖరుకు కార్మికుల న్యాయమైన హక్కులను ప్రభుత్వం ఉద్యోగే నిర్ణయించినపుడుకూడా వాటిని ప్రభుత్వంచేత ఒప్పించడానికి సమ్మెలు చేయించవలసి వస్తోంది. నెల్లూరులో బీడీ కార్మికుల సమ్మె ఈ రకంగా వచ్చినదే. ముందు adjudication ఏర్పాటుచేయాలంటే, వారు నిరాకరించబట్టి రెండు నెలలు సమ్మెచేస్తేనేగాని దిగిరాలేదు. ప్రభుత్వ Departments లో చూస్తే Trade Unions ను గుర్తించరు. విధిలేక సంప్రదింపులకుమాత్రం ఒప్పుకుంటారు. వారి కష్టాలను గురించి చెప్పుకోవాలంటే Conciliation Officer ప్రసక్తేలేదు. Departments ద్వారా సంప్రదింపులు జరిపితే తేలదు. Labour Commissioner ఇందులో జోక్యం కలిగించుకోవాలంటే సమ్మె నోటీసు ఇవ్వాలి. సమ్మె నోటీసు ఇచ్చేసరికి ప్రభుత్వం మేలుకొంటుంది. సమ్మె నోటీసు ఇవ్వనంతకాలం Labour Commissioner దగ్గరకు రావడానికి వీల్లేని పరిస్థితులు ఉన్నాయి. B. G. M. A. నరసింగరావుగారు మీపార్టీవారే. ఆయన కార్మికుడు. Electricityలో ఉన్నారు. ఆయన adjournment motion ఇచ్చారు. Department అంగీకరించినదాన్ని మీరు అమలుచేయడంలేదు. కాబట్టివారు సమ్మె నోటీసు ఇచ్చారు. Labour Commissioner వచ్చినతరువాత ఆయన ఇచ్చిన award మళ్లీ Departmental Secretary దగ్గరకువెళ్లినతరువాత అవిఅన్ని అసమంజసంగాఉన్నాయి కాబట్టి తోసి పారేశాం అంటారు. అది సరిఅయినది కాదు. లేబరు లెజిస్లేషన్ చాలా చేశారు. చట్టాలు బాగానేఉన్నాయి. ఇంకా ఎక్కువగాచేయవచ్చు. వీటినైనా అమలుచేసే దానికి ఏమైనాచేస్తున్నారా ? ఫ్యాక్టరీ ఇనస్పెక్టరుస్సు, 2573 ఫ్యాక్టరీలు ఉన్నట్టయితే, సంవత్సరంలో 1085 ఫ్యాక్టరీలు ఒకపర్యాయం, 964 ఫ్యాక్టరీలు రెండు

పర్యాయాలు, 244 ఫ్యాక్టరీలు 3 పర్యాయాలు, 99 ఫ్యాక్టరీలు 4 పర్యాయాలు, కొన్ని ఫ్యాక్టరీలు ఆకస్మికంగా వెళ్లారు అన్నారు. సంవత్సరానికి ఒకమారు వెళ్లి చూస్తే ఏ ఫ్యాక్టరీయాక్టు సక్రమంగా అమలు జరుగుతుంది? చట్టవిరుద్ధంగా అనేక ఫ్యాక్టరీలు ఆదివారాలు పనిచేస్తున్నాయి, రాత్రిళ్లు పనిచేస్తున్నాయి. బిడ్డలు, స్త్రీలచేత పనిచేయిస్తూవున్నారు. వాళ్ళకి సౌకర్యాలులేవు. కొంతమంది లేబరుఇనస్పెక్టర్లను వెళ్లి పరిశీలించండి అనిఅడిగితే మేము రాత్రివెడితే తన్నితే దిక్కెవరు? మేము దూరంగానే ఉంటాంఅంటున్నారు. లేబరుఎడ్వయిజరీ కమిటీ ప్రభుత్వం ఏర్పాటుచేసింది. ఫ్యాక్టరీ చట్టాలు చక్కగా అమలు జరగాలంటే Trade Union ప్రతినిధులను ఎన్నుకోమనండి. కార్మికులచేత ఫ్యాక్టరీ Union కు సంబంధించినవారిచేత ఎన్నుకోబడినవారు ఇనస్పెక్టు చేసుకోడానికి అధికారం ఇవ్వాలంటే లేదు అంటున్నారు. ఇంత పెద్ద డిమాండు అంగీకరించకపోతే మానె. మీరు అప్పాయింటు చేసే లేబరు ఎడ్వయిజరి కమిటీ Non-official Jail Visitors మాదిరిగా ఫ్యాక్టరీలకు కూడా పెట్టాలంటే దానికి తయారుగాలేరు. ఒకపక్కన ఎక్కువ ఫాక్టరీ ఇనస్పెక్టర్లను పెట్టండిఅంటె డబ్బులేదు అంటున్నారు. ఉచితంగా చేస్తామంటే శాసనసభ్యులకు అధికారం లేదు. ఇటువంటి స్థితిలో ఈ చట్టాలు కాగితాలమీద ఉండడం తప్ప ఉపయోగం ఏమి ఉంటుంది. ఈ చట్టాలు సక్రమంగా అమలు జరగాలంటే Trade Unions కు check up చేసే అధికారం ఇవ్వాలి. కార్మికులచేత ఎన్నుకోబడిన ప్రతినిధులకు ఇవ్వాలి. శాసనసభ్యులకు ఇవ్వండి. జైలుకు నాన్ అఫిషియల్ విజిటర్సుగా ఆ ప్రాంతాలలో ఉండే శాసనసభ్యులను కాంగ్రెసు ప్రభుత్వం నియమించినది. పోనీ ఈ ఫ్యాక్టరీ చట్టము సరిగా అమలుజేసేదానికి జిల్లా బోర్డులకు మునిసిపాలిటీలకు కొన్ని అధికారాలివ్వండి. ఏమీచేయనిదే ఫాక్టరి చట్టాలను అమలు జేయడం అసంభవము. ఇంకా రెండు మూడువిషయాలున్నాయి. Trade Unions లో పనిజేసేవారికి పని నుంచి తీసివేయకూడదని ఉంది. ఈ చట్టం జేసిన ప్రభుత్వమే దీనిని అమలుజేస్తోందా? లేదు. వైజాగ్ మునిసిపల్ హాస్పటల్ workers తమ కష్టాలు తెలుపుకొనడానికి ఎంత కాలానికివినకపోతే చివరకు సమ్మె notice ఇస్తే లేబరు కమీషనర్ వచ్చి మీకోరికలున్యాయమైనవి అని union కార్యదర్శులతో అని వారిద్దరిని అరకువాలి ఒకర్ని అనంతగిరికి మరొకరిని విశాఖపట్టణంనుంచి మార్పు చేశారు. గురుమూర్తి అనేమనో కార్యకర్తను విశాఖపట్టణంనుంచి మరొకమారు మూలకు ట్రాన్సఫరు చేశారు. ఇది victimization చేయడం కాక ఏమిటి? Hospital లో పని చేసేవాళ్ళ న్యాయమైన కోరికలు సమ్మె notice యివ్వక పూర్వం

వినకపోవడం సమ్మె notice ఇచ్చినతరువాత లేబరు కమీషనర్ రెకమండేషన్ బుట్ట దాఖలుచేయడం ఈ రీతిగా ఎన్ని సంవత్సరాలు జరుగుతుంది ? ఇచ్చే జీతాలా 18,19 రూపాయిలకన్న పైన పెరగడం లేదు. ఏ మాత్రం వస్తువు క్రిందపడినా విరిగిపోతే జీతాలనుంచి కోత. సమ్మె notice ఇస్తే victimization. దీన్ని గురించి శ్రద్ధ తీసికోవాలని కోరుచున్నాను. ఇది Medical డిమాండు కాకపోయినా లేబరు యాంగిల్ నుంచి కార్మిక మంత్రిగారిక్కి మనవిచేస్తున్నాను. ఇంక సీజనల్ ఫ్యాక్టరీస్ అనే పేరుతో అనేకమంది కార్మికులకు ఈ లేబరు చట్టాల ఉపయోగం లేకుండా పోతోంది. ఈ చట్టాలు వీరందరికీ వర్తించే సదుపాయం చేయాల్సి ఉంటుంది. రెండు సీజన్సువరుసగా పనిచేస్తేవారికేపని ఇవ్వాలని రెండు మూడు సీజన్స్ పనిచేసినతరువాత వాళ్ళను ఫరమనెంటుగా తీసుకొని అన్ని హక్కులు వారికి వర్తించేట్లా చేస్తేనే ఎక్కువమంది కార్మికులకు ఉపయోగం ఉంటుంది. కార్మిక మంత్రిగారు ఉన్నారు. ఇండస్ట్రీస్ డిపార్టుమెంటునుంచి కార్మికశాఖను వేరే శాఖగా పెట్టడం ఒకరకంగా న్యాయం. ఈ రెండింటికి అవి నా భావ సంబంధం ఉన్నప్పటికి ఈ రెండిటిని విడదీయడమే న్యాయం. పరిశ్రమల మంత్రి లాభాల తత్వంతో ఉంటూ కార్మికుల శ్రేయస్సు గమనించడనే ప్రత్యేకంగా లేబరు శాఖను వేరే మంత్రికి అప్పగించారు. Labour మంత్రి కర్తవ్యం ఏమిటి ? ప్రభుత్వ కేబినెటులో ఉంటూనే కార్మికుల యొక్క న్యాయమైన హక్కులకోసం పోరాడ్డం జరగాలి. అందుకే కార్మిక మంత్రిని వేరుగా వేయవలసి వచ్చింది. ఈ సందర్భంలో మనగిరిగారిని మీ ముందుకు తీసికొని వస్తున్నాను. ఆయన మంత్రిగా ఉండి Bank ఉద్యోగులకు అన్యాయం జరిగిందనే ఉద్దేశంతో కేబినెటులో పోరాడి ప్రయోజనం లేక, నేను కార్మికులకోసం మంత్రిగా ఉండి కార్మికుల హక్కులను కాపాడ లేకపోతే Tribunal నిర్ణయాలను అమలు జరిగించలేకపోతే కేబినేటులో ఉండేదానికన్న బయటనే ఉంటానని రాజీనామా ఇచ్చారు. మీరందరు రాజీనామా ఇవ్వాలని కోరడం లేదు. ఆ పద్ధతిని అనుసరించాలనిమాత్రమే కోరుచున్నాను. ఈ ఏడు రాజీనామా ఇవ్వవద్దు. మళ్ళీ ఏడు ఇవ్వద్దు. మీలో ఉండే పొరపాట్లవల్ల ఇచ్చుకొంటే నేను చేసేది ఏమి లేదు. నేను కార్మిక మంత్రిగారికి చెప్పేది, కాంగ్రెస్ మంత్రివర్గంలో ఉన్నప్పటికి కార్మికుల తరఫున మీరు మంత్రిగా ఉన్నప్పుడు కార్మికులయొక్క హక్కులను రక్షించడానికి లేబరు కన్‌సీలిఏషన్ ఆఫీసరులు ఇచ్చిన awards అమలు చేయించేదానికి పూనుకుంటారని అప్పుడే ఆ డిపార్టుమెంటు ఉన్నదానికి ఉపయోగం ఉంటుందని చెబుతూ ముగిస్తున్నాను.

* Sri V. KURMAYYA :—అధ్యక్షా, యీ demand చాల ముఖ్యమైనది. కమ్యూనిస్టు నాయకుడైన సుందరయ్యగారు అన్ని విషయాలు కార్మికుల

Sri V. Kurmayya] [27th July 1955

తరఫున స్పష్టంగా చెప్పారు. అయితే వారు అవతలనుండి చెప్పడముచేత యివతల నేను యీ మంత్రివర్గానికి చెందడముచేత ఆ కష్టాలు అందరికి సామాన్యముగా అర్థము ఐనప్పటికికూడ ఇక్కడ యీ demand ను support చేయక తప్పదు. అందుచేత ఇక్కడ వారు మాట్లాడినతర్వాత నేను వ్యవసాయకూలీల విషయము మాట్లాడదలచుకున్నాను. 1949 వ సంవత్సరములో Minimum Wages Act ఢిల్లీలో జగజీవన్ రామ్‌గారు మంత్రిగావుండగా యీ వ్యవసాయకూలీలనుకూడా Minimum Wages Act క్రిందికి తీసుకువచ్చి వారికి కనీసవేతనాలను యివ్వవలసిన చట్టాన్ని చేసినాకూడ యింతవరకు ఉమ్మడి మద్రాసురాష్ట్రములో కాని మన ఆంధ్రరాష్ట్రము వచ్చిన తర్వాతగాని అమలుపరుచలేదు. మనకు ఆంధ్రరాష్ట్రము మొన్ననే వచ్చింది కనుక నేను అంతగా చెప్పవలసిందిలేదు. ఐతే ఇప్పుడు నేను చెప్పేది ఏమిటంటే యీ వ్యవసాయ కూలీలు ఆంధ్రరాష్ట్రములో 100-కి 50 మంది వున్నారు. యీ కూలీల కష్టాలు వివరించాలంటేకొన్ని గంటలు కావాలి. కాని నన్ను నాలుగు నిమిషాలు మాత్రమే అధ్యక్షులవారు మాట్లాడమని చెప్పినందున వారు త్వరలోనే గంటకొట్టుతారు. వ్యవసాయకూలీలు లేనిదే రాష్ట్రములేదు దేశములేదని మొట్టమొదటినుంచి నా భావన. ప్రజలందరికికూడ ఉద్యోగస్థులకుగాని మంత్రులకుగాని పెద్దపెద్ద భూస్వాములకుగాని తిండిని కలుగజేసి తిండిని సృష్టించి తిండిని పెట్టేది వ్యవసాయ కూలీలే. యీ వ్యవసాయకూలీ తన భార్య తన బిడ్డ తన సోదరి మోకాటి నీళ్లలో దిగి నాట్లువేసి పంటపండించకపోతే మన మందరనుకూడా యీ రోజున హాయిగా యీ పంకాలక్రింద కూర్చొని మాట్లాడడానికి సావకాశము వచ్చేదికాదు. వ్యవసాయ కూలీలు రైతులవల్ల అనేకవిధాలుగా బాధపడుతున్న విషయము మన కందరికీ తెలుసు. మంత్రిగారిని నేను కోరేది ఒక్కటే. వెంటనే సాధ్యమైనంత త్వరలో Minimum Wages Act క్రింద యీ వ్యవసాయ కూలీల వేతనాలుకూడా నిర్ణయించాలని కోరుతున్నాను. ఎందుచేతనంటే దాదాపుగా యీ చట్టము మన పార్లమెంటులో pass అయి 6 సంవత్సరములైంది. ఈ చట్టాన్ని అమలు జరుపడములో ఏ ప్రాంతాలలో ఏ విధముగా అమలుపరచాలో ఒక enquiry కమిటీని కూడా వేశారు. ఆ Enquiry Committee report కూడా ప్రభుత్వానికి అందింది. కాబట్టి వ్యవసాయ కూలీలయొక్క కష్టములు తీర్చడము అంటే 100-కి 50 మంది కష్టాలు తీర్చడమన్న మాట. నిజంగా మనము ఆవడి కాంగ్రెస్‌లో పాసుచేసిన socialist సిద్ధాంతాలను మనము తీసికొని వాటి ద్వారా యీ దేశాన్ని ముందుకు పురోగమింప జేసి దేశములో తిండి బట్ట కలుగజేయాలి. ఆ విధంగా మన కాంగ్రెస్ ప్రభుత్వాలు

Sri V. Kurmayya] [27th July 1955

నిర్ణయించుకొని ఆ నిర్ణయము ప్రకారము దేశములో క్షేమము కలుగజేయడానికి ప్రయత్నము చేస్తున్నాము. ఇంతకుముందు Industries మీద కొంత చర్చ జరిగింది. Industries, Labour కూడా ఒకే మంత్రిక్రింద వుంటే చాల బాగుంటుందని నా ఉద్దేశము. Industries ఒక మంత్రిక్రింద Labour ఇంకొక మంత్రి క్రిందవున్నపుడు కష్టము. అక్కడవున్న Factory owner కు కూలీలకు తగాదాలు వచ్చినపుడు ఒకే మంత్రి ఐతే సమాధానము చెప్పడానికి న్యాయము చేయడానికి కూడా వీలువుంటుంది. అందుచేత గిరిగారు మద్రాసు స్టేటులో Industries, and Labour మంత్రిగా వుండేవారు. ఐతే ఇప్పుడు Labour మంత్రి Industries మంత్రి పోట్లాడవలసి వస్తుంది. పోట్లాడముకూడా మంచిది కాదు. అప్పుడు Labour మంత్రి Labour కు న్యాయము చేయాలని ప్రయత్నించినపుడు కొన్ని చిక్కులు రావచ్చును. అందుచేత Labour మంత్రి కూలీలకు న్యాయము కలుగజేయాలన్నపుడు factory owners దగ్గర వెళ్లినపుడు వాండ్లను లెక్కచేయక పోవచ్చును. Industries కు Labour కు ఒకే మంత్రి వున్నప్పుడు Factory-owners, Mill-owners తనచేతిలో వుంటారు కాబట్టి వాండ్లకు ఇవతలకూలీలకు రాజీకుదర్చడములో వాండ్లిద్దరినికూడా దబాయించి రాజీ చేయవచ్చును. ఐతే ఇప్పుడు కేవలము శాసనాలు వున్నప్పటికికూడా శాసనాలు అమలు పరుచడము చాల కష్టమే. శాసనాలు అమలుపరచేవారుకూడా ధనవంతులుగా వుండేవారు. అందుచేత వాండ్లేమి అమలుపరుస్తారో నాకేమి నమ్మకములేదు. ఎందుచేతనంటే: మనదేశములో కులతత్వము పోలేదు, ధనికతత్వమూ పోలేదు, వర్గతత్వమూ పోలేదు. మన దేశములో శాసనాలను అమలుపరుచలేదంటే Factory Inspectors' reports చూచినట్లయితే చాలు. ఏన్నో వేలమంది స్త్రీలువున్నపుడు ఏకొద్దిమందో Maternity leave యొక్క లాభముపొందారంటే దానిని అక్కడ వున్న ఉద్యోగస్థులు factory managers అంతా కుంభకోణముచేసి దాని ద్వారా వాండ్లకు benefit లేకుండా చేస్తున్నారు. అనుకోవడములో ఏమాత్రము అబద్ధములేదు. ఐతే ముఖ్యంగా మంత్రిగారిని కోరేది ఒక్కటే. మన ఆంధ్ర దేశములో ఎక్కువగా industries వృద్ధిపొందలేదు. Central Government వారు English వారి సాంప్రదాయముక్రింద రాష్ట్రాలలో యీచట్టాలన్ని చేశారు. వాటిని మన కాంగ్రెస్ ప్రభుత్వములో విస్తృతము చేసినప్పటికి కూడా మనరాష్ట్రములో ఎక్కువగా మిల్లులు ఫాక్టరీలు లేకపోవడముచేత దాని యొక్క లాభము చాల పరిమితమయినది. నేను ముఖ్యంగా వ్యవసాయ

Sri V. Kurmayya] [27th July 1955

కూలీల విషయము ఎందుకు చెప్పానంటే వ్యవసాయకూలీలు 100-కి 50 మంది వున్నారు. వాండ్లు యీ రోజునకూడు లేకుండావున్నారు. Employment Exchange ఉంది అంటున్నారు. ఈ Employment Exchange లో skilled workersకు మాత్రమే పనియిస్తున్నారు. Unskilled labour కు యివ్వడములేదు. మనకు రెండువిధములైన నిరుద్యోగసమస్యవున్నది. ఒకటి చదువుకొన్నవాండ్ల సమస్య రెండవది చదువు లేనటువంటివాండ్ల సమస్య. నిరుద్యోగము తీసివేయాలంటూ దేశములో cottage industries ను గురించి మాట్లాడుకున్నాము. మనదేశములో వ్యవసాయకూలీలకు యీ గృహపరిశ్రమలు కలుగజేసినట్లయితే సంవత్సరములో ఎక్కువ రోజులు వాండ్లకు కూలి కలుగజేసినవాండ్లము ఔతాము. ఇప్పుడు వారికి సంవత్సరానికి 6-7 నెలలకంటే పనిలేదు. మిగిలిన 5 నెలలు ఏలా బ్రతుకాలో అర్థము కావడములేదు. వ్యవసాయ కూలీలగురించి చెప్పాలంటే వ్యవసాయ కూలీల సంఘాలు కాంగ్రెస్ వ్యవసాయకూలీలని కమ్యూనిస్టు వ్యవసాయకూలీలని పనిచేస్తూ వుంటాయి. అయితే వాండ్లకష్టాలు, వాండ్లఉద్దేశాలు చెప్పుకుంటే అరణ్యరోదనంగా వుంది. నిజంగా వ్యవసాయకూలీలకు Minimum Wages Act వెంటనే వర్తింపజేసి నిర్ణీతమైన వేతనాలు కలుగజేసినట్లయితే దేశములో సుభిక్షము కలుగజేసి యీ socalistic pattern అనే సిద్ధాంతములను మనము అమలుపరచిన వాండ్లము ఔతాము. ఇంతకంటే నేను చెప్పవలసినదిలేదు. నాకీ అవకాశమిచ్చినందులకు అధ్యక్షులవారికి నా కృతజ్ఞత తెల్పుతూ యింతటితో సెలవుతీసుకుంటున్నాను.

SRI B. G. M. A. NARASINGA RAO :—అధ్యక్షా, పరిశ్రమల పద్దు క్రింద మంత్రిగారు ప్రవేశపెట్టిన Demand ను నేను బలపరుస్తున్నాను. అయితే ప్రతిపక్షనాయకులలో శ్రీ సుందరయ్యగారు చాలా విషయాలు చెప్పారు. ఈ విషయాలలో కొన్ని నిజము వుండవచ్చును. వాటిలో చాల విషయాలు చాల చమత్కారంగా చిత్రించినారు. అందులో కొంచెము అతిశయోక్తికూడ కనబడుతుంది. అందులో ప్రభుత్వము ఏదో కక్షకట్టి యీ కార్మికుల నందరిని అణచివేసే ఉద్దేశముతో చేసిందని ప్రతిధ్వనిస్తుంది. మిగతా విషయాలలో వారితో నేను యేకీభవిస్తున్నాను. Act లో చాలలోపాలువున్నాయి. అమలు పరుచడములోకూడ చాల అలసత్వము కనబడుతుంది. లోపాలుకూడ వున్నాయి. ఐతే వాటి నన్నింటిని కూడ తొలగించడానికి Labour Department ప్రయత్నము చేస్తుందనే చెప్పాలి. ముఖ్యమైంది ఒక సంతోషకరమైన వార్త ఏమిటంటే మనకు మంచి Indurstial Tribunal, శ్రీ వి. ఎన్. దీక్షితులుగారు వుండడము, అధ్యక్షుడుగా

Sri B. G. M. A. Narasinga Rao] [27th July 1955

Labour Commissioner శ్రీ సి. ఆర్. రెడ్డిగారు వుండడము చాల మహా భాగ్యము. వారిద్దరు యీ Labour Department కు ఎంతో రక్షకులుగా వున్నారు. కార్మికులకు ఏమాత్రమైన రక్షణ కలిగిందంటే దానికి కారణము వారిద్దరే అని చెప్పాలి. చాల విషయాలలో వారెంతో పూనికతీసికొని చాలా కృషిచేస్తున్నారు. అయితే ప్రభుత్వ ఆధ్వర్యము క్రిందవున్న కార్మికులకుమాత్రము వారేమి చేయలేక పోతున్నారు. ఎందుకంటే ప్రభుత్వపు శాఖక్రింద పనిచేస్తున్న వారు ప్రభుత్వమువారిమీద నే శాసనాలను అజ్మాయిషీ చేయడానికి వీలులేక పోయినది. ప్రభుత్వముక్రింద పనిచేస్తున్న కార్మికుల స్థితిగతులు చూచినట్లయితే నిజము చెప్పాలంటే మనము చాల సిగ్గుపడవలసిన విషయము. ఎందుకంటే తక్కిన Private Industries లో వున్నవారి జీతాలకన్నా అన్నివిధాలకూడా చాల తక్కువ యిస్తున్నారు. ప్రతి industrial dispute లో కూడా మనము మధ్యవర్తిత్వము నడిపేటందుకు పంపించినపుడు Industrial Tribunal యిస్తున్న awards చూచినట్లయితే ఆ award లో సగటున ఏవిధంగా జీతాలనిర్ణయాలు జరుగుతున్నాయో ఆ నిర్ణయాలను అయిన అమలుపరుచవలసిన నైతిక బాధ్యత మనమీద వుంటుంది. కాని ఆ విధముగకూడా మనము అమలుపరుచడములేదు.

6-00 p. m.

జీవనవ్యయప్రమాణం పెరుగుతూయుంటే మిగతాచోట్ల అందరికీ మనం ఇవ్వమని చెబుతున్నాం. Private Industry లో అమలుపరచమని చెబుతున్నాం. Industrial Tribunals చేత award ఇప్పిస్తున్నాం. కాని అవిధంగా మన కార్మికులకు జీవనభృతి ఇమ్మంటే మనం ఇవ్వలేక పోతున్నాం. ఈ విషయాలు ప్రభుత్వం ఏవిధంగానైనాసరే కృషిచేసి తప్పకుండా సరిదిద్దగలుగుతుందని, సరిదిద్దాలనీ నా కోరిక. ఇంక Acts లో లోపాలున్నాయనీ పదేపదే భారత జాతీయ కాంగ్రెస్, I.N.T.U.C. తదితర కార్మిక సంస్థలు ప్రభుత్వానికి చెబుతూవచ్చాయి. ఐతే ప్రతి విషయానికీ ఏమి చెబుతున్నారంటే Central Government ఏదో Industrial Relations Bill తీసుకువస్తుందని వారు సమగ్రంగా ఈ Act అంతా repeal చేసి వారే ఏదో క్రొత్తగా శాసనాలు తయారుచేస్తారని చెబుతూవచ్చారు. ఇప్పటికి అలా చెబుతూవస్తూ 5 సంవత్సరాలు కావచ్చింది. ఇప్పటివరకూ ఆ act రాలేదు. మనంకూడా బొంబాయిలాగ ముందంజవేసి మనకు కావలసిన శాసనాలను మనమే తయారుచెయ్యాలని చెపుతున్నాను. ఈ విషయమై ప్రభుత్వం కృషిచేస్తుందని ఆశిస్తున్నాను. తరువాత

ప్రభుత్వానికి labour policy లేదు. Central Government ఏ labour policy అనుసరిస్తుందో అదేమన labour policy గాని మనకు వేరే policy లేదని మంత్రిగారు సెలవిచ్చి యున్నారు. ఇది చాలా విచారకరమైన విషయం. Central Government చాలావిధాల ముందుకుపోయి ఉంది. మనంతట మనకు స్వతాహా ఒక labour policy ఎందుకు ఉండకూడదో నాకు బోధపడడం లేదు. మిగతా రాష్ట్రాలు చూచేటట్లయితే వారి స్థితిగతులకు సంబంధించినంతమట్టుకు వారు స్వతహా వారి లేబరు పాలసీవారు పెట్టుకుంటున్నారు. దీనిలో బొంబాయి రాష్ట్రం చాలా ముందుకుపోయింది. వారిని చూచైనాసరే మనం ఎందుకు స్వతహా labour policy పెట్టుకోకూడదో నాకు బోధపడడంలేదు. అంతేకాకుండా కొన్ని విషయాలలో మనమే ముందున్నాం అనిపిస్తోంది. Shop Assistants Act, Central Government కి లేదు. Shops and Commercial Establishments లో పనిచేసేవారికి మనమే మొట్టమొదట Act pass చేసియున్నాం. అందుచేత మనం కొన్ని విషయాలలో స్వతస్సిద్ధంగా కృషిచేస్తున్నప్పటికీ, తదితర విషయాలలోకూడా అదేవిధంగా కృషిచేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఇంతేకాకుండా Labour Advisory Board అని పెట్టారు. ఆ Board ఇచ్చే సలహాలను పాటించవలసిన అవసరంకూడా ఉంటుందని ప్రభుత్వానికి విన్నవిస్తున్నాను. State Insurance Act మిగతా రాష్ట్రాలలో అమలు జరుపబడ్డా మన రాష్ట్రంలో ఇంకా అమలు జరుపబడలేదు. ఏదో october 2 వ తేదీనుండి అమలు జరుపబడుతుందని వింటున్నాం. చాలా సంతోషం. కాని Act లో కొన్ని లోపాలున్నవి. ఇప్పుడా Act అదేవిధంగా అమలు జరిపేటట్లయితే కార్మికునికి ఇప్పటికి ఉన్న కొన్ని సౌకర్యాలు పోతాయి. ఏమిటంటే ఇప్పుడు భారీ ఎత్తు పరిశ్రమలలో పనిచేసిన ప్రతి కార్మికుడికీ వైద్యసహాయం ఉండనే ఉంది. Scindhia Ship yard ఉందంటే వారికి పెద్ద ఆసుపత్రి ఉంది. వైద్యసహాయం ఇస్తున్నారు. I.L.T.D వారున్నారంటే వారికి మంచిమంచి ఆస్పత్రులున్నాయి. ఖరీదైన మందులుకూడా ఇస్తున్నారు. ఇదే విధంగా ప్రతి భారీపరిశ్రమలోకూడా ఆస్పత్రు లున్నాయి. ప్రతి కార్మికుడికీ వైద్య సౌకర్యం దొరుకుతోంది. అంతేకాకుండా sick leave దొరుకుతుంది. Sick leave తో పాటు వస్తున్న జీతనంకూడా దొరుకుతుంది. కాని ఈ Act అమలు జరిపేటట్లయితే 56 రోజులే ఆరోగ్య పథకంక్రింద రక్షణ దొరుకుతుంది. ఆ 56 రోజులకే జీతంవస్తుంది. తదితర అన్ని సౌకర్యాలూ పోగొట్టుకుంటున్నాడు. అందుచేత భారీపరిశ్రమలలో పనిచేస్తున్నా, పెద్దపెద్ద factory లలో పనిచేస్తూన్నా కార్మికులకు ఈ State Insurance Act ఏ విధంగాకూడా లాభసాటికాదు. ఐతే ఒక విధంగా

వనం దాన్ని సవరించే టట్లయితే దాన్ని లాభసాటిగా చేయవచ్చు. ఏమిటంటే కార్మికుడే గాక ఆ కార్మికుని కుటుంబానికికూడా వైద్యరక్షణ కల్పించే పక్షంలో కార్మికుడికి చాలా లాభదాయకంగా ఉంటుందని మనవిచేస్తున్నాను. Central Government కు ఆ విధంగా recommend చేసి ఆ Act ను సవరించి మన రాష్ట్రంలో అమలు జరుపమని కోరుచున్నాను. అంతేకాకుండా Minimum Wages Act ఉన్నదంటే అది చాలా industries లో declare చేస్తున్నారు. ఐతే వేతన నిర్ణయం సక్రమంగా జరగలేదు అని ప్రతివారు ఒప్పుకొనక తప్పదు. ఏ విధంగా చేశారంటే అక్కడఉండే కనీసవేతనం ఉంటే అదే కనీసవేతనం అన్నారు. కాని ఈ పనికి ఇంత జీతం ఉండాలి. ఈ పనివాడికి ఇంత నిర్ణయం జరగాలి. ఈ ప్రదేశంలో ఈ విధంగా ఉండాలి అని చాలా జాగ్రతగా యోచించి నిర్ణయించినట్లు కనబడదు. ఇప్పుడు పెట్టిన జీతాలు చూసేటట్లయితే అమలులోయున్న జీతాలకన్న నిర్ణయించిన వేతనం కనిష్టంగా యున్నది. అందుచేత ఆ విషయం ప్రభుత్వం వెంటనే పరిశీలించి తిరిగి పునర్నిర్ణయం చేయాలనీ అందుకు ఒక కమిటీవేసి ఇదంతా కూలంకషగా ఒకసారి చర్చించి నిర్ణయం చేస్తేగాని ఏమీ బాగులేదని మనవిచేసుకుంటున్నాను.

*Sri E. NAGAYYA:—అధ్యక్షా! ఈ రోజున మన మంత్రిగారు ప్రతిపాదించిన Demand నేను ఆమోదిస్తున్నాను. మన సోదరులు చాలామంది labour union లంటూ run చేస్తున్నారు. ఆ labour union ల ద్వారా మన labour కు కనీస వేతనాలు నిర్ణయిస్తారని ఏవో వారికి కావలసిన demands సాధిస్తామని వారిచేత strike లు చేయిస్తున్నారు. కాని strike లు వల్ల వారికి ప్రయోజనం ఉంటుందని నాకు నమ్మకం లేదు. నేను 4, 5 labour union లను రోజూ చూస్తున్నాను. వారు సాధించేది ఏమీ కనిపించలేదు. ఏదో రెండు మూడు రోజులు strike చేయిస్తారు. Strike చేయించిన తరువాత కంపెనీవారు, ఆ union వారు కలిసి ఏదో tea-party గాని dinner-party గాని ఏర్పాటు చేసుకుంటారు. దానితో labour demands, labour కు ఇప్పించవలసిన కనీస వేతనాలు ఏ దారికి వెళ్ళిపోతున్నారో, ఏ ఊరికి వెళ్ళిపోతున్నారో నాకు తెలియకుండా యున్నది. తరువాత వ్యవసాయ కూలీ లున్నారు. వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు ఇవ్వా లన్నారు. ఒక ఊళ్లో ఒక రూపా యిస్తున్నారు. ఒక ఊళ్లో రెండు రూపాయ లిస్తున్నారు. ఒక ఊళ్ళో అర రూపా యిస్తున్నారు. మా విశాఖ

పట్టణం జిల్లాలో తాలూకాకు ఒక rate ఉన్నది. చీపురుపల్లి తాలూకాలో మగకూలికి అర్ధరూపాయి, ఆడకూలికి నాలుగణా లిస్తున్నారు. విశాఖపట్టణం తాలూకాలో సింధియాకంపెనీకి 5, 6 మైళ్ళదూరంలోయున్న కూలీలకు రెండు రూపాయిలు, రూపాయిన్నర యిస్తారు. Minimum కూలీ ఇప్పించాలంటే, minimum కూలీ అంటే ఎంత అరేటెంతో నాకేమీ, ఎక్కడా అర్థం కావడం లేదు. గవర్నమెంటు వారేదో rate నిర్ణయిస్తారు. ఇదిచే యిస్తాం అది చేయిస్తాం అని strike లు చేయించడం ఒకటే కనబడు తుందికాని, ఇంత రేటిప్పిస్తున్నాం ఈ కూలీలకు ఇంత ఉండాలని వారు సాధించింది నాకెక్కడా కనబడలేదు. అది అలాఉండగా Employment Exchenges ద్వారా ఏదైనా పనిజరుగుతుంది, ఏదైనా పనికల్పిస్తారని అనుకుంటే ఈ Employment Exchanges లో ముందు application పెట్టి అది register చేయించి ఒక card పుచ్చుకునేసరికి 20 రూపాయిలు ఖర్చవుతున్నది. ఈ Employment Exchanges ద్వారా పేర్లు recommend చేసి ఒక list వ్రాసి ఏదో ఒక కంపెనీకో, ఒక N. A. D. డిపార్టుమెంటుకో, సింధియా కంపెనీకో List వెళ్లేసరికి యింకొక 20 రూపాయిలు, 30 రూపాయిలు ఖర్చవుతోంది. ఇవన్నీ చేసినా ఆ వెళ్లిన list లో ఏయిద్దను ముగ్గురినో skilled labour అని employ చేసి తక్కినవాళ్ళను పొమ్మంటారు. అల్లా మూడు సంవత్సరాలనుంచి Employment Exchange Officer చుట్టూ తిరుగుతున్నారు. కాని యెవరికీ పని దొరకినట్లు నాకెక్కడా కనిపించదు. ఇది ఆరకంగా లేకుండా మన Provincial Government వారు ఈ Employment Exchanges ను తమ క్రిందకు తీసుకుని సక్రమంగా పనికల్పించేటట్లుచేస్తే బాగుంటుంది. అవి రాష్ట్ర గవర్నమెంటు తీసుకుంటే బాగుంటుంది. ఏదైనా complaint వుండి Central Government కు మనం report చేసుకుంటే మనఘోష వినేవారుకూడా అక్కడ కనిపించలేదు. Project లు అంటూ రోడ్లు అంటూ మన Public works, Minister గారు యెన్నో works చేయిస్తున్నారు. కొన్ని కోట్లు ఖర్చుపెడుతున్నారు. కూలీలను departmental గా appoint చేసి, contract system మాని పనులుచేయిస్తే గవర్నమెంటుకు 25% లాభం రావడం కాకుండా కూలీలకు కనీసవేతనం నిర్ణయించి, మంచిరేటిచ్చి కూలీలస్థితి బాగుపరచ వచ్చును.

* SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, ఈ బడ్జెటు గురించి కొన్ని సూచనలు ఇవ్వదలచుకున్నాను. వ్యవసాయ వేతనాలు గురించి సూర్యయ్యా గారు, సుందరయ్యా గారు చెప్పారు. సూర్యయ్యా గారు ఇదివరలో మంత్రిగా ఉండినారు. వారు దీన్ని గురించి మరచిపోయారనుకొంటాను. ముఖ్యంగా అన్ని విధాలా ప్రపంచాన్ని పోషించేవారు రైతు అనే విషయం జ్ఞప్తి ఉంచుకో వలసిందని మనవి చేస్తున్నాను. ఎందుకనగా ఈ దినము 12 గంటలకు వర్షము వచ్చిందంటే, ఆ 12 గంటలప్పుడే ఆ రైతు కూలివచ్చి ఊడ్చాలి, ఆ కూలే వచ్చి ఆకు వేయాలి. ఏ రాత్రి వర్షము పడితే, ఆ రాత్రే వచ్చి కూలి పని చేయాలి. అటువంటప్పుడు ఆ కూలి చట్టాన్ని రైతుకు వర్తింపచేస్తామంటె, అది ఎలా సమంజసమో యోచించాలి. రైతు కూలీని పోషించాలి, రైతుకూడ బ్రతకాలి. అటువంటప్పుడు ఒకేతూరి పొదుగు కోసివేయమని చెప్పుతున్నారు. మామూలుగా పితికి పాలుతీసుకోవాలిగాని, పొదుగు కోసివేయకూడదని మనవి చేస్తున్నాను. వ్యవసాయదారుడు, రాత్రి పగలనక, ఎప్పుడు పనిపడితే, అప్పుడే, పని చేయవలసియుంటుంది. కనుక factories లో లాగా వీరికికూడ ఇన్నిగంటలని limit పెట్టి ఆ విధంగా పనిచేయాలంటే సాధ్యంకాదు. తరువాత Act లో ఇంకొక విషయము సవరించవలసియున్నది. చిన్న చిన్న చుట్టల దుకాణాలుంటాయి. వాళ్లు రోజంతా దుకాణంలో కూర్చుంటే అర్ధరూపాయి మిగులుతుంది. అటువంటివారికికూడ ఈ Act ను వర్తించి దుకాణం మూసివేయాల్నని అంటున్నారు. ఈ విధంగా చిన్నవారికి పెద్దవారికి ఒకేవిధంగా వర్తింపచేయడం న్యాయంకాదు. పేద దుకాణం దారులు వారికి పనిలేనప్పుడు, ఎప్పుడు అవకాశముంటే అప్పుడు దుకాణం పెట్టుకొంటూ ఉంటారు. కాబట్టి మన కమ్యూనిస్టు సోదరులు చెప్పుచున్నట్లు "పెట్టె మోసుకు వెళ్లిన వానిదే హక్కు" అనే రకంగామట్టుకు కాకుండా చూడవలసిందని కోరుతున్నాను. సాధారణంగా రైతుకూలి పని ఉండినరోజు పనికిపోతాడు, పనిలేకపోయినరోజు దుకాణం పెట్టుకొంటాడు. అటువంటప్పుడు ఆ చట్టాన్ని అతనికి వర్తింపచేస్తే బ్రతుకు లేదని మనవి చేస్తాను. Factories లో వందలకొలది కూలీలు పనిచేస్తూ ఉంటారు. గనుక వారికి ఈ చట్టను వర్తింపజేయవలసిందే.

అయితే ఈ పేదరైతు కూలీలకుకూడ అది వర్తింపచేయడం న్యాయంకాదని మనవిచేస్తున్నాను.

తరువాత, ఈచట్టాన్ని అమలుపరచేందుకు కొంతమంది ఉద్యోగస్థులను వేసినారు. వారికి రెండోపనిలేదు. ఏదో duty చూపించాలని లేనిపోనివన్నీ చేస్తూంటారు. ఊళ్లో ఎవరైనా ఇద్దరుముగ్గురు labourers తో ధాన్యం తెప్పించుకొని వాళ్లే ఆడించి అమ్ముతూఉంటే, వాళ్లనుకూడ factory క్రింద లెక్కకట్టుతున్నారు. గత సంవత్సరం గుంటూరులో కొంతమందిపైన ఆవిధంగా చార్జిలు పెట్టినారు. ఎవరైనా మామూలుగా 2 గంటలప్పుడు ఇంట్లోధాన్యం తీసుకొని వస్తూంటే అప్పుడుకూడ ఒకకూలి అనిచెప్పి కేసులు పెడుతున్నారు. ఈవిధంగా అన్యాయం జరుగుతున్నది. చిన్నచిన్నవాళ్లు ఏదో స్వయంగా ఒక పదిపుట్లు ధాన్యం పెట్టుకొని ఆడించుకుంటేకూడ factory అనిచెప్పి కూలీలు ఎప్పుడంటే అప్పుడు పనిచేయకూడదని నిర్బంధిస్తారు. రైతులకు సాధారణంగా పగలంతా పొలంలో పనిచేసుకొని రాత్రి ఎప్పుడో తమకు వీలుపడినప్పుడు 10, 12 గంటలకు, ధాన్యం ఆడించుకొంటూ ఉంటారు. అటువంటప్పుడు వారికికూడ చట్టాన్ని వర్తింపచేయడం న్యాయంకాదని, కనుక ఈ చట్టాన్ని తగువిధంగా సవరించాలని కోరుతున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, ఈ విషయంలో ఇంతమంది మాట్లాడారు. అందరు చెప్పినవాటికి సమాధానం చెప్పాలంటె వ్యవధి లేదు. Election లో వారు ఏమి చెప్పారో, దానినే మళ్లీ అదే రకంగా ఇక్కడ చెప్పితేమాత్రం అంత బాగుండదు. మేము ఏమి చెప్పామో దాన్ని విమర్శించడం, చెప్పనిది చెప్పడం బాగుండదు. తరువాత సుందరయ్యగారు Labour legislation గురించి మాట్లాడారు. ప్రధానంగా ఈ చట్టాలు ఏమి అమలు జరగడం లేదు అని చెప్పారు. ఈవిషయంలో లచ్చన్నగారికి సమాధానం చెప్పడం తేలికే. వారు 1949 వ సంవత్సరంలో మద్రాసులో సభ్యుడుగా ఇచ్చినటువంటి ఉపన్యాసం ఇక్కడ ఉన్నది. అది అంతా చదవడానికి time లేదు కాబట్టి ముఖ్యమైన నాలుగువాక్యాలుమాత్రం చదివి వినిపిస్తాను. మిగిలింది వారినే చదువుకొమ్మని కోరుతున్నాను. వారు చెప్పింది వారే, ఇప్పుడు మంత్రిగా ఉండి చదువుకొని ఆవిధంగానే అనుసరించ వలసిందని కోరుతున్నాను, వారు అప్పుడు

ఈవిధంగా చెప్పారు—"ఈనాడు శాసనంలో ఉన్న తప్పులను అవకాశంగా తీసుకొని చట్టాన్ని ఉల్లంఘించడానికి పారిశ్రామికవేత్తలు ప్రయత్నాలు చేస్తున్నారు. వారు ఈవిధంగా శాసనాన్ని తృణీకరించడంవల్ల కార్మికులకుగాని, పరిశ్రమలకుగాని, వారికిగాని, ఏమాత్రము లాభించదని సవినయంగా ఈనాడు మంత్రిగారికి మనవిచేస్తున్నాను" అవిధంగా చెప్పినవారు ఈరోజు మంత్రిగా ఉన్నారుగనుక, దానిని అమలుపరచవలసిన బాధ్యతఉన్నది. అయితే, దీనికి సమాధానంగా మంత్రులు మేము వచ్చి 3 నెలలేఅయింది 6 నెలలె అయింది అని చెప్పుతున్నారు. కాని, వారు లేకపోయినా, Labour Department ఉన్నది, administration జరుగుతున్నది. మంత్రులు పోయినారు. మంత్రులు వచ్చారు; రావచ్చును. రావలసిందే, ఏదో మంచో చెడో చేస్తే చెప్పడానికి వీలుంటుంది. ఈరోజు మీరుచేసిన చట్టాలు సక్రమంగా అమలు జరగడంలేదనే విషయం స్పష్టంగా బోధపడుతున్నది. వారి మెమోరాండంలో "The management of factories denied to take interest in the welfare of workers" అని వ్రాసుకొన్నారు. ఇట్లాంటి వాక్యాలుమాత్రం వ్రాయడం తగదని మంత్రిగారికి హెచ్చరికచేస్తున్నాను. ఆ డిపార్టుమెంటువారి అలవాటుప్రకారం మీరు అవిధంగా వ్రాసిఉంటారు. కాని యధార్థపరిస్థితిని దృష్టిలో పెట్టుకొనిమాత్రం అది వ్రాయలేదు. ఇక్కడ ఇచ్చినటువంటి లెక్కలే దీనిని రుజువుచేస్తున్నాయి. Maternity Benefit గురించి సుందరయ్యగారు చెప్పారు. Time లేదుకాబట్టి వివరాలలోకి పోను. మొత్తము 36,884 స్త్రీల పైకి, 165 మందికిమాత్రమే ఈ Maternity Benefit వర్తించేటట్లు చేశారు అంటే మీచట్టము సక్రమంగా అమలుజరిగిందా? కనుక ఈచట్టాని మార్చవలసిన అవసరం ఎంతైనా ఉన్నదని విజ్ఞప్తి చేస్తున్నాము. ఈవిషయాన్ని అనేకతడవలు Labour Department దృష్టికి తీసుకువచ్చాము. ఈనాడున్న పరిస్థితిచూస్తే కనీసం 8 వారాలవరకైనా ఈ maternity benefit ఇవ్వలేదు. ఇది seasonal factoriesకు కూడ వర్తించేటట్లు చేయాలి. రోజుకు అర్ధరూపాయ చొప్పున ఈ maternity benefit ఇస్తున్నారు. ఇది అమ్మన్న రాజాగారు వింటే ఎంత బాధపడుతారో! ముఖ్యంగా, వారికి ఎంతకూలి గిట్టింపు అవుతుందో అంతకూలి ఇచ్చేటట్లు ఈ చట్టాన్ని అమలుజరపండని కోరుతున్నాను. ముఖ్యంగా, Vuyyuru Sugar Factory విషయం తీసుకొన్నట్లయితే ఏఒక్క చట్టముకూడ అమలుజరగడం లేదు అంటే ఆశ్చర్యంలేదు. labour Inspector గాని Factory Inspector గాని ముందు నోటీసు ఇచ్చి, మేనేజిమెంటును ముందుకు తీసుకువచ్చి పెడతారు. దాంట్లో ఏలాంటి లోపాలున్నా వాటిని తిరగద్రిప్పి వ్రాయించినటువంటి ఘట్టాలుకూడ అనేకము ఉన్నాయి.

అనేకమంది strike చేస్తామని నోటీసు ఇస్తే దాన్ని Adjudication Tribunalకు refer చేయాలని Labour Commissioner recommend చేస్తే, గవర్నమెంటు తమ చేతిలో ఉన్నది గదా అని ఆ recommendation కూడ నిరాకరించి దాన్ని Tribunal కు refer చేయకుండా ఉండడంకూడ జరిగింది. బందరులో ఉన్న Scientific Union firm విషయంలో ఏమి జరిగింది? 30 వేల రూపాయల labour కు ఇవ్వాలి అని Labour Commissioner recommend చేస్తే, అది ఎందువల్ల బుట్ట దాఖలు అయింది? ఇవన్నీ చూస్తే, పెట్టుబడిదార్లపై పేదలదృష్టి పెరుగుతున్నది గాని, కార్మికులవైపు మొగ్గడంలేదని స్పష్టంగా బోధపడుతున్నది. ఎప్పుడో మాకు తెలియదు అని చెప్పడానికి వీలులేదు. ప్రథమంగా వుయ్యూరు sugar factory ఈ వేళ ఎవరిచేతిలో ఉన్నదో అందరికి తెలుసును. Factory workers ఎవరైనా పోయి అడిగితే, వారిని పనిలోనుంచి తీసివేయడం జరుగుతుంది. ఎన్ని applications Labour Department కు పోయినాయో అడగండి. ఏదో కొత్తగా మంత్రులు అయ్యారు, ఈ చట్టాల్లో ఉన్న లోపాలు సవరించడానికి త్వరలోనే ఒక బిల్లు తీసుకరాగలరని, కార్మికులకు రక్షణ కలుగజేస్తారని, అందుకు ప్రయత్నం చేస్తారని ఆశించాము. కాని ఆ విధంగా జరుగలేదు. ప్రధానమైనటువంటి standing orders ఉన్నాయి. ఈ standing orders ను frame చేసేటప్పుడు ఎందువల్ల trade union representatives తో ఒకమారు సంప్రదించి చేయకూడదు? ఇప్పుడు ఉన్నటువంటి disputes త్వరలో పరిష్కరించాలి అన్నట్లయితే, పరిశ్రమలలో శాంతి ఏర్పడాలి అన్నట్లయితే, తప్పనిసరిగా ఆ విధంగా చేయవలసి యుంటుంది. Planning, Planning అని ప్రతి డిమాండుకు సంబంధించి చెప్పుతూ ఉంటారు. అయితే, ఇందులో labour యొక్క పాత్ర ఏమిటి? That is what I wanted from him. దాంట్లో labour ఏ role play చేయబోతున్నది? గుంటూరుజిల్లాలో Planning Committee లో labour కు ప్రాతినిధ్యం ఇవ్వాలంటే labour కు Planning కు ఏమి సంబంధమో అక్కడ కలెక్టరుకు తెలియడం లేదు. అలాంటి ఆఫీసర్లు ఉన్నప్పుడు, కార్మిక ఉద్యోగులు కొంత పనిచేస్తున్నను, ఈ Planning లో labour కు కూడ భాగముండాలని, వారుగూడ భాగస్వాములాగా ఉండాలని స్పష్టంగా చెప్పిఉంటే చాలా బాగుండేది. కాని ఇదిమాత్రం జరుగలేదు. కార్మికులను ఉత్సాహపరచి, వారి జీతాలు ఎక్కువ చేసి, వారి సౌకర్యాలు ఎక్కువ చేసినట్లైతే Planning జయప్రదంగా చేయగలుగుతారుగాని లేకపోతే Planning విఫలమౌతుందని మనవి చేస్తున్నాను. తరువాత

Sri PillalamarriVenkateswarlu] 27th July 1955]

కమ్యూనిస్టులు ఏదో చేశారని వారిని నిందిస్తే ఏమి లాభంలేదు అని విజ్ఞప్తిచేస్తున్నాను.

THE HON. Sri G. LATCHNNA :—అధ్యక్షా, ఉపన్యాసాలు చేసిన సభ్యుల సంఖ్య తక్కువేకాని తెలియజేసిన విషయాలుమాత్రం ఎక్కువగా ఉన్నవి. కాని వాటి అన్నిటికి జవాబుచెప్పుటకు వ్యవధికూడా తక్కువగా వున్నది. నాకు వున్న వ్యవధిలో సాధ్యమయినంతమటుకు సభ్యులు చర్చించిన విషయాలను గురించి మనవి చేస్తాను.

ముఖ్యంగా ప్రతిపక్ష నాయకులైన సుందరయ్యగారు, తరువాత వెంకటేశ్వర్లు గారు యీ చట్టములు ఎంతవరకు ప్రభుత్వము అమలులోకి తీసుకొని రాగలిగారనేది ప్రధాన సమస్యగా అడిగారు. అవి అమలులోకి రాలేదని ఇటీవల జరిగిన ఆందోళనను బట్టి వేరే విధంగా అడిగారని అనుకుంటాను. ఈ చట్టములు అమలులోకి రాలేదన్న విషయములో, అవి సక్రమంగానే జరుగుచున్నవని యీరోజున ఎవరూ చెప్పడము లేదు. కాని అమలు జరగడములేదు అనే విమర్శఅయితేకావచ్చు, కాని వాస్తవమైన విమర్శగా పరిగణించారని నేను నా మనస్సులోకూడా నమ్మకము లేక ఇది ఒక వాదనగా చెప్పారేమోనని అభిప్రాయపడుతున్నాను. ఎందుకంటే వారివద్ద వీటికి సంబంధించిన రిపోర్టులు వున్నవి. ఇవి విచారణఅయిన కేసులే. కాని విచారణకానివి కూడా విచారణఅయిన భాగాలు అని తెలియకుండాకూడా వారు చెప్పారు. అందువల్ల ముఖ్యంగా కేంద్రప్రభుత్వము 1934 వ సంవత్సరమునుంచి యీ చట్టాలన్నీకూడా నిర్మాణముచేసి, అమలులో పెట్టుతూండడం కార్మికులను అణచిపెట్టటానికి చేస్తున్న ప్రయత్నముగా వున్నట్లు ప్రజలందరు భావించాలనే ధోరణిలోవారు మాట్లాడడమనేది అంత సమంజసము కాదు. కాని కార్మికులయొక్క ప్రాథమిక హక్కులు కాపాడాలనే ప్రధాన ఉద్దేశ్యముతోనే, పరిశ్రమలువున్న కార్మికులను గురించి అయితేనేమి, లేక వ్యవసాయపు కార్మికుల గురించి అయితేనేమి, చట్టాలు చేయడము జరుగుచున్నవి. ఈ విషయము మనము అందరము అభిప్రాయ భేధాలు లేకుండా ప్రధానంగా అంగీకరించవలసిందిగా నేను మనవిచేస్తున్నాను. అయితే యీ చట్టములు అమలుచేసే విషయములో లేబరు డిపార్టుమెంటువారు పనిలోవున్న కార్మికులహక్కుల రక్షణ గురించి, ప్రయత్నము చేస్తున్నారు. పనిలో లేనివారియొక్క హక్కుల విషయముకూడా కాపాడటానికి ప్రయత్నముచేశాము అని చెబుతున్నారు. జిల్లాలలో వున్న Employment Exchange offices లో ఎంతవరకు పనిచేశారు అనే విషయము సుందరయ్యగారు ఒకవిమర్శ లేవదీశారు. Employment Exchange

27th July 1955] [Sri G. Latchanna

office లు కేంద్ర ప్రభుత్వమువారి అజ్మాయిషీలో వున్నవి. అందువల్ల యీ Exchange ఆఫీసులు ఎంతవరకు పనిచేస్తున్నవో తెలుసుకోటానికి కేంద్రప్రభుత్వము వారు ఒక కమిటీని నియమించారు. ఆ కమిటీ దేశములో వున్న Exchange Offices ఏ విధంగా పనిచేస్తున్నవి, అనేది విచారించటానికి భారతదేశము అంతను పర్యటన చేసి, యీ సమస్యను యింకా effective గా పరిష్కరించుటకు రాష్ట్రప్రభుత్వాలకు Exchange ఆఫీసులకు సంబంధము ఉండేటట్టు చేయటానికి కమిటీవారు ఆలోచిస్తున్నారు. రాష్ట్రప్రభుత్వములకు Exchange ఆఫీసులకు సంబంధము వుండడము మంచిదేకాని, జిల్లాలతోబాటు కార్మికులకు ఒక సంఘముకూడా రావడము, యింతవరకు కేంద్ర ప్రభుత్వముయొక్క అజ్మాయిషీలోనున్న Exchange ఆఫీసులు యిప్పుడు రాష్ట్రప్రభుత్వముయొక్క అజ్మాయిషీలోకి త్వరలోనే రావడము జరుగబోతున్నదని నేను మనవిచేస్తున్నాను. కాని ఈ విషయము ఎంతవరకు జరిగింది, ఎంతవరకు జరగలేదు అనేది పరిశీలనలోకి రాబోతున్నది. అంతేకాని యీ Exchange ఆఫీసులలో వున్నదంతా లంచాలని, పూరకనే కాలయాపన కళ్లు తుడుపులుగా చేస్తున్నారని, ఎన్నో విధాలుగా ముందుగా వ్యాఖ్యానించడము, ఉద్యోగాలు లభించినవారు ఎవరూలేరని అనుకోవడము, భావ్యంకాదని నేను మనవిచేస్తున్నాను. ఒక్క సామర్లకోటలోనూ, నెల్లూరు జిల్లాలోనూ సిరమిక్ ఫ్యాక్టరీ, యితరఫ్యాక్టరీలు వుండేచోట్లలో పనివారిని తీసివేస్తే, ప్రభుత్వము ఏమిచేస్తున్నది అని విమర్శించుచున్నారు. కార్మికులను అక్రమంగా ఏ కారణం లేకుండా, ఏదో సంబంధములేని కారణముపెట్టి తీసివేయడము జరిగినప్పుడు, ఆ విషయము ప్రభుత్వదృష్టికి తెచ్చినప్పుడు దాన్ని విచారణచేసి, తరువాత ఉపేక్షించడము జరిగితే, అప్పుడు తప్పకుండా ఆ విషయమును గూర్చి వ్యాఖ్యానించవచ్చు, విమర్శించవచ్చు. అందుకు నాకెంత మాత్రము అభ్యంతరము లేదు. కాని విచారించడానికే వీలులేదు, అసలు వారిని తీసివేయటానికే వీలులేదనే సిద్ధాంతము, సరియైనదికాదు. అలా పనిలో వున్నవారిని పని చేసినా, చేయకపోయినా వారిని తీసివేయటానికి వీలులేదు, వారిని వుంచవలసిందేనన్న వాదనసుందరయ్యగారు చేయరని నేనువిశ్వశిస్తున్నాను. కొన్నింటిలో సుందరయ్యగారు భావదృష్టిలో వుంటే వుండవచ్చును గాని, అదిమాత్రము వాస్తవికదృష్టిలో వుండదని నేనుభావిస్తున్నాను. ప్రత్యేకంగా ఫలానాచోట ఇంతమందిని తీసివేశారు, దీని విషయములో ప్రభుత్వము ఏమిచేసిందిఅని అడ్గవచ్చు. అందుకు సమాధానమివ్వటానికి అభ్యంతరము వుండదు.నిజానికి ప్రభుత్వమువచ్చిన తరువాత ఇప్పటికి ఈ మూడు మాసములలో ప్రభుత్వానికి ఏదైనా ఫిర్యాదులువచ్చి, కార్మిక

Sri G. Latchanna] 27th July 1955]

సంఘములో కార్మికులకేకాదు, ఎవరైనాసరే ఫిర్యాదు చేసినప్పుడు అది త్రోసివేయబడ్డది విచారించబడలేదు, అనే సంఘటన ఒకటి నాదృష్టికి తీసుకొనివస్తే వారికి నేను సమాధానము చెప్పటానికి సంసిద్ధుడననే మనవి చేస్తున్నాను. అందువల్ల యింతవరకు జరిగినవి జరిగాయి. చట్టరీత్యా ప్రభుత్వము యే విషయములోనైనా చర్య తీసుకోవలసివుండికూడా చర్యతీసుకోలేదని నిరూపించగల సంఘటనను ప్రభుత్వ దృష్టికితెస్తే, తప్పనిసరిగా దానిమీద చర్యతీసుకుంటానుగాని వూరకనే Rationalisation స్కీము యీనాడు కేంద్రప్రభుత్వము ఆమోదించిందని గౌరవసభ్యులు అనటానికి అవకాశములేదని నేను విశ్వసిస్తున్నాను. మొన్న బొంబాయిలో Tripartite Conference లో యీ విషయము గురించి తీవ్రంగా చర్చించటానికి అంగీకరించలేదనే విషయము తెలిసివుండికూడా, Rationa-lisaiton అనేది ప్రభుత్వము ఆమోదించినందువల్ల అది సరియైన పద్ధతికాదు, దానివల్ల ప్రమాదము వస్తుందని వ్యాఖ్యానించడము, మంచిదికాదు. (Interruption) ప్రభుత్వము తనకు చట్టరీత్యా అధికారము వున్నప్పటికినీ, తాను చర్యతీసుకోవటానికి వీలువుండికూడా, చర్యతీసుకోలేదు, ఈ విధంగాచేసింది ప్రభుత్వము అని విమర్శ చేయడం సమంజసమే కాని, అటువంటి అవకాశాలులేనిచోటకూడ విమర్శించడం సరికాదు. వాస్తవానికి కొన్ని విషయాలువున్నవి. ఈ Shop Employees Act ఒకరిమీద, యిద్దరిమీద ప్రవేశ పెట్టబడుతున్నారు. అది ఏమీ న్యాయముకాదు, ఇక్కడ మనుష్యులమీద పెట్టుతున్నారని దానిమీద కార్మికులే అడ్డుపెట్టుతున్నారని నరసింహ అప్పారావుగారు చెప్పారు. ఇదివరకు Composite State లోనే exemption యివ్వడము జరిగింది. దానివల్ల కొన్ని అవాంతరాలు వచ్చినందువల్ల, దాన్ని మరల ప్రభుత్వము సవరించుకున్నది. అందువల్ల యికమీదట exemption యివ్వడము అనేది దుర్వినియోగము అవుతున్నదనితెలిసి, వెంటనే సవరించుకుని ఇకమీద exemption యివ్వబడదని ప్రభుత్వము తీర్మానించుకున్నదని మీకు నేను మనవిచేస్తున్నాను. కారణమేమిటంటే, యింకొకరు వున్నారు అని ప్రతివారు దరఖాస్తులు పెట్టుకుంటే దీనికి limit అనేదివుండదు. ప్రతి shop employee కూడా దరఖాస్తుతెస్తాడు. అందువల్ల exemption అనేది దొరకదు. దానివల్ల చాలా చిక్కులు వస్తున్నవి. అందువల్ల నేను మనవిచేసేది యేమిటంటే, చట్టరీత్యా ప్రభుత్వానికి యేదైనా చేయగలిగిన అవకాశమువుంటే, చేయకుండా ఉపేక్షించివుంటే, అది ప్రభుత్వముయొక్క ఉపేక్ష, కార్మిక విద్రోహ విధానము అని చెప్పవచ్చు. అటువంటిదిలేకుండా, నేను ముఖ్యంగా మనవిచేసేది యేమిటంటే, కార్మికులను ఏవిధమైన తప్పుఉన్నా, లేకపోయినా తీసివేయకూడదు

అనేసిద్ధాంతము ఎవరూకూడ అంగీకరించరని నేనువిశ్వసిస్తున్నాను. దీనికి నూతనముగా ఒకవిధానము వుంటుంది. కొన్ని పద్ధతులువుంటాయి. కొన్ని షరతులువుంటాయి. ఆషరతులనువిడిచి ఫ్యాక్టరీ యజమానులు ప్రవర్తించడముకూడదు. Trade Unions గాని, Trade Unions లో వుండే సభ్యులుగాని, ఏ కార్మికుడుగాని తనయొక్క విద్యుక్తధర్మములను ఎంతమాత్రముకూడా అతిక్రమించకూడదు అనేసిద్ధాంతాన్ని ప్రతివారు అంగీకరించకతప్పదు. అందువల్ల నేను ముఖ్యంగా మనవిచేసేది యేమిటంటే, యిప్పుడు యీ ప్రభుత్వము ప్రైవేటు మనుష్యులమీద శాసనాలుచేసి చర్యతీసుకుంటున్నామేగాని ప్రభుత్వము తనకువున్న డిపార్టుమెంట్సులో ఏమి చేస్తున్నది? Electricity Department nominal muster roll ప్రకారము ఇన్నివందలమంది వున్నారు, 9(a)(1) సెక్షన్ క్రింద ఎన్నోవేలమంది వున్నారని సుందరయ్యాగారు అంటున్నారు. ఈసంగతినిగురించి యీరోజుననే ఒక Pact జరిగినట్లుగా నాదృష్టికి వచ్చింది. యూనియన్ కార్మికుల తరఫున ఒక మెమొరాండము యీరోజుననే నాకు యివ్వబడ్డది. ఒక పక్షంగా చెప్పబడినవిషయము అది. దాన్ని నేనే విచారణ చేయాలి. అందులో ఏ లోపాలు వున్నప్పటికినీ, దాన్ని ప్రభుత్వము తప్పకుండా సవరిస్తుంది. సవరించటానికి ప్రభుత్వానికి అభ్యంతరము వుండదు. నోటీసులు యిస్తేనేగాని లేబరు కమీషనరు కదలరు అనే వ్యాఖ్యానము, అంతాగూడా మన Trade Union సంస్థ ద్వారా సాధారణంగా చేస్తే అది ఉపన్యాసవిమర్శధోరణిఅనే చెప్పాలిగానీ, వాస్తవిక దృష్టిలో అది చెల్లనేరదు. ఈ రోజుననే ధవళేశ్వరములో ప్రభుత్వము P. W. D. workers కున్నూ అక్కడ P. W. D. వుద్యోగస్థులకు మధ్య వున్న సమస్యల విచారణను గురించి, యీ రోజున ధవళేశ్వరములో కమీషనరు విచారణ చేస్తున్నారు. వారు నిన్ననే యిక్కడనుంచి వెళ్ళారు. ఇటువంటప్పుడు కమీషనరుగారు కదలరు అని మన ప్రతిపక్షనాయకులు, బాధ్యత వహించినవారు ఆ విధంగా విమర్శిస్తున్నారంటే, యిందులోని వాస్తవము తెలియకుండా విమర్శిస్తున్నారని, అనుకుంటున్నాను. అటువంటి విషయాలను గురించి వాస్తవము గమనించాలని మనవి చేస్తున్నాను.

6-30 p. m.

ఇప్పుడు నేను నామినల్ మస్టర్‌రోలు గురించి మనవి చేయాలి. ఇది నేను Electricity Minister ను అయివున్నాననే defence కాదు. ఏదైనా ఒక నిర్మాణ కార్యక్రమము ఒక ప్రాంతములో వచ్చినప్పుడు ఆపనికిగాను అవసరమైన కూలీలను ఆ ప్రాంతమునుంచి తీసుకొన్నప్పుడు వాళ్లు మస్టరురోల్ క్రింద వస్తుంటారు. ఈ విధముగా ఇప్పుడు ఈ ఎలక్ట్రిసిటీ స్కీముల construction ఒకేమారు అనేక ప్రాంతాలలో జరుగుతున్నది. ఒకే మారు కాకపోయినా, ఒకచోటకు ఎలెక్ట్రిసిటీ

Sri G. Lachanna] [27th July 1955

స్తంభాలు పోవడానికి, లేకపోతే అక్కడ షెడ్లు కట్టడానికి, లేకపోతే ఇళ్లు కట్టడానికి నిర్ణయించుకున్నటువంటి కూలీలు ఈ కర్నూలు తాలూకాలో జరిగిన స్కీములో పనిచేసిన కూలీలను తాడిపత్రి తాలూకాలోనికి తీసుకుపోలేము. అక్కడ కూలీలు వున్నారు. అక్కడ వారిని ఎంగేజి చేసుకోవాలి. ఇక్కడ ఈ పని వుండదు. Temparary గా మనము తీసుకొన్నప్పుడు నామినల్ మస్టరురోలు అనేది తప్పని సరిగా అవలంబించవలసివుంది. ఇప్పుడు ప్రభుత్వము electricity స్కీములు ఎక్కువగా ప్రోత్సహిస్తూ గ్రామీణ ప్రాంతాలలో వాటి నిర్మాణము జరుగుతున్నందువల్ల ఆయా ప్రాంతాల్లో ఆ స్తంభాలు పాతడానికి, షెడ్లులు వేయడానికి, సబ్ స్టేషనులు కట్టడానికి నియమించవలసిన కార్మికులు నామినల్ మస్టర్ రోలు మీదనే రావలసిన అవసరము కలుగుతుంది. Permanent employees వుండేందుకు అవకాశము వుండనే విషయము సుందరయ్యగారు తప్పకుండా గుర్తిస్తారని నా విశ్వాసము. లైన్ మెన్ లుగా, హెల్పర్లుగా, వాళ్లు పర్మనెంటుగా వుండగల వర్కుఆపరేషను సైడు వేరే ఉన్నది. constuction వేరు, ఆపరేషను వేరు. ఈ construction అనేది అయిపోతేదానికి అక్కడ పనులు వుండవు. ఆపరేషనుకు ఎల్లప్పుడు పని వుంటుంది. ఈ ఆపరేషను సైడు అభివృద్ధికూడా జరుగుతోంది. పనివారలలో ఇదివరకు తెలియజేసిన సంఖ్యవారు ఇంకా 9. A. క్రిందవున్నారా, లేరా ? అనేది నేను విచారణచేసి మీకు సమాధానము చెప్పవలసి వుంటుంది. ఈ సమస్య ఇదివరకు I. N. T. E. C. వారుకూడా రాయబారము నడపడము నేను దానికి అధ్యక్షులుగా వున్నటువంటి సందర్భము వుండటం బట్టి Chief Engineer గారిని నెలరోజుల క్రిందట 9 A. క్రింద ఎంతమంది వున్నారని అడిగాను. గుంతకల్లులో వర్కుషాపుకు నేను విజిటింగు వెళ్లినప్పుడు అక్కడ హెల్పర్ల వ్యవహారములు వారందరి సనులుపాటలు అన్నీచూసి వారందరిని రెగ్యులరైజు చేశారా అంటే ఏ అయిదుగురినో ఆరుగురినో తప్ప అందరిని రెగ్యులరైజు చేశామని చెప్పారు. అయితే దానియొక్క వివరాలు ఈ రోజు ఇచ్చినటువంటి మెమోరాండమును బట్టి ఎంతవరకు వున్నాయని నేను తెలుసుకోవాలి. సుందరయ్యగారు చెప్పిన సంఖ్య ఇంకా మిగిలే వుంటుంది అని నాకు నమ్మకము చాలదు. ఆ విధముగా ఏదైనా సవరణ చేయవలసివుంటే తప్పకుండా జరుగుతుందని వారికి మనవి చేస్తున్నాను.

మినిమము వేజెసు విషయములో ఇంకా సరియైన నిర్ణయములు జరుగలేదని నేను ముందటనే మనవిచేశాను. ప్రభుత్వము ఇచ్చిన రిపోర్టులో కొన్ని కొన్ని

విషయాలు సుందరయ్యగారు ఈ ఫ్యాక్టరీ Inspector reportలో చూపించి ఏవిధముగా నగ్నంగా వున్న యధార్థాన్ని వారు వ్రాశారు అన్నారు. అయన వున్న సత్యాన్ని వ్రాయడముకూడా తప్పుఅవుతోంది. పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు ఇంకొకవాక్యము తీసుకొని ఇది అంతా అబద్ధం అసత్యం వీనిని వ్రాయకూడదని అంటున్నారు. పిల్లలమర్రి వారికి, పనికివచ్చే వాక్యము వుండాలనే వాదనతోనే మన శాసనసభాచర్యలు జరిపిస్తామంటే అది అంత సమంజసము కాదేమో అని నా విశ్వాసము. నాకు అనుకూలంగా వున్నది నిజము, లేనిది అబద్ధము అని వ్యవహారముచేయడముగాని, విమర్శించడము, చర్చించడముగాని అంత సరియైనపద్ధతికాదేమో అని నా భావన. వారిభావన భేదించవచ్చు. అందువల్ల ముఖ్యముగా యధార్థాన్ని మీదృష్టికి తీసుకువస్తున్నాను. కూర్మయ్యగారు Labour Inspectors ఈ ఫ్యాక్టరీ యజమానులతో లాలూచిపడపోయి వున్నదిఅంటూ తృప్తి పుచ్చివేస్తున్నారని అన్నారు. ఆ రిపోర్టులో సుందరయ్యగారు ఎత్తిచూపించిన పేరాగ్రాఫ్‌లను సభకు ఎటువంటిలాలూచిలేదుఅని చెబుతూ కొన్ని కొటింగ్సు అందరికి చదివి వినిపించారు. అందువల్ల ప్రభుత్వములో అటువంటి లాలూచిలేదని అటువంటిది ఎంత మాత్రము జరుగదని మీకు మనవిచేస్తున్నాను. ముఖ్యంగా నేను మనవిచేసేది వుయ్యూరు షుగరుఫ్యాక్టరీ గురించి సుందరయ్యగారు చెప్పారు. వెంకటేశ్వరరావు గారుకూడా చెప్పారు. విషయము అంతా ఇతమిద్ధంగా తెండి అంటున్నాను. ఇదిగో ఈ అక్రమము, ఈ అన్యాయము ఫలానావారికి వ్యతిరేకంగా జరిగిందని, తీసుకురాండి. అట్లుకాకుండా ప్రభుత్వము అంతాకూడా వుయ్యూరు షుగరు ఫ్యాక్టరీ అని భ్రమపడుతున్నారు కలలు కనడము తప్ప యధార్థము కాదు. అందువల్ల యేమిత్రుడుగాని, కమ్యూనిష్టుగాని, కాంగ్రెసుగాని లేకపోతే ఏ ఇష్టులుగాని అఘోరిస్టులుగా వున్న వారుగాని ఏ కర్మాగారములోనైనాసరే ఏ కార్మికుడికైనా అన్యాయం జరిగినప్పుడు, జరుగుతున్నదని ఒక నిర్దుష్టమైన నేరారోపణ తెచ్చినప్పుడు ప్రభుత్వము విచారణచేయకుండాఅది ప్రక్కకు నెట్టివేస్తే అది మీరు విమర్శనచేస్తే సబబుగా వుంటుందిగాని అటువంటి గట్టివిషయం లేకుండానే మీరు ఈ ప్రభుత్వము ఇట్లా చేస్తున్నదని అట్లా చేస్తున్నదనిక ట్ మోషన్లు పెట్టారు. కాని, ఇదిచాలా తక్కువ మొత్తమది, అయినా కట్టుమోషన్లు పెట్టితేగాని చర్చించడానికి అవకాశములేదు కాబట్టి మేము కట్టుమోషన్లు పెట్టాము గాని 60 లక్షలు తెచ్చినా ఆమోదిస్తామని సుందరయ్యగారు

నాకు చాలా సంతోషము. ఈనాడు డిపార్టుమెంటుకు వున్న అవసరా

Sri G. Latchanna] [27th July 1955

టట్లుగాఈ డిమాండు తీసుకురాబడింది. గత ఏడాదికంటే, ఈ ఏడాది ఈ డిమాండులో అదనంగా సుమారు 7, 8 వేలు రూపాయలు పెరిగింది. ఎంత డిపార్టుమెంటు వున్నదో దానికి ఎంత అవసరమో దానికి సరియైనదిగా వుంటుంది. అయితే, ఇంతే పెట్టారు కాబట్టి డిపార్టుమెంటు ఇంతే వుంచుతారు అని కాదు. మీకు ఇప్పుడే మనవిచేశాను. రేపు ప్రొద్దున ఎంప్లాయిమెంటు ఎక్సిచేంజికూడా దీనిక్రిందకు రాబోతున్నది. స్టేటు ఇన్స్యూరెన్సు స్కీము కూడా రాబోతున్నది. ఇంకా మినిమము వేజస్‌ను ఇంక్రీజు చేయడానికి ఏ విధమైన పద్ధతి అవలంబించాలో దానికి ఏ విధమైనటువంటి మెషినరి కావాలి అనేది కూడా ప్రభుత్వము పరిశీలన చేస్తున్నది. అందువల్ల దీనికి ఏదైనా అదనపు ఖర్చు వుంటే సప్లిమెంటరి బడ్జటు మళ్ళ మీకు తప్పకుండా చూపుతాము. ఈ యేడాది ఆఖరువరకుకూడా ఈ విధముగానే ఈ బడ్జటు వుంచుకొని ఇంతకంటే ఎక్కువ ఏమీ చేయలేము అని మీరు అపోహ పడవలసినటువంటి పని లేదని మనవి చేస్తున్నాను. మినిమము వేజస్ విషయంలో కార్మికులకు, రైతులకు అన్యాయము జరగడములేదు, వారిద్దరూకలసి పనిచేస్తేనే వ్యవసాయము సాగుతుందని ప్రభుత్వానికి తెలుసు. కనుక దానిని ఎవరూకూడా ఉపేక్షిస్తారనే భయం అక్కడ రైతులకుగాని, ఇక్కడ కార్మికులకుగాని ఉండవలసిన అవసరము లేదు. వ్యవసాయ కూలీలకు కనీస వేతనము విషయం గురించికూడా ప్రభుత్వము ఆలోచిస్తుంది. వ్యవసాయదారులకు వస్తున్న ఆదాయములో కనీసము ఎంతభాగము వ్యవసాయ కూలీలకు ముట్టచెప్పాలి అనేది నిర్ణయించడమే వ్యవసాయ కూలీల కనీస వేతనములో వున్నటువంటి ముఖ్యమైన సూత్రము. దానిని గుర్తించుకునె చేస్తుంది. రైతులను అమలుపరచడానికి వీలైన చట్టము చేయాలనేదేగాని అమలుకాకుండా వుండాలని కాదు. ఇది నామినల్‌గా చేసిందికాదు. గత సంవత్సరము 14 గ్రామాలలో చేసి వున్నారు: అవి ఎంతవరకు అమల్లో ఉన్నాయి, వాటిపరిస్థితి ఏమిటి, అది సక్రమముగా రాష్ట్రము అంతటా అమలు చేయడానికి ఏ పరిమాణము తీసుకోవాలి ఈ కనీసవేతనము ఎట్లా చేస్తారని నాగయ్యగారు ప్రశ్న వేశారు. ఆయా ప్రాంతాలలో వున్న ధరలు జీవితముయొక్క ఖర్చు మొత్తము ఎంతో చూచుకొని అక్కడ వున్నటువంటి వ్యవసాయ పంటల ధరలుకూడా దృష్టిలో పెట్టుకొని కనీసవేతనము నిర్ణయించబడుతుంది. ఇప్పుడు ఇండస్ట్రియల్ లేబరుకు అక్కడ వున్నటువంటి ఆ లోకల్ ఇండెక్సు అంకెలమీద ఆధారపడి ఏవిధముగా డియర్నెస్

27th July 1955] [Sri G. Latchanna

అలవెన్సు అనేది నిర్ణయింపబడుతున్నదో, ఆయా ప్రాంతాలలో వున్నటువంటి జీవితపు ఖర్చుయొక్క మొత్తాన్నిబట్టి, వ్యవసాయ పంటలయొక్క ధరలనుబట్టి అక్కడ వున్నటువంటి కనీసవేతనము నిర్ణయించడము జరుగుతుందని నేను మనవిచేస్తున్నాను. ఈ విషయాలన్నీకూడా ప్రభుత్వము పరిశీలిస్తున్నది. ఇది వీలైనంత త్వరలోనె చేయగలమని మేము ప్రయత్నిస్తున్నాము.

Maternity Act మీద 37 వేలమంది ఉంటే 132 మందికి ఇదంతా బూటకముకాదా అని అర్థము వచ్చేటట్లుగా వెంకటేశ్వర్లుగారు సుందరయ్యగారు చెప్పుచున్నారు. ఎన్నిరోజులు పనిచేసినా ఫాక్టరీయొక్క privileges కనీసము ఒక సంవత్సరము అయినా పనిచేసే కార్మికులకు వర్తించాలని చట్టములో నున్నదని దానికి సవరణ కావాలంటున్నారు. ఈరోజునె పనిలోకి వెళ్ళి రేపటినుంచి నాకు శాశ్వత రక్షణ కావాలంటె దానిని ఎంతవరకు అమలు జరుపగలను ?

SRI P. SUNADARAYYA :— నేను ఈవేళ పనిలో చేరి రేపే శాశ్వతరక్షణ కావాలనడములేదు. మూడుఏండ్లుపనిచేస్తే మొత్తము 3 × 80 = 240 రోజులు అవుతుంది. ఆ తరువాత చట్టము మార్చమంటే దానికి అభ్యంతరము ఏమిటి ?

THE HON. Sri G. LATCHANNA :— నేను మనవిచేసేది ఇప్పుడు వున్న చట్టము మార్చడము అనేది రాష్ట్రప్రభుత్వము పరిశీలించి కేంద్రప్రభుత్వమునకు తెలియజేస్తే జరుగవలసినచర్య. Meternity benefit మనదైన చట్టము చేసేప్పుడు ఇది కేంద్ర ప్రభుత్వమునకు పంపించడము వారియొక్క scrutiny కూడా జరుగుతున్నదని మన గౌరవసభ్యులకు తెలుసు. ఇది రహస్యంకాదు. మనము ఏచట్టము చేయబోతున్నాము అనేది కేంద్రప్రభుత్వానికి తెలియజేస్తూ వుంటాము. కేంద్ర ప్రభుత్వముకూడా స్క్రూటినీ చేస్తూ వుంటుంది. ఈ చట్టములోవున్న సౌకర్యములను పొందవలసిన స్త్రీలు పొందలేకుండా ఉంటే దానిని ప్రభుత్వదృష్టికి తీసుకువచ్చిన తగుచర్య తీసుకొనుటకు అభ్యంతరములేదు. కొన్నిచోట్ల ఎక్కడైనా అటువంటి సౌకర్యం న్యాయంగా పొందవలసి వుండికూడా పొందలేకుండావున్నారాఅంటే అనేకయూనియన్లలో పనిచేస్తున్నాముఅనిచెప్పుకునేటటువంటి సభ్యులుగాని మిత్రులుగాని, ఆయాయూనియన్లలో ఒకస్త్రీకి న్యాయంగా జరుగవలసినటువంటి సౌకర్యము జరుగనప్పుడు తప్పనిసరిగా ప్రభుత్వదృష్టికి తీసుకురావలసిన బాధ్యత వారికి వున్నది. కాని ఎక్కడెక్కడ ఎవరెవరు సౌకర్యాలు పొందలేకుండా ఉన్నారో అనేది ప్రభుత్వము దివ్యజ్ఞానమువల్లనో, లేకపోతే ప్రత్యేక యంత్రమువల్లనో తెలుసుకోవడము సాధ్యము అయిన పనికాదు,

Sri G. Latchanna] [27th July 1955

అందుచేత కార్మిక సంఘాలలో పనిచేసిన సోదరులుగాని చైతన్యము కలిగిన కార్మికులుగాని ప్రభుత్వదృష్టికి అటువంటి సౌకర్యములు తమకు జరుగనప్పుడు ప్రభుత్వమునకు తప్పనిసరిగా ఫిర్యాదు చేసుకోవచ్చు. మేము అప్పుడు తగినచర్య తీసుకొనక పోయినట్లైన అప్పుడు విమర్శించవచ్చునని నేను మనవిచేయుచున్నాను.

SRI S. VEMAYYA :—అట్లా తెలియజేస్తే అసలు ఉద్యోగాలు ఉండవేమో.

THE HON. SRI G. LATCHANNA :—అదే సత్యంఅయితే యీనాడు ఒక్కరుకూడా ఈ ఫ్యాక్టరీలలో ఉండడానికి అవకాశములేదు. అని నా మనవి. అనేకమంది కార్మికులు విచారణలు చేయించుకొని ఫలితములను పొంది హక్కులు సంపాదించుకొన్నవారందరు ఉద్యోగాలు కోల్పోయినారా? లేనిదానికి ఉన్నదానికి ఏదో ఒక కేకవేద్దామని అన్నవారికి అటువంటి సంఘటన జరిగివుండవచ్చు. కాని ఇదివరకు అనేకమంది ఒక్క కమ్యూనిస్టు మిత్రులే కాదు కాంగ్రెసు మిత్రులే కాదు సోషలిస్టు మిత్రులే కాదు అనేక మంది ఈ కార్మిక సంస్థలను నడిపిస్తున్నారు. అనేక సమస్యలను చర్చించారు. అనేక సమ్మెలను సాగించిఉన్నారు. వారందరికి ఉద్యోగాలుపోయినాయని ఊరికే ఒక general remark చేయడము బాధ్యత రహితమైనదని నా మనవి. అందువల్ల ఇది సరైన పద్ధతి కాదు.

పోతే State Insurance Scheme ను గురించి మన సభ్యులు కొన్ని సందేహాలు వెలిబుచ్చారు. State Insurance సౌకర్యము ఎక్కడో పెద్దపెద్ద factory లలో ఉన్నది. వారికి ఇందువల్ల నష్టము వస్తున్నదని argeement ఒకటి తీసుకువస్తున్నారు. అది కొంతవరకు యధార్థము కావచ్చును కాని ఏమీ సౌకర్యములు లేని చిన్న చిన్న factoryలలో వున్న కార్మికులు ఎన్నివందలు వేలమంది ఉన్నారు అనేది మనము గమనించాలి. రాష్ట్రము మొత్తముమీద పెద్ద పెద్ద ఫ్యాక్టరీలు 2, 3 వుంటేఅక్కడ వాళ్లకు ఇదివరకు ఈ సౌకర్యములు వున్నవి కాబట్టి ఇది అక్కర లేదు. దీనిని compulsory చేస్తే సుందరయ్యగారు ఇది నిర్బంధమా, ఇష్టము వున్నవారు ఇన్స్యూరెన్సు చేసుకోవచ్చును, ఇష్టము లేనివారు చేసుకో నవసరము లేదన్నారు. కాని దానిని విమర్శగా చిత్రించడము న్యాయం కాదని నా ఉద్దేశ్యము. అయితే పెద్దపెద్ద Factory లలో ఉన్న కార్మికులకు ఇదివరకే కొన్ని సౌకర్యాలు ఉన్నవి అందువల్ల అదనముగా వచ్చింది ఏదో 5%, 10% వుంటే దీనికి మన జేబులో డబ్బులు యివ్వడము ఎందుకు అని కాని ఏమీ సౌకర్యాలుకూడా లేని చిన్న చిన్న factory లలో వున్నటువంటి వేలకొలది, లక్షలకొలది కార్మికులు పరిస్థితి మనము

గమనించడము చాలా అవసరము. అందువల్ల ఈ స్కీమును అందరు ప్రోత్సహించి జయప్రదముగా చేయవలసిన అవుసర మున్నదని మనవి చేస్తున్నాను.

తరువాత Conciliation ఎంతవరకు సఫలమైనది ? Conciliation, adjudication అని రెండు పద్ధతులుగలవు. అసలు కార్మిక సంఘములలో తిరిగిన ప్రతిఒకరికి ఇది తెలుసు. conciliation అనే పదములోనే అర్థమున్నది. ఉభయులు ఒప్పుకుంటేనే జరుగుతుంది. లేకపోతే లేదు ; conciliation యొక్క report అమలు కాకపోతే తప్పు అవుతుందనేది ప్రత్యేకముగా చెప్ప నక్కరలేదు. ఒక labour officer గాని, Commissioner చేత authorise చేసిన officer గాని తాము జరిపిన సామరస్యపు సంప్రదింపులుమీద వచ్చిన ఆయన రిపోర్టు ఉభయపార్టీలవారు తమ సమక్షంలో సంతకములుపెట్టి ఆ ప్రకారం నడవక పోతే తప్పు. దానిమీద ప్రభుత్వము చర్య తీసుకొనే అవకాశము ఉన్నది. ఆ విధముగా సంతకాలు పెట్టుకోకుండా నేను ఈ conciliation కు ఈ సామరస్యపు రాజీపద్ధతికి నేను ఒప్పుకోనను అన్నవారిమీద conciliation ను మీరు ఎందుకు వత్తిడి చేయలేదంటె అటువంటి conciliation break అయితే adjudication పెట్టారు. Adjudication award అనేదితప్పనిసరిగా binding అవుతుంది. ఈ adjudication award ను గురించి, అది అమలు జరుగలేదనిచెప్పి కొంతమంది transport worker. ను గురించి, మరికొందరిగురించి, సుందరయ్యగారు mention చేసివున్నారు. ఇటువంటిది ఏమైనాఉంటే ప్రభుత్వమునకు తెలియజేయండి. తప్పకుండా చర్య తీసుకుంటుంది. Adjudicotion award ను ఉల్లంఘించిన ఎవరిపైనైనాసరే ప్రభుత్వము చర్యతీసుకొనుటకు ఏమీ సందేహముపుండదని నేను మనవిచేస్తును. Conciliation ఎందుకు అమలుచేయలేదుఅంటే ఉభయపార్టీలో రాజీపరచేపద్ధతి conciliation అవుతుంది. అది విఫలమైతే adjudication ఉన్నది. Adjudication అందరిని చట్టరీత్యా బంధించేపద్ధతి అని నేను వేరుగా చెప్పనక్కరలేదు.

ఇకపోతే ఇండ్లను గురించి ప్రధానముగా చర్చించారు. ఇండ్లనుగురించి కేంద్రప్రభుత్వము అమలులోకి తెచ్చిన స్కీమును అనుసరించి ఇప్పటికి 4 కంపెనీల వారు, ఉయ్యూరు Sugar Factory, Andhra Cement Factory, తణుకువారు, రాయలసీమ Industries వారు, ఆ స్కీమును అమలుకు తీసుకు రావడానికి 25% Grant పుచ్చుకుంటూ 37% Loan తెచ్చి Quarters కట్టడము జరిగిందని ప్రశ్నోత్తరాల సమయములో చెప్పారు. ఇప్పుడు మన ప్రభుత్వము వారు బెజవాడలో 300 ఇండ్లుతో ఒకస్కీము finalise చేస్తున్నారు. ఈ నెలాఖరులో అది పూర్తిఅవుతుందని ఆశపడుతున్నాము. అవి కేంద్రప్రభుత్వానికి

Sri G. Latchanna] [27th July 1955

పంపించి ఈ యేడాదిలోనే 300 ఇండ్లు బెజవాడలో Industrial labour housing construction చేయడానికి ప్రభుత్వము ఒక నిర్ణయమునకు వచ్చింది. దానిమీద estimates, plans తయారు అగుచున్నవి. వాటిని కేంద్రప్రభుత్వమునకు పంపించి వారి ఆమోదాన్ని పొంది construction ప్రారంభిస్తామని, త్వరలోనే ఆ ఇండ్లుకట్టడానికి స్తోమత కలిగిన కంపెనీ యజమానులందరు ఈ స్కీము అమలు జరపడానికి పూనుకోవలసిందని మిగతా కంపెనీలనుకూడా హెచ్చరిక చేయడానికి ఒక సమావేశము జరిపించడానికికూడా ప్రభుత్వము ఆలోచిస్తున్నది. దీనినిగురించి ప్రభుత్వము అశ్రద్ధచేస్తున్నదని అభిప్రాయపడవద్దని మనవి చేస్తున్నాను.

తరువాత Advisory Board సలహాలను గురించి నరసింగరావుగారు చెప్పారు. మరి Advisory Board సలహాలను అనుసరించకూడదు, ఆలోచించకూడదు అనే తత్వముతో ప్రభుత్వము ఈ Advisory Board లను పెట్టుకొంటుంది అనే అపోహపడవలసిన అవసరములేదు. వాటితోటి అన్ని విషయాలు సాకల్యంగా చర్చించి, అందులోవచ్చిన నిర్ణయాలు అమలుపరచడానికి ప్రభుత్వము ప్రయత్నము చేస్తున్నది. అసాధ్యమైనవి ఏదో ఒకటి, ఒకటిన్నరపోవాలి తప్ప సాధ్యమైనంతవరకు అందులోవచ్చిన నిర్ణయాలన్నిటిని ప్రభుత్వము అమలుజరుప ప్రయత్నము చేస్తున్నదని మనవిచేస్తున్నాను. ఇంకా కొన్నివిషయాల్లో కొన్ని Points చెప్పారు. కాని ఇప్పటికే 7 గంటలు కావస్తున్నది. సభ్యులుచెప్పిన ప్రతి విషయముకూడా ప్రభుత్వదృష్టికి రాకుండా కొన్ని Departments లో ఉండవచ్చు. అందువల్ల ప్రభుత్వము ప్రతి డిపార్టుమెంటును అడిగి తెలుసుకొని ఆయా సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నం చేస్తుందని మనవి చేస్తున్నాను.

Transport workers ను గురించి ఇటీవల వచ్చిన తగాదాలను పరిష్కరించడానికి ట్రైపార్టైటు కమిటీని ఒకదానినివేసి Tribunal judge దీక్షితులు గారి అధ్యక్షతన ప్రభుత్వం ఏర్పాటుచేసి మన సమస్యలుఅన్నీ పరిష్కరించడానికి పూనుకున్న సంగతి మీ అందరికీ తెలుసును. కాని ప్రభుత్వము ఈ విచారణ చేయుటలో పక్షపాతదృష్టితోగాని, తారతమ్యములతోగాని ఏ కార్మికసమస్యను పరిశీలించడము జరగదనికూడా నేను మీకు హామీ యిస్తున్నాను. తప్పనిసరిగా ప్రతి విషయంకూడా వారికి న్యాయం కలిగించడానికి ప్రభుత్వము తన శక్తివంచన లేకుండా ప్రయత్నము చేస్తుందని అందుచేత గౌరవ సభ్యులు ఈ cut motions విరమించుకొని బలపరచవలసినదిగా కోరుచున్నాను.

* SRI RAJA SAGI SURYANARAYANA RAJU :—అధ్యక్షా, చిన్న information కావలసివచ్చింది. ఎందుచేతనంటే ఇప్పుడు చాలామంది నాయకులు factory లలో strike చేయిస్తున్నారు. కోర్టులలో తీర్పులకోసం పిస్తున్నారు. ఆ తీర్పులలో వారు illegal అని వచ్చిన తర్వాత ఆ leaders మీద ఏమి చర్య తీసుకుంటున్నదో కాస్త మనవిచేస్తారా.

THE HON. SRI G. LATCHANNA:—Illegal strikeకి వారు కోరిన కోరిక నెరవేరకపోవడమే ఒక చర్య. ఇంకా కాస్త శాంతియుత పద్ధతులను అతిక్రమిస్తే శాంతిరక్షణ చట్టాలు ఉన్నవి. దానిప్రకారంగా చర్యలు తీసుకుంటారు. ఎవరు ఏదృష్టితో చేసుకున్నా కార్మికునియొక్క సమస్య అక్కడవుంటే ప్రభుత్వం పరిశీలిస్తుంది. కార్మికసమస్యలు కాకుండా కేకలువేసే సమస్యలు ఉన్నవారికి కేకలు మాటలు మీరు ఇప్పుడు చెప్పినట్లుగా మిగిలిపోతాయి. అంతకంటే నేను దానిని గురించి యేమీ చెప్పలేను.

SRI RAJA SAGI SURYANARAYANA RAJU:—నేను చెప్పేది ఈ అమాయకులైన కూలీలు చాలా ప్రమాదములకు గురై వారి ఉద్యోగాలు పోతున్నాయని మనవిచేస్తున్నాను.

MR. SPEAKER :—మాట్లాడుతున్న మంత్రిగారు ఒప్పుకుంటేనే వారికి అడ్డుతగిలి మధ్యన మాట్లాడాలి. వారు ఒప్పుకోకపోయినప్పుడు మాట్లాడకూడదు.

THE HON. SRI G. LATCHANNA :— నేను మనవిచేసేదేమిటంటే ఎవరు యే ఉద్దేశాలతో కార్మిక సంఘములు నడపుచున్నా, కార్మికులుకూడా చైతన్యవంతులు అవుతున్నారని నా అవిశ్వాసం, నమ్మకం, మన సిద్ధాంతాలనే ఎల్లప్పుడు అందరిమీద అమలు చేయలేము. ఏదిన్యాయమో యేది అన్యాయమో తెలిసికోనే శక్తి వాళ్ళకు వస్తోంది. తప్పులుంటే దిద్దుకుంటున్నారు. అన్యాయం ఉంటే అడుగుచున్నారు. రాజకీయ ఉద్దేశాలతో కార్మికసంఘాలు నడిపేవారు ఉంటే వారికి రాజకీయ ఫలితాలు ఎల్లా ఉండాలో అల్లాగే ఉంటాయి. ఈ విషయంలో ఆందోళన చెందవలసిన పనిలేదని మనవిచేస్తూ ఈ డిమాండును యేకగ్రీవంగా ఆమోదించాలని కోరుచున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARULU :—లేబరు కమీషనరు సలహాలను డెవలప్‌మెంటు డిపార్టుమెంటు *అమలుజరపని విషయంలో Tribunal కు refer చేసే విషయం పునః ఆలోచిస్తారా?

THE HON. SRI G. LATCHANNA:—ఇంత చెప్పినా వెంకటేశ్వరులు గారు జనరల్‌గా చెప్పేదానికంటె ఫలానా సమస్యలంటే నేను పరిశీలిస్తాను.

SRI PILLALAMARRI VENKATESWARULU :—ఉయ్యూరు పంచదార ఫ్యాక్టరీ dispute విషయం Tribunal కు refer చేస్తారా ?

THE HON. SRI G. LATCHANNA:—మీరు వ్రాయవలసిందిగా కోరుచున్నాను.

All the cut motions were put to vote and lost.

MR. SPEAKER :—The question is :

"That Government be granted a sum not exceeding Rs. 6,57,500 under Demand No. XXIII—Labour including Factories."

The motion was carried.

MR. SPEAKER :—I now adjourn the House to meet again at 11-00 a.m. on Thursday, the 28th July, 1955.

The House then adjourned.



# INDEX

TO

# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

Volume V (Nos. 1 to 3)

25th to 27th July, 1955

PRINTED AT THE GOVERNMENT PRESS
HYDERABAD
1958

# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES.

VOLUME V (Nos. 1 to 3.)

*25th to 27th July,* 1955.

## TABLE OF CONTENTS.

# INDEX

## A



## B.

B.—(*Contd.*)

D.—(*Contd.*)

G.—(*Contd.*)

K.—(*Contd.*)

L—(*Contd.*)

N.—(*Contd*).

Q.—(*Contd*).

Q.—(*Contd*).

Q.—(*Contd*).



R

R.—(*Contd.*)

S.—(*Contd.*)

S.—(*Contd*).

10 081



V.—(*Contd*).



---

PRINTED AT THE GOVERNMENT PRESS
HYDERABAD
1959